# సనాతన ధర్మంలో సంఘసేవ



mohan
PUBLICATIONS
Mohanpublication.com
Granthanidhi.blogspot.in

కంచి పరమాచార్య

శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి వారి

అమృతవాణి చతుర్థ భాగము

# సనాతనధర్మంలో సంఘసేవ


అనువక్త:

దేవరకొండ శేషగిరిరావు



ప్రకాశకులు

మహా విద్యాపీఠం

హైదరాబాద్

# కంచి మహాస్వామి అమృతవాణి చతుర్థ భాగము

అనువర్త : దేవరకొండ శేషగిరిరావు

ప్రథమ ముద్రణ : అక్టోబర్ 2012

ప్రకాశకులు : మహావిద్యా పీఠం,
ఎయిర్‌ఫోర్స్ అకాడమీ రోడ్, దుండీగల్,
హైదరాబాద్-500 043, సెల్: 98854 44428



వెల : రూ. 125/-

ప్రతులకు : అన్ని ముఖ్యమైన పుస్తక విక్రయ కేంద్రాలు

టైటిల్ డిజైన్ : కె. రామకృష్ణ

ప్రింటింగ్ :కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, విద్యానగర్, హైదరాబాద్

# అనుగ్రహం

గృహస్థులు సన్యాసులకు భిక్షనీయడం ఆచారం, ధర్మం కూడా. సన్యాసి ఇచ్చే భిక్ష ఉందా? ఉంది. అది వాగ్రూప భిక్ష, అక్షర భిక్ష, తరతరాలను తరింపజేసే తరుగని భిక్ష.

కంచి మహాస్వామివారు తమిళంలో ప్రసంగించగా శ్రీ కంచి మహాస్వామి పీఠారోహణ శతాబ్ది మహోత్సవ ట్రస్టు, ముంబైవారు - ఆంగ్లంలో అనువదింపజేసిన సుమారు ఆరువేల పుటల పైబడియున్న ఏడు సంపుటాలను 2006లో 'వాయిస్ ఆఫ్ గాడ్' పేరుతో ప్రచురించారు.

ఇంతవరకు తెలుగులో అనువదింపబడని వాటిని, లేదా అసమగ్రంగానున్నవాటిని సమగ్రంగానూ తెనిగించి అందించడం లక్ష్యంగా నా అనువాదం సాగింది.

ఈ సంపుటంలోని విషయాలు సంఘసేవ - ఆచారములు - ఆహార నియమములు. ఇవి ఆంగ్లంలోని మూడవ సంపుటంలో ఉన్నాయి. ఈ పై విషయాలు తెలుగులో లోగడ సాధన గ్రంథ మండలి - తెనాలివారు ప్రచురించిన జగద్గురు బోధలలో సంక్షిప్తంగా ఉన్నాయి. ఇప్పుడు వాటిని సమగ్రంగా అందించగలిగాను.

నా ఇతర రచనలతోబాటు స్వామివారి అద్వైతసాధన, గురు సంప్రదాయం, అమృతవాణి పేరుతో 1. అద్వైతం 2. నమోనమః 3. షట్పదీస్తోత్రంతో బాటు దీనిని ప్రచురించుటకు ముందుకు వచ్చిన సనాతన ధర్మాభిమానులైన శ్రీ వావిలాల ఉమాపతి C.A. గారికి హృదయ పూర్వక అభినందనలు, అభివందనములర్పిస్తున్నాను.

-దేవరకొండ శేషగిరిరావు

Tel : 044-27222115 E-mail : skmkanci@md3.vsnl.net.in
Fax: 044-27224305, 37290060

Sri Chandramou'eeswaraya Namaha:
Sri Sankara bhaghavadpadacharya Paramparagatha Moolamnaya Sarvagnapeeta :

His Holiness Sri Kanchi Kamakoti Peetadhipathi
**JAGADGURU SRI SANKARACHARYA SWAMIGAL**
Srimatam Samsthanam
No. 1, Salai Street, KANCHIPURAM - 631 502

---

# ఆశీర్వచనము

**1-9-2012**

సర్వప్రాణిహితమయినవియు, సర్వధర్మ మూలమయినవి యగు వేద వేదాంగముల యొక్కయు షడ్దర్శనముల యొక్కయు సారభూతమైన విషయములు మా గురుదేవులు, జీవన్ముక్తులైన కంచి శ్రీ మహాస్వామివారు అతి చిన్న మాటలలో సులభ గ్రాహ్యముగా రమారమి ఎనుబది ఆరు సంవత్సరముల పీఠాధిపత్య కాలములో మానవాళి పై వారికి గల అపారమైన కరుణ కారణముగా అనేక భాషణములలో విడమరచి చెప్పియున్నారు. వానిలో అత్యల్పమైన భాగము దైవత్తిన్ కురల్ అను పేర ద్రవిడ భాషలో ఏడు సంపుటములుగా వెలువరించబడినవి. మహాస్వామివారి శత జయంత్యుత్సవ సందర్భముగా వివిధ భాషలలో అనువాదము చేయబడిన ఈ సంపుటములు ఆంగ్లములో 'వాయిస్ ఆఫ్ గాడ్' పేర అయిదువేల పుటలకు పైగా ఏడు సంపుటములుగా వెలువరించబడినవి.

అందు కొన్ని విషయములు ఇతఃపూర్వమే తెలుగు భాషలో ముద్రించబడినవి. ముద్రితము కాని అంశములు ప్రకాశములోనికి తీసుకొని రావలయునెడి సదుద్దేశ్యముతో శ్రీ మఠపు శిష్యులయిన మహావిద్యాపీఠము, హైదరాబాదు వారు సంకల్పించినారు. ఇంతవరకు అట్టి ప్రయత్నమున

అయిదు చిన్న సంపుటములగా కొన్ని అంశములు ప్రచురించినారని తెలుసుకొని సంతసించినాము.

ప్రస్తుతం చతుర్థ భాగముగా వారు ప్రచురించుచున్న ఈ పుస్తకములో 'వాయిస్ ఆఫ్ గాడ్'లో ఉన్న కొన్ని అంశములు – సంఘసేవ, ఆచారములు – ఆహార నియమములు అను అంశములున్నవి. దీనిని ప్రఖ్యాత పండితులు శ్రీ దేవరకొండ శేషగిరిరావుగారు అనువదించినారు. అనువాదము సరళముగా, సూటిగా తేటతెల్లముగా ఉన్నది.

సంఘసేవ భారతీయులకు తెలియదన్న విదేశీయుల వాదన స్వామి వారీ గ్రంథమున సోపపత్తికంగా ఖండించారు. ఇతరులకు మనం చేసే సహాయం వారికేదో మేలు చేస్తున్న భావంతో కాక మన ఆత్మోన్నతికై మనకు లభించిన అవకాశం అనే భావంతో చేయాలని చెబుతారు. త్యాగం చేయడమే కాదు త్యాగం చేస్తున్నారనే భావము త్యజించాలనేది వారి ఉపదేశం. ఇట్టి ఎన్నో మహోన్నతమైన ఉపదేశములు ఈ గ్రంథములో ఉన్నవి.

తెలుగువారికి మహోపకరమయిన ఈ కార్యక్రమములో పాలు పంచుకొనిన అనువక్త కాకినాడ పురవాసులు శ్రీ దేవరకొండ శేషగిరిరావుగారు, ప్రచురించిన మహా విద్యాపీఠము, హైదరాబాదువారు, ఇంకను ప్రేరకులు, అనుమోదకులు మా గురుదేవుల యొక్కయు, మహా త్రిపుర సుందరీ చంద్రమౌళీశ్వరుల యొక్కయు అనుగ్రహము వలన సర్వాభీష్టములను పొందగలరు గాక యని నారాయణ స్మృతి పూర్వకముగ ఆశీర్వదించు చున్నాము.

ఇతి నారాయణ స్మృతిః

# విషయ సూచిక

## సంఘసేవ

ఆచారములు

ఆహార నియమాలు

# సంఘసేవ

## పరోపకారం

ఈ ఆధునికకాలంలో అశ్వమేధయాగం చేయడం సాధ్యమేనా?

ఇదేమి ప్రశ్న? స్వామివారు సరిగా మాట్లాడుతున్నారా? అని సందేహం కల్గుతోంది కదా! పూర్వకాలంలో ఏ కొద్దిమంది మహారాజులో దీనిని నిర్వహించేవారు. రాజు పట్టాభిషిక్తుడైన తరువాత నాల్గుమూలలా తిరగడానికి ఒక అశ్వాన్ని విడిచిపెట్టేవారు. ఎవ్వరూ దానిని బంధించకపోతే ఆయా ప్రాంతాలను ఆ రాజు గెలిచినట్లే. ఎవరైనా అడ్డుకొంటే వారితో ఇతని సైన్యం యుద్ధం చేసేది. అట్టిదానిని ఈ రోజులలో ఎవరూ చేయలేరని భావిస్తారు కదా! మనలో ఎవడైనా చేయగలడా అని ప్రశ్నించడానికి బదులు మనమందరమూ చేయగలమా? అని ప్రశ్నిస్తున్నానని గమనించండి.

సాధ్యాసాధ్యాలను ప్రక్కన పెట్టండి. అసలెందుకు చేయాలి? అది కీర్తి ప్రతిష్ఠలను సాధిస్తుందనా? ఇంద్రలోకం వస్తుందనా, ఇవే ప్రయోజనాలైతే దీనిని చేయనవసరం లేదు. ఆ కీర్తి ప్రతిష్ఠలు, ఇంద్రలోక ప్రాప్తులు - ఇవన్నీ మనలోని అహంకారాన్ని రెచ్చగొట్టేవే. వీటివల్ల పిసరంత జ్ఞానం రాదు. అయితే ఎందుకు?

లలితాత్రిశతి వేదంలో లేకపోయినా దానికి చాలా ప్రశస్తి ఉంది. హయగ్రీవుని నుండి అగస్త్యుడు లలితా సహస్రనామాలను ఉపదేశం పొందాడు. ఉపదేశం పొంది మనశ్శాంతిని పొందాడు. ఈ త్రిశతికి శంకరులు భాష్యం వ్రాసేరు. నామాలు, త్రిశతి - ఈ రెండూ మంత్రతుల్యములే. కనుక వీటిని రక్షించుకోవాలి.

ఈ త్రిశతిలో 'హయమేధ సమర్చితా' అనే నామం వస్తుంది. గుర్రం వంటి ముఖంతో విష్ణు వుండడం వల్ల హయగ్రీవుడయ్యాడు. అశ్వమేధ యాగం చేత ఆమె అర్చింపబడేది కనుక అమ్మవారు హయమేధసమర్చిత అయింది.

మరొక విధంగా చెప్పాలంటే అశ్వమేధం చేస్తే అమ్మవారిని అర్చించినట్లే. భాగ్య భోగ్యాలకు, స్వర్లోక సౌఖ్యానికి యాగాలు చేస్తూ ఉంటారు. ఇంతకంటె చిత్తశుద్ధిని పొందడమే ఫలం. యాగం చేయడం వల్ల చిన్న చిన్న శక్తుల నీయడమే కాదు, అన్ని పురుషార్థాలనూ ప్రసాదిస్తుంది. ఆమె సంతోషపడితే మోక్షసామ్రాజ్యలక్ష్మినీ ప్రసాదిస్తుంది. ఈ మోక్షం అన్ని సుఖాలకు అతీతం. కనుక ఇహ పరలోక సుఖాలనందిస్తుంది. ఎందుకిది చేయాలని ముందు ప్రశ్న వేసాను. సమాధానం దొరికింది కదా!

ఈ త్రిశతి పారాయణంలో చాలా నియమాలున్నాయి. ఇట్టి యజ్ఞ నియమాలు ఈ కాలంలో కుదరని మాట.

అట్లా అని అశ్వమేధయాగం చేయకుండా ఉందామా, కాదు. అందరికీ వీలుపడే ఒక రకమైన అశ్వమేధయాగం, దానిని శాస్త్రం చెప్పింది. ఇతరుల పట్ల దయ చూపించి సేవ చేయగలిగితే అశ్వమేధఫలం వస్తుందని పూర్వులన్నారు.

## ఆశించకుండా సేవించుట

ఇపుడు జీవకారుణ్యమని పరోపకారమనే మాటలను వాడాను కదా. ఆలోచిస్తే ఈ రెండు మాటలూ తప్పే.

ఇతరుల మీద చూపించేది కరుణ కదా! ఇందులో కరుణ చూపించేవాడు ఒక మెట్టు పైన ఉన్నాడు. చూపింపబడేవాడు, క్రింద మెట్టున ఉన్నాడు. ఎప్పుడైతే ఆ భావన వచ్చిందో మనం చూపే కరుణ; కలంకితమౌతోంది.

కనుక కరుణ చూపించేటపుడు మనలో వినయముండాలి. అహంకారం లేకుండా ఉండాలి. ఆత్మోన్నతికై పాటు పడదానికి బదులు అధమగతిని తీసుకొని వస్తున్నామేమో అని గమనించాలి.

కనుక కరుణకు బదులు ప్రేమ అనే పదాన్ని వాడి చూడండి. ప్రేమలో ఎక్కువ తక్కువలుండవు. జాలిని చూపించేవాడొకడు, చూపింపబడేవాడొకడనే భేదం ఉండదు. అయితే ఈ ప్రేమను చూపించడం అంత తేలిక కాదు.

. తిరువళ్ళువర్ ఈ భేదాన్ని గుర్తించాడు. అంబు (ప్రేమ), అరుల్ (దయ) అనే మాటలు వాడాడు. దయ, ప్రేమకు కలిగిన సంతానమన్నాడు.

మనమెవరిని ప్రేమిస్తాం? మనదగ్గరివారిని కదా! ఈ ప్రేమ పరిధిని పెంచి చూడండి. బంధువుల కంటె మొత్తం గ్రామాన్ని, గ్రామం కంటె మొత్తం దేశాన్ని; దేశం కంటె మొత్తం ప్రపంచాన్ని ప్రేమించగలిగితే ప్రేమనుండే ఈ దయ పుట్టినట్లు అవగతమౌతుంది. దయాస్థానాన్ని ప్రేమ ఆక్రమిస్తుంది. ప్రేమించడం సహజమైపోతుంది. ఆ ప్రేమ ఇక స్వార్థం గురించి కాదు. నిస్స్వార్థమైన ప్రేమగా రూపొందుతుంది.

దయ ఎప్పుడు పుడుతుంది? అందరిలోనూ ఒక ప్రాణశక్తి ఉంది, అందరిలోనూ ఈశ్వరుడున్నాడనినపుడు తన బంధువుల్ని ప్రేమించదానికి బదులు క్రమక్రమంగా అందరూ ఈశ్వర సంతానమని భావించి సేవ చేస్తాడు. వైష్ణవులు నైచ్యం అని వాడుతారు. అనగా తాను తక్కువ వాడనని, ఇతరులు తనకంటె ఎక్కువవారనే భావన కలగడమే నైచ్యానుసంధానం. అపుడు మాటలలో ప్రేమను ఒలకబోయడానికి బదులు చేతలలో చూపించి దయగా రూపొందుతుంది. అప్పుడు తామధికులమనే భావన పోయి అందరినీ ఈశ్వర రూపాలుగా భావించి ప్రేమగా మారి ఎవర్ని సేవించినా ఈశ్వరుని సేవించినట్లే భావిస్తాడు. దయా పూర్వకమైన క్రియ ఉన్నపుడు పరమేశ్వరానుగ్రహం తనంతట తానే వస్తుంది.

దయ చూపించినపుడు తానొకరి పట్ల దయ చూపిస్తున్నానని, ఎవరికో సాహాయ్యం చేస్తున్నాననే భావనను ఎంతమాత్రం రానీయకుండా ఉంటే అభ్యుదయం. ఆ భావన లేకపోతే అహంకారం ఇంకా పెరుగుతుంది.

ఆ సందర్భంలో జీవకారుణ్యం, పరోపకారం అనే మాటలు పనికిరావని అన్నాను, తాను చేసే సేవ ఇతరులకు ఉపయోగించకపోయినా, పై సంస్కారవంతునికి చిత్తశుద్ధికై ఇది తోడ్పడుతుంది. చిత్తశుద్ధి ఏర్పడితే తనకు తాను ఉపకారం చేసుకొన్నట్లవుతుంది. అనగా అట్టి సేవ స్వయం ఉపకారమే.

అద్వైత భావన కలవానికి అందరూ ఈశ్వర స్వరూపంగానే కన్పిస్తారు కనుక ఉపకారం చేయడం అతని సహజధర్మమే. అయినా అపుడు కూడా పరోపకారం అనకూడదు. ఎందుకంటే తనకంటె భిన్నంగా మరొకటి లేదు కదా! అందుకే అప్పర్‌స్వామి, నా ధర్మం సేవ చేయడమే, దానికి కట్టుబడి యుండడమే అన్నాడు.

సేవాధర్మం ప్రేమతో, ఉత్సాహంతో హృదయపూర్వకంగా ఉండాలి. ఏదో మొక్కుబడిగా కాదు. ప్రపంచంలో ప్రతి ప్రాణి పరస్పరం ఇచ్చి పుచ్చుకొంటోంది. మనం ప్రాణివర్గం నుండే కాదు, అప్రాణి వర్గం నుండి లాభాన్ని పొందుతున్నాం. అందువల్లనే వీటి ఋణం తీర్చడం కోసం కొన్ని వైదిక క్రియలను చేస్తున్నాం. అందుకే జడంగా భావింపబడే భూమికి, నీటికి, అగ్నికి ఋణం తీర్చుకోవాలి.

చెట్లకు ప్రాణాలున్నాయని జగదీశచంద్ర బోస్ ఒక్కడే కనుగొనలేదు. మొక్కలలో ప్రాణం ఉంటుందని, అంతేకాదు, వాటికీ సుఖదుఃఖాలుంటాయని పూర్వులు గ్రహించి చెట్లను పూజించారు. మట్టికి సంబంధించిన మృత్తికాసూక్తం, దూర్వలకు సంబంధించి దూర్వాసూక్తం ఉంది. నిత్యం చేయవలసిన బ్రహ్మయజ్ఞంలో తర్పణాలుంటాయి. దేవ, ఋషి, పితృ తర్పణాలవి.

ఒక కాకి ఎక్కడో ఏదో తిని రెట్ట వేస్తే ఒక మొక్క మొలుస్తోంది. అది పెద్ద చెట్టై మనకు ఉపయోగించడం లేదా? కుక్క కాపలా కాస్తోంది. గుఱ్ఱం బండి లాగుతోంది. భౌతిక, ఆధ్యాత్మిక సుఖాలందిస్తోంది గోమాత. ఇట్లా మనకు అన్నీ ఉపకరిస్తూ ఉంటే తిరిగి ఋణం తీర్చుకోవద్దా? అని మనువు, వ్యాసుడు, తిరువళ్ళువర్ వంటివారు హెచ్చరించారు.

మంత్రాలనుచ్చరించో, దేశాచారాలను పాటించో ఇట్లా పూజిస్తే జడమనేవి కూడా తృప్తిని పొందుతాయి. చెట్లకు నీళ్ళు పోస్తాం. జంతువులను ప్రేమిస్తాం. వాటిని మనం మూగజీవులని అంటాం. పశువులకై చెఱువులను త్రవ్వేవారు. ఎక్కడికి వెళ్ళి మేసినా వాటికి నీటికొరత ఉండకూడదని తహతహలాడేవారు. వాటి ఒంటికి దురద పుడుతుందని మధ్యలో స్తంభాలను రాళ్ళను పాతేవారు. ఈ పనులన్నిటినీ ధర్మాలన్నారు. వాటికున్న సమస్యలు తక్కువగా ఉంటే మానవునకు అనేక సమస్యలు. ఇందు మూఢునంతులు కాని తెచ్చుకొన్నవే.

ఆస్పత్రులు, కారాగారాలు, అనాథాశ్రమాలు, విధవా మందిరాలు, భిక్షుక నిలయాలు మొదలైనవాటిని చూస్తే ఎందరెందరో ఎన్నో బాధలు పడడం మనం గమనిస్తాం. మనం కొన్నిటిని పరిష్కరించగలం. పరమేశ్వరుడెట్టి రూపాలనెత్తి కన్పిస్తాడో గమనించగలం.

ఇట్టివారికి సాధ్యమైనంతగా చేయూతనందీయడం మన కర్తవ్యం. శారీరకంగా, ధనరూపంగా, మంచి మాటల రూపంలో సేవలందించవచ్చు.

కనుక ఇదంతా ధర్మం. అయితే వారి బాధను మనం పోగొట్టుచున్నామనే భావన మాత్రం రానీయకుండానే సేవ చేయాలి. అపుడు చిత్తశుద్ధి మనకేర్పడుతుంది. ధర్మం యొక్క సారం చిత్తశుద్ధియే యని తిరువళ్ళువర్ అంటాడు.

## లోపలి పవిత్రత ముఖ్యం

ధర్మం అంటే మనస్సులో పవిత్రంగా ఉండుట, దుర్భావాలు రాకుండా చేయడమే అని అతనంటాడు. వైదికమైన సంప్రదాయాన్ని పాటిస్తూ, కర్మానుష్ఠానం చేయడమే ధర్మమంటాడు. కర్మను చేయడానికి ముందు చిత్తం పవిత్రంగా ఉండాలి కదా! ఇది లేకుండా సంఘసేవ చేయడం నిష్ప్రయోజనమే.

అహంకారం పోగొట్టుకోవడానికి చేయవలసిన వాటిని వినయం లేకుండా, భక్తి ప్రేమలు లేకుండా చేస్తే అహంకారాభివృద్ధి అవుతుంది కాని అణుమాత్రం తగ్గదు. ఇది ఎట్లా ఉంటుందంటే స్నానం చేయడానికి ముందు మురికి కూపంలో దుమికినట్లే.

పవిత్రంగా ఉండటమంటే అది స్వార్థం అని భావించకూడదు. ఇది ప్రపంచ వ్యవహారాలలోని స్వార్థపరత్వం కాదు. మామూలు స్వార్థం ఇంద్రియాల వెంట బడేది, ఇతరులను బాధించియైనా నెరవేర్చుకొనేది. మనం బాధ పడైనా ఇతరులకు సాయం చేయడమే అసలైన స్వార్థం.

ఉపకారం చేయాలన్నారు. ఇతరులకే చేస్తే సరిపోతుందా? భగవానుడు మనకు ప్రాణాన్ని, మనస్సును ఇచ్చాడు. జీవుడుంటాడు, ఆ జీవాత్మకు సాయం చేయవద్దా! ఆ జీవాత్మకు ఆనందం కల్గించవద్దా? కనుక సంకుచితమైన స్వార్థపరత్వం కంటె ఉన్నతిని తీసుకొని వచ్చే స్వార్థానికై ప్రయత్నించాలి.

మన మనస్సు పవిత్రంగా ఉంటే ఇతరులకు చేసే సాయం ఫలిస్తుందని అంటున్నాం. అయితే పరోపకారం చేయడం వల్ల మన మనస్సు పవిత్రమౌతుందని అనడం పరస్పర విరుద్ధంగా లేదా? అయితే సంఘర్షణకు తావులేదు. అసలు మనస్సు పవిత్రంగా ఉండాలని ముందు భావించాలి. మనస్సును లొంగదీయడం మనమనుకొన్నంత తేలిక కాదు. అది మంచి

మార్గంలో ఉండాలనే సంకల్పం ముందు గట్టిగా ఉండాలి. దానిని మంచిమార్గంలో పెట్టడానికి సేవ చేయాలి. పైవి రెండూ పరస్పరం దోహదం చేస్తాయి. సేవ వల్ల క్రమక్రమంగా మనస్సు శుద్ధి పొంది, చేసే పనులకు పవిత్రత సిద్ధిస్తుంది. తనంతట తాను ఇట్లా సంఘసేవ, ఆత్మోన్నతి ఒకదానికొకటి బలాన్ని కల్గిస్తాయి.

బాహ్య ప్రపంచం యొక్క బాధలను పోగొట్టడం మన చేతిలో లేదు. అనేక కర్మలలో అనేక బాధలు పడుతూ ఉంటారు. ఇతరుల కర్మలను మనం తొలగించలేకపోయినా సేవ వల్ల మనకు కర్మక్షయమవుతుంది. నీవు చేసే సేవ ఫలించిందా, లేదా అని చూడకు, నీ సేవ వల్ల నీ మురికి పోయిందా లేదా అని చూడు, నీకే తెలుస్తుందని, ధర్మఫలం రుచిని నీవే గ్రహించగలవని తిరువళ్ళువర్ అందుకే అన్నాడు.

## వైదిక మతం - సంఘసేవ

బుద్ధుడు, జీసస్, మహమ్మద్ ప్రవక్త, అహింస, ప్రేమ, సోదరత్వం గురించి మాట్లాడినట్లు వైదికమతం వాటిని గురించి మాట్లాడదని; ఎప్పుడూ కర్మానుష్ఠానం, యజ్ఞ యాగాలు, తర్పణాలు, పూజ, ఉత్సవాలు, ఉపవాసం, యోగం, ఆత్మజిజ్ఞాస మొదలగు వాటి గురించే మాట్లాడుతుందని దయగురించి పల్లెత్తు మాట కూడా చెప్పదని మనలను విమర్శిస్తూ ఉంటారు. మడి, ఆచారం, కర్మలలో మునిగి తేలేవారిని చూస్తే అట్లాగే అనిపిస్తుంది. క్రైస్తవ మిషనరీలు చూపే ఉత్సాహాన్ని వీరు చూపరు.

అయితే ప్రతివర్ణం వారు పాటించవలసిన ఆత్మగుణాల నెనిమిదింటిని ఏనాడో చెప్పారు. వాటిని సామాన్య ధర్మాలన్నారు. అందు మొదటిది అహింస. తరువాత సత్యం వస్తుంది. 'సత్యం భూతహితేరతం' అని ఉంది.

అంటే ఉన్నది ఉన్నట్లు చెప్పడం సత్యం కాదని, సర్వప్రాణులకు హితాన్ని కల్గించేది సత్యమని అన్నారు. ఈ ఎనిమిదింటిని 40 సంస్కారాల ముందుంచారు. (ఈ ఎనిమిదింటిని ఆచరించక 40 సంస్కారాలు చేసినా వ్యర్థమని అన్నారు) అన్ని ప్రాణులపట్ల దయ చూపించాలని 'దయా సర్వభూతేషు' అని అన్నారు.

ప్రాణులపట్ల దయ లేకుండా భగవానుడే తనపై దయ చూపించాలని పూజలు, యాగాలు చేయడం వ్యర్థం. ఇతరులపట్ల దయ చూపించలేని దానిని తానడగడంలో అర్థం ఉందా? లోగడ చెప్పినట్లు ఇతరులకు సేవ, కర్మానుష్ఠానం పూజ కలిపే కొనసాగించాలి, ఒకదానికి ఒకటి తోడ్పడేరీతిలో.

తెల్ల దొరల పాలన వచ్చిన తరువాత ఇది ప్రాచీనాచారమని, ఇది సేవయనే వింగడింపు కన్పించింది. అంతకుముందు ఆచారంలో ఆరితేరినవారూ, ఇతరులు చూపే గౌరవ ఆదరాలకు పాత్రులై యుండేవారు. వీరూ సేవ చేసినవారే. అప్పయ్య దీక్షిత, గోవింద దీక్షిత, తిరువిసనల్లార్, అయ్యనార్ వంటి మహాత్ములు సంఘసేవలో సిద్ధహస్తులే. ప్రజలూ వారిని అమితంగా గౌరవించేవారు.

విడివిడిగా వర్ణాలని, ఆశ్రమాలనే విభజన ఉన్నా సంఘసేవ చేయక పోవడం అంటూ లేదు. ఈ రోజు సంఘసేవ పేరుతో విపుల ప్రచారం సాగుతోంది. చిత్రపటాలు, పత్రికా ప్రకటనలు, సభలు మొదలైనవి హడావిడి అంతా ఇంతా కాదు. ఇట్టి ప్రచారం లేకుండా సంఘసేవ నిరాఘాటంగా పూర్వం సాగేది.

తెల్లదొరల పాలన వల్ల ఆచారాలు మంట గలిపే సందర్భంలో తాము పాటించే ధర్మాలకు విపత్తు వస్తుందని సంఘంలోని కొందరు సనాతనులు దూరదూరంగా ఉన్నట్లు పైకి కన్పిస్తుంది. శాస్త్రాచారాలను పాటించేవారిని చూసి వీరిలో దయాగుణం లేదనే ప్రచారం ముమ్మరంగా సాగింది.

ధర్మాన్ని ఆచరించేటప్పుడు బాగా కలిసి మెలసి యుండకూడదు. మరీ దూరదూరంగానూ ఉండకూడదు. కాని భావసమైక్యం మాత్రం ఉండాలని, అందరూ ఈశ్వరపుత్రులనే భావన ఉండాలని అనడం ప్రాచీన పద్ధతి. ఈ ఆలోచనా సరళి క్రమక్రమంగా క్షీణించగా సంఘ సంస్కర్తలు ప్రబలి ఆచారాలను ఖండించడం మొదలు పెట్టారు. అందరూ అన్నివిధాల సమాన మంటున్నారేమిటని, తమ ఆచారాలకు ఎక్కడ భంగం వాటిల్లుతుందో అని దూరదూరంగా ఉండటం మొదలు పెట్టారు సనాతనపరులు.

ఆ సందర్భంలో ప్రేమ, ఐకమత్యం వంటి మాటలకు విలువ లేకుండా పోయింది. ఆచారపరులకు దయ యుండదనే ప్రచారం మొదలైంది. సంస్కారాలకెంత ప్రాధాన్యమిచ్చారో ఆత్మ గుణాలకూ అంతే ప్రాధాన్యమిచ్చారు పూర్వులు. అందు ప్రధానమైనది దయ. యాగాలు చేసిన రంతి దేవుని వృత్తాంతం వినండి.

## రంతి దేవుడు

చంద్రవంశానికి చెందినవాడు రంతి దేవుడు. ఇతడనేక యజ్ఞాలు చేసినట్లు మహాభారతం అంటోంది. ఇట్టి కర్మానుష్ఠానాలవల్ల అతని దయాగుణం ఇంకిపోలేదని భాగవతం లోని కథ చెబుతోంది.

ఇష్టాపూర్తములని అంటారు. ఇష్టమనగా యాగాలు చేయుట; దశరథుడు పుత్రకామేష్టిని చేసాడని మనకు తెలుసు. అనగా కొడుకు కోసం చేసే యాగం.

మనలో సంఘసేవ లేదనేవారు ఈ 'పూర్త' శబ్దార్థాన్ని గ్రహించండి. బావులు, చెరువులు త్రవ్వించటం, రోడ్లు వేయించుటం, దేవాలయాలను నిర్మించటం మొదలైనవి అన్నీ పూర్తములే. కొందరే 'ఇష్టాన్ని' చేయగలరు. 'పూర్త' మట్టిది కాదు. అది వీరూ వారూ అనే భేదం లేకుండా అన్ని వర్ణాలవారూ చేసేది. వివరాలు తరువాత వివరిస్తాను. ప్రస్తుతం రంతిదేవుని కథ.

ఇతడనేక యాగాలు చేసి, భూరిదక్షిణలిచ్చాడు. ఖజానా ఖాళీ అయిపోయింది. చిల్లి గవ్వకూడా లేదు. దేహి అని ఎవరు వచ్చినా ఉన్నదేమైనా ఇచ్చేవాడు.

ఆ సందర్భంలో మహావిష్ణువు ఇతనికొక పరీక్ష పెట్టాడు. కరువు కాటకాలను సృష్టించాడు. వర్షం పడడానికే యాగాలు చేస్తారు కదా! దానికి బదులు కరువు తాండవించింది.

అన్నీ దానం చేయడం వల్ల ఇతని కుటుంబం చివరకు గంజికి కూడా నోచుకోలేకపోయింది. ఆతడిచ్చేవాడే గాని ఎవ్వర్నీ దేహి యని అడిగేవాడు కాదు. కుటుంబం, 48 రోజులు ఇలా ఉండడం విని ప్రజలు 49వ రోజున కొంత గంజిని, ప్రోగుచేసి ఇచ్చారు.

దాన్ని ఇతని కుటుంబం త్రాగబోతూ ఉంటే ఒక బ్రాహ్మణుడు వచ్చి భిక్షాందేహి యనగా రాజు కొంత ఇచ్చి వేసాడు. ఈ సమయంలో టిచ్చుగాడు రావడమేమిటని విసుక్కున్నాడా? నారాయణునిగా అతడిని భావించాడు. ఇతని భార్య, పిల్లలు తమ వంతులో కూడా కొంత ఇచ్చివేసారు. మిగిలిన కొంచెం దానిని త్రాగడానికి సిద్ధపడగా నాల్గవ జాతికి చెందినవాడు వచ్చి దేహి అని అడిగాడు. ఆకలికి వర్ణ వయో భేదాలుంటాయా? ఆఖరుగా మిగిలిన కొద్దిపాటిదైనా త్రాగడానికి సిద్ధపడితే ఒక మనిషి కంఠం, కుక్కల అఱుపులు వినబడ్డాయి. ఎదురుగా ఒక వేటగాడు వచ్చి నిలబడ్డాడు.

వారినీ నారాయణ స్వరూపులుగా భావించాడు రంతిదేవుడు. పరమేశ్వరుడు కుక్కల రూపంలో, వేటగాని రూపంలో ఉంటాడని నమక మంత్రాలలో ఉంది. ఇక గీతలో 'శుని చైవ శ్వపాకేచ పండితాః సమ దర్శినః' అని ఉంది కదా! అంటే కుక్కలో, కుక్క మాంసం తినే చండాలునిలో బ్రహ్మను, జ్ఞానులు చూస్తారని ఉంది.

నారాయణుడిట్లా వచ్చాడని వీరి ఆకలిని తీర్చాలని ఉన్నంత గంజిని అతని ముందు పెట్టారు. కుక్కలకు నమస్కారం, వాటి యజమానికి నమస్కారమని నమక మంత్రాలలో ఉంది కదా.

ఇక రంతి దేవునికి మిగిలినది నీళ్ళే. ఆ కఱవులో నీరు దొరకడమూ కష్టమే.

భగవంతుడు పరీక్షించడం మానాడా? ఈ గ్రుక్కెడు నీళ్ళు త్రాగడానికి రంతిదేవుడు సిద్ధపడగా, అయ్యో! నాకు దాహంగా ఉందనే మాట వినబడింది. అది ఒక చండాలుని వాక్కు. ఇక్కడ రత్నాలవంటి రెండు శ్లోకాలున్నాయి భాగవతంలో.

న కామయేఽహం గతిమీశ్వరాత్
పరామష్టర్ధియుక్తా మపునర్భవం వా
ఆర్తింప్రపద్యేఽఖిల దేహభాజామంతః
స్థితో యేన భవన్త్య దుఃఖాః

అష్టసిద్ధులని వింటున్నాం. అష్టబుద్ధులు, అష్టర్ధి పదప్రైంది. నాకు అష్టసిద్ధులూ అక్కరలేదని, అవి కావాలని పరమేశ్వరుని అడగడం లేదని అన్నాడు. అయితే మోక్షం కావాలని కోరుకుంటాడా? అదీ అక్కఱ లేదు. అయితే దేనిని కోరుతున్నాడు?

ఎన్నో ప్రాణులు ఎన్నో విధాల బాధ పడుతున్నాయి. ఆర్తియనగా బాధ. అది హృదయం వల్ల తెలుస్తుంది. ఇట్లా అన్ని ప్రాణుల హృదయాలలోనున్న బాధలను గ్రహించే శక్తినిమ్మని అందరి బాధలను తానను భవించునట్లుగా చేయమని అన్నాడు. తానను భవిస్తే వారికిక బాధలుండవు కదా అన్నాడు.

చెడ్డ కర్మవల్ల దుఃఖం వస్తోంది. ఇతరుల పాపాలను తాను మోసి అనుభవింపగా ఒకరి బాధలను ఒకరు మోసినట్లైంది. జీసస్ ఇట్లా పాపుల

పాపాలను మోస్తున్నాడని అందువల్ల అతడు శిలువ నెక్కాడని అంటారు క్రైస్తవులు. ఈ మార్గం మనకేమీ క్రొత్తకాదు. **అఖిలదేహభాజాం అర్తిం ప్రపద్యే** అనగా సమస్త ప్రాణుల బాధలను స్వీకరించునట్లుగా అనుగ్రహించుమని రంతిదేవుడనలేదా?

ఇక్కడ ప్రపద్యే అనే పదం వాడబడింది. అనేక స్తోత్రాలలో ఈ పదం వస్తుంది, ప్రధానంగా వైష్ణవ సాహిత్యంలో. **శరణం ప్రపద్యే** అని. దుర్గా సూక్తంలోనూ ఉంది. అనగా నేను శరణు పొందుతున్నానని అర్థం. అట్టి ప్రపత్తి భావనతో ఉన్నవాడు తనలో ఏమీ లేదని అంతా ఖాళీయని, ఆ ఖాళీని నింపుమని అర్థం. అట్లాగా ఫలానా స్వామికని అంటాం. ఉపనిషత్తునందు శాంతి పాఠంలో ముముక్షువునైన నేను, మోక్షానికై శరణు జొచ్చుతున్నానని ఉంటుంది. ఇక్కడా శరణం ప్రపద్యే అని ఉంటుంది. రంతిదేవుడేమన్నాడు? అర్తింప్రపద్యే అన్నాడు. అనగా బాధను, కష్టాన్ని శరణు జొచ్చుతున్నానని అన్నాడు. పరమాత్మ నాపట్ల అనుగ్రహం చూపించుగాక అని అనడం లేదు. ప్రపంచంలో ఉన్న బాధలన్నీ నన్ను చేరుగాక, వాటికి శరణుజొచ్చుతున్నానని అన్నాడు.

అందరూ సుఖంగా ఉండాలని కోరుకొంటారు కదా! అందరి బాధలు నన్ను వచ్చి చేరుగాక అని రంతిదేవుడన్నాడు. అందువల్ల వారి బాధలనుండి విముక్తులౌతారని అంటున్నాడు. తరువాతి శ్లోకం:

**క్షుత్ తృట్ శ్రమో గాత్ర పరిశ్రమశ్చ**
**దైన్యం క్లమః శోకవిషాద మోహాః**
**సర్వే నివృత్తాః కృపణస్యజంతోః**
**జిజీవిషోః జీవజలార్పణాన్మే**

ఈ శ్లోకం చదువుతూ తనకున్న కొద్దిపాటి నీటినీ విడిచిపెడుతున్నాడు. నేనీ నీటిని ఇస్తున్నా. ఇది ఇతని దాహాన్ని పోగొడుతోందా? కాదు. ఇతడ్డి

నారాయణునిగా భావించి ఇస్తున్నా. ఆయన అందరి జీవులలోనూ ఉన్నాడు. అందువల్ల అందరి దాహం పోవుగాక, అందరి బాధలు పోవుగాక అన్నాడు.

ఒకనికి నీరు ఇస్తే, అందరి దాహం ఎట్లా పోతుందని శంకిస్తున్నారు కదూ!

అక్షయపాత్రలో అంటుకొన్న చిన్న కూర ముక్కను కృష్ణుడు తినగా దుర్వాసుడు, అతని పదివేలమంది శిష్యుల ఆకలి చల్లారలేదా? అట్లాగే ఇది కూడా. వచ్చినవాడు, పంచముడని భావించకుండా నారాయణుడని భావించడం వల్ల అందరికీ తృప్తి కల్గుతుంది. అతని భావాలను గుర్తించండి. ముందు వచ్చిన బ్రాహ్మణుని, తరువాత శూద్రుని, తరువాత వేటగానిని, ఆ తరువాత పంచముని విష్ణుదూతలుగా భావించాడు. వారికి నమస్కరించి నారాయణునిలో లీనమై తనువును చాలించాడు.

సాధారణంగా మన పురాణాలలో, కావ్యాలలో నాయకుని మరణం ఉండదు. మనకు దుఃఖాంత నాటకాలు లేవు. కథ చివరలో పట్టాభిషేకమో, వివాహమో ఉంటుంది. రాముడు చివరగా వైకుంఠానికి చేరినట్లు, పాండవులు స్వర్గానికి వెళ్ళినట్లు వాల్మీకి వ్యాసులు వ్రాసినా హరికథలు, ప్రవచనాలు వారి పట్టాభిషేకాలతోనే ముగుస్తాయి. ధ్రువ, ప్రహ్లాదులు ముక్తినిమ్మని అడిగినా భగవానుడు కాదని వారిని పట్టాభిషిక్తులను చేసాడు. కాని రంతిదేవుని కథలో కరువు పోయిందని, అతని ఆకలి తీరిందని, చాలాకాలం రాజ్యం పాలించాడని లేదు. ఒక కలమాదిరిగా అతనినుండి మాయ తొలగిందని చెప్పబడింది. అనగా పరలోకానికి, పరమ పదానికి చేరుకున్నాడని అర్థం. అది అతని త్యాగానికి ఫలం.

లోకంలోని సుఖాలు శాశ్వతం కాదు. భగవానుని చేరుటయే ఆత్యంతిక సుఖం. అందువల్ల కథ, అట్లా ముగింప బడింది. అట్లా భారతంలోనూ ఒక పక్షిని కథ ఉంది.

(పై కథలో విష్ణుని దూత లట్లా వచ్చారని స్వామివారన్నట్లు ఈ ఉపన్యాసాన్ని సంగ్రహించినవారు పేర్కొన్నారు. కాని భాగవతంలో త్రిమూర్తులూ అట్లా వచ్చారని ఉంది. అట్లా ప్రత్యక్ష మయ్యారని వ్యాఖ్యానకర్తలూ అన్నారు. త్రిమూర్తులు నాల్గు రూపాలలో ఎట్లా వచ్చారని మనకు సందేహం కలగడం సహజం. మూడవవానిని, నాల్గవ వానిని కలపవలసి వస్తోంది. స్వామివారన్నట్లు నల్గురు విష్ణుదూతలని చెబితే సందేహానికి తావుండదు - ఆంగ్లానువాదకుడు)

## చిత్రమైన ముంగిస

ధర్మరాజు అశ్వమేధ యాగాన్ని చేయడానికి ముందు అందరికీ అన్నదానం చేసాడు. పాండవులు భక్తి ప్రపత్తులతో ప్రేమతో ఫలాపేక్ష ఏమీలేకుండా అందరికీ అన్నం పెట్టారు. అంతమాత్రంచే వారిలో అహంకారం పొడసూపరాదని, దానం యొక్క సర్వోత్తమైన లక్షణాన్ని లోకానికి అంతటికీ తెలియజేయడం కోసం, ఒక దృశ్యాన్ని చూపించాడు భగవానుడు.

అన్నదానాన్ని అందరూ ప్రశంసిస్తూ ఉండగా ఒక ముంగిస వచ్చింది. దాని శరీరంలో సగభాగం బంగారువర్ణంతో ఉంది. అన్నం మెతుకులలో పొర్లాడి ఇదేమి దానం? ఇదేమి యజ్ఞం? కురుక్షేత్రంలో ఉంఛవృత్తితో జీవించే బ్రాహ్మణుడు చేసిన అన్నదానానికి దీనికీ పోలికే లేదంటూ మాట్లాడింది.

సగం బంగారు రంగుతో ఉండడం, మనుష్య భాషలో మాట్లాడడం చూసి అందరూ ఆశ్చర్యచకితులయ్యారు. ఒక ఉంఛవృత్తి చేసే బ్రాహ్మణుడు, అన్నదానం చేయడమా?

ఉంఛవృత్తి అంటే నేడు, ఇంటింటికీ వెళ్ళి బియ్యాన్ని సేకరించడమని భావిస్తారు. ఉంఛవృత్తి భజన అనే ఆచారమూ ఉంది. కాని శాస్త్రాలలో చెప్పినది వేరు. పొలంలో కుప్ప నూర్చినపుడు కొన్ని ధాన్యపు కంకులుండగా

ఇంతలో విమానం రాగా స్వర్గలోకానికి అందరూ వెళ్ళారు. కుచేలుని మాదిరిగా ఈ లోకంలో సకల సంపదలూ అనుభవించలేదు. స్వర్గం వస్తుందని వాళ్ళు దానం చేయలేదు. స్వర్గం తనంతట తానే వీరిని వరించింది.

అక్కడ నేనున్నానని ముంగిస చెప్పింది. వారిచ్చిన పిండి కొంత నేలమీద పడగా నేను పరుగెత్తుకొని వెళ్ళేటపుడు పిండి నా ఒంటికి కొంత అంటుకుపోవడం వల్ల సగభాగం బంగారు మయమైందని చెప్పింది. మిగిలిన సగభాగం కోసం ఎక్కడెక్కడ అన్నదానాలు జరుగుతున్నా వెదుతున్నానని అందు పొర్లాడినా మిగిలిన సగభాగం బంగారు మయం కావడం లేదని, ఇక్కడకు వచ్చినా ఫలం లేకపోయిందని చెప్పింది.

## దానం, మహోత్తమమైన ధర్మం

పై రెండు కథలను విన్నారు కదా! ఇతరులే కష్టంలో ఉన్నా, శక్తిననుసరించి వర్ణమతాల గురించి ప్రశ్నించకుండా, మంచివాడా, చెడ్డవాడా అని విమర్శించకుండా సాయం చేయాలని బోధించాయి.

ప్రధానంగా అన్నదానం గురించి చెప్పినపుడు, వీరూ వారూ అనే భేదం లేకుండా చేయాలని తిరుమందిరం చెప్పింది.

ఎవరు తన దగ్గరకు వచ్చినా అతణ్ణి నారాయణునిగా భావించాడు రంతిదేవుడు. ఇలయాంకుడికి చెందిన మారనాయనార్ దుర్భర దారిద్ర్యంతో బాధపడేవాడు. ఒక శివభక్తుడు బిచ్చం వేయవలసిందిగా అడిగాడు. ఒకమూల వర్షం పడుతోంది. పొలం వెళ్ళి కోతకు సిద్ధంగా నున్న పంటను కోసి ఆ ధాన్యాన్ని వండి పెట్టాడు. ఈ కథ పెరియ పురాణంలో ఉంది.

కనుక అన్ని దానాలలో అన్నదానం గొప్పది. ఎవడు తనకోసం తాను వండుకొని తింటున్నాడో అతడు పాపాన్నే తింటున్నాడని గీతలో ఉంది. అంటే అన్నం తినడం లేదు, పాపం తింటున్నాడని అర్థం వచ్చింది కదా!

మనం దేనిని ఎవరికి ఇచ్చినా అవతల వాడు తృప్తిపడడు, ఇంకా కావాలనే ...ంటాడు. కాని అన్నదానంలో కడుపు నిండిన తరువాత చాలని అంటాడు. ...్తె చెందాననే మాట ఇక్కడే వినబడుతుంది. అందువల్ల దాతకు ఫలం ...్తుంది.

శరీరాన్ని, ఆత్మను పోషించేది అన్నమే కదా. అందుకే అన్నం పెట్టినవానిని ప్రాణం ఇచ్చాడని అంటారు. దీని మహిమ, మణిమేఖలై గ్రంథంలో ఉంది. అది బౌద్ధమతానికి చెందిన గ్రంథం. ప్రసిద్ధి చెందిన ఐదు తమిళ మహాకావ్యాలు, బౌద్ధ, జైన మతాలకు చెందినా అందు వైదిక మత సంప్రదాయాలుంటాయి. మణిమేఖల అక్షయపాత్రను సంపాదించి ప్రజల ఆకలిని పోగొట్టినట్లుంది. ఇది కాంచీపురంలో జరిగింది. అంతకుముందే అమ్మవారు ఈ కంచిలోనే అన్నదానం చేసినట్లు కథ. ధాన్యానికి చెందిన రెండు కొలపాత్రలలో 32 ధర్మాలను నిర్వహించింది.

అన్ని నియమాలు ధర్మపదంలో వచ్చినా దానపదానికి ధర్మమనే రూఢి ఏర్పడింది. సాధారణంగా దానధర్మాలని అంటాం. ధర్మం చేయండని బిచ్చగాళ్లు అంటారు. ఉచితంగా అన్నం పెట్టేదానిని ధర్మశాల అని అంటారు. ఈయడమే ధర్మమని అవ్వైయార్ చెప్పింది. ఈమె మాటలు వేదతుల్యాలు.

దానమని ఎప్పుడైతే అన్నామో దానిని గ్రహించేవాడూ ఉండాలి కదా! దానాన్ని ప్రశంసించిన శాస్త్రాలు, పుచ్చుకోవడాన్ని తక్కువగా చేసి చూపించాయి. నేను ఇచ్చేవాణ్ణే కావాలి, పుచ్చుకొనేవాణ్ణి కాకూడదని –

'యాచి తారశ్చనస్సంతు, మాచ యాచిస్మ కంచన'

అయితే పుచ్చుకొనేవాడు లేకపోతే దానం, ఈయడం ఎట్లా కుదురుతుంది? ఇక్కడొక శ్లోకముంది:

అక్షరద్వయ మభ్యస్తం నాస్తినాస్తీతి యత్పురా
తదేవ దేహి దేహీతి విపరీతముపస్థితం

అనగా గత జన్మలో యాచకుల దగ్గర లేదు లేదని వర్ణించాను. ఇమ్ము, ఇమ్ము అని ఈ జన్మలో అడగవలసి వచ్చిందని అర్థం.

ఇక్కడ ఈయడంలో గొప్పదనాన్ని, తీసుకోవడంలో తక్కువదనాన్ని గమనించాం. త్రివిక్రముడైన మహావిష్ణువే యాచింపబోయి పొట్టివాడైన వామనావతారం ఎత్తవలసి వచ్చింది కదా.

తీసుకోవడాన్ని ఎందుకు తక్కువగా పరిగణించారు? అది తప్పని పరిస్థితులలోనేయని, ఇతరులను బాధపెట్టరాదనే భావనయే కారణం. బుద్ధి బాహు బలాలతో తమంతట తామే ఆర్జించుకోవాలి. వృత్తి దొరకకపోయినా, తీవ్ర అనారోగ్యం సంభవించినా, అనాథయైనపుడు యాచించవచ్చు.

సంఘ కార్యక్రమాలకై చందాలు, విరాళాలు సేకరిస్తూ ఉంటారు. ఇక్కడ పుచ్చుకోవడంలో న్యూనతాభావం లేదు. తాము భరించలేని ఖర్చులకు విరాళాలను వసూలు చేయవచ్చు గాని చిన్న చిన్న సాంఘిక కార్యక్రమాలకు ఉత్సాహపరులే భరించడం తగినది.

కర్మానుష్ఠానంలో మునిగితేలే బ్రాహ్మణునకు కుటుంబ పోషణకై ఎవరైనా ఇచ్చినా దానిని స్వీకరించడం అంటూ ఉండేది. ఇక సన్యాసి నిరంతరం సాధనచే తనలోని జీవాహంకారాన్ని పోగొట్టుకోవాలి కనుక అతడూ భిక్షమెత్తవచ్చని అన్నారు. మిగిలినవారు కేవలం ఉదరపోషణ నిమిత్తం యాచించకూడదన్నారు.

శాస్త్రాలలో అన్నదానం, పశువులకు దాణా వేయడం, ఉద్యానవనాల ఏర్పాటు, వైద్యాలయాలు, చెఱువులను త్రవ్వడం వంటి 32 ధర్మాలు పేర్కొనబడ్డాయి. అందులో తక్కువ ఖర్చుతో కూడినది ప్రపాదానం. అంటే చలివేందరలు. ఇందులో చల్లని నీరు, పలుచని మజ్జిగను ఇస్తారు. పెద్ద పెద్ద ధర్మాలతో బాటు దీనినీ విస్మరిస్తున్నాం.

కామాక్షి ఆలయంలో అన్నపూర్ణ సన్నిధి యుంది. దీనికి తోడు పై 32 ధర్మాలను కామాక్షి ఆచరించి చూపించింది. తిరువయ్యార్‌లో అమ్మవారిపేరు ధర్మసంవర్ధిని.

రంతిదేవుని ప్రార్థన మాదిరిగానే కార్తికదీప దర్శనము ముక్తి సంపదల నొసంగుగాక అనే దివ్యప్రార్థన మనకుంది. దీంట్లో అందరికీ అని సాముహికంగా చెప్పడం కాకుండా విడివిడిగా పేర్కొంటూ అందరూ ముక్తిలొందుదురుగాక అని యుంటుంది. వివరిస్తా.

## కార్తికదీపం

కార్తికదీపం వెలిగిస్తూ ఈ శ్లోకాన్ని చదువుతారు:

కీటాః పతంగాః మశకాశ్చ వృక్షాః
జలే స్థలే యే విచరంతి జీవాః
దృష్ట్వా ప్రదీపం నచ జన్మ భాగినః
భవంతి నిత్యం శ్వపచాహి విప్రాః

అనగా పురుగులైనా, పక్షులైనా, దోమలైనా, చెట్లైనా, నీటిలో, నేలలో ఏ ప్రాణియైనా భూమియందే వర్ణానికి చెందినవారైనా ఈ కార్తికదీపం చూస్తే వారి పాపాలు పోయి మరల జన్మ ఎత్తకుండా శాశ్వతానందాన్ని పొందుదురు గాక.

మశకం, అనగా దోమ, గాలిలో ఎగిరినా గ్రుడ్లను మాత్రం నీళ్ళలోనే పెడుతుంది. మశకం నుండే Mosquito పదం వచ్చింది. పక్షులు, వృక్షాలపై గ్రుడ్లను పెడతాయి. చేప నీళ్ళలోనే ఉంటుంది. కప్ప, నేలపైన, నీళ్ళలోనూ ఉంటుంది. చాలా ప్రాణులు నేలమీద ఉంటాయి. ఇట్లా అన్ని ప్రాణులను శ్లోకం పేర్కొంది.

ఈ శ్లోకంలో ద్రష్టా ఉంది. అనగా చూసి. చెట్లెలా చూస్తాయి? మనవంటి కళ్ళు వాటి కున్నాయా? వాటికి సుఖదుఃఖాలున్నట్లు శాస్త్రజ్ఞులు ఋజువు చేసారు కదా! కన్నులున్నాయో లేవో. అయినా శ్లోకాన్ని ఇట్లా అర్థం చేసుకోవాలి. వాటికి చూసే ఇంద్రియాలున్నా లేక పోయినా కాంతి వాటిపై ప్రసరించడం లేదా? ఈ కాంతి ఎంతవరకూ ప్రసరించిందో అంతవరకూ వాటికి పునర్జన్మలేకుండుగాక అని అర్థం చేసుకోవాలి.

*మనవి: వాటికి ఇంద్రియాలున్నట్లు భారతం, శాంతి పర్వంలో ఉంది. లత చెట్టును పెనవేసికొంటోంది. అంటే కన్నులున్నట్లే కదా! కొన్ని ధూపాలు వేస్తే పుష్పిస్తున్నాయి, ఫలిస్తున్నాయి. అంటే ఘ్రాణశక్తి ఉంది కదా! పిడుగుల శబ్దాలను వింటే కొన్ని చివికి పోతున్నాయి. అంటే వినే శక్తి ఉన్నట్లే. వేడివల్ల మాడిపోతున్నాయి. స్పర్శశక్తి ఉన్నట్లే. జడత్వం అధికంగా ఉండడం వల్ల పైకిమాత్రం ఆ ఇంద్రియాలున్నట్లు కనబడడం లేదు. సుఖదుఃఖాలూ ఉన్నాయి.*

"వల్లీ వేష్టయతే వృక్షం సర్వతశ్చాపి గచ్ఛతి
నహ్య దృష్టేశ్చ మార్గోఽస్తి తస్మాత్ పశ్యంతి పాదపాః
పుణ్యాపుణ్యైః తథాగంధైః ధూపైశ్చ వివిధైరపి
అరోగాః పుష్పితాః సంతి తస్మాత్ జిఘ్రంతి పాదపాః
వాయ్వగ్న్యశని నిర్ఘోషైః ఫలం పుష్పం విశీర్యతే
శ్రోత్రేణ గృహ్యతే శబ్దః తస్మాత్ శృణ్వంతి పాదపాః
ఉష్ణతొగ్లాయతే వర్ణం త్వక్ ఫలం పుష్పమేవ చ
గ్లాయతే శీర్యతే చాపి స్పర్శస్తేనాత్ర విద్యతే"

\- అనువక్త

కాంతి, అందరిపై అన్నిటిపై పడుతోంది. అట్లాగే మనలో ప్రేమ కూడా వ్యాపించాలి. ఇట్టి ప్రేమ భావంతో దీపం వెలిగించి అట్టి ప్రార్థన చేయాలి.

పూర్వం ఆలయాలనుండి అగ్నిని తీసుకొని వచ్చి వెలిగించేవారు. ఈనాడు కూడా తిరువణ్ణామలైలో కొండమీద ఒక దీపాన్ని వెలిగిస్తారు. కొండమీదే ఎందుకంటారా? అట్లా ఐతే చాలా దూరం నుంచి వెలుగు ప్రసరిస్తుంది. దీనిని అణ్ణామలై దీపం అంటారు. దీపం వెలుగు అందరిపై, అన్నిటిపై ప్రసరించాలనే భావనతో ఇట్లా ఏర్పాటు చేసారు. జంతువులలో రెండు కాళ్ళ, నాలుక్కాళ్ళ జంతువులుంటాయి. కందిరీగకు ఆరుకాళ్ళు; సాలీడుకు ఎనిమిది కాళ్ళు, ఎక్కువ కాళ్ళు గల జెఱ్ఱి శతపాది, ఉన్నాయి. వాటికే కాకుండా పాదాలు లేని చేపలకు, పాములకు కూడా శుభం జరగాలని వేదమంత్రాలలో ఉంది.

గీతలో జ్ఞాని వర్ణాలలో భేదం చూడదని ఉంది. రంతిదేవుడు బ్రాహ్మణునకు, చండాలునకు నీటినీయలేదా? ఈ శ్లోకం కూడా శ్వపచులను, బ్రాహ్మణులను పేర్కొంది. అందరి సుఖాన్ని కోరినపుడు వర్ణాల ప్రస్తావన ఎందుకు వస్తుంది? మహా పాపులకు కూడా సాయం చేయమంటోంది శాస్త్రం. దానిని వివరిస్తాను.

## నరకంలోని ఉన్నవారి క్షేమానికై

నరకంలో ఉన్నవారి బాధలను పోగొట్టడం కోసం ప్రయత్నించాలని పూర్వులన్నారు. ప్రతి సంవత్సరం పెట్టే ఆబ్దికాలలో, నిత్యతర్పణంలో పూర్వులను స్మరిస్తారు. ఆ పూర్వులు ఎక్కడ జన్మించినా, ఏ రూపంలో ఉన్నా వారికి సద్గతులు కలగాలనే భావనతో చేస్తారు. మనం అర్పించే నువ్వులు, నీళ్ళు, పిండములు వారే రూపంలో ఉన్నా వారికి ఆహార రూపంగా చెందాలనే భావనతో చేస్తారు. మనం, మరియొక దేశానికి డబ్బును పంపిస్తే అది ఆదేశంలో చెలామణీ అయ్యే ద్రవ్యంగా మారి వారికి అందుతోంది కదా!

ఇట్లా పితృదేవతల ఆరాధన మన నరనరాలలో జీర్ణించుకొని పోయింది. అయితే వీటిని శ్రద్ధతో చేస్తున్నామా? శ్రద్ధతో పెట్టేది శ్రాద్ధం కదా! కొందరివి మూఢవిశ్వాసాలని పెట్టడం మానివేస్తున్నారు. దీని దుష్ఫలితాలను గుర్తించడం లేదు. చాలామంది ఇళ్ళల్లో మానసిక దౌర్బల్యాలు, మూర్ఛ వంటి రోగాలు, ఇంతకు ముందు వినని వింత వింత రోగాలతో బాధపడుతున్నారు. అట్టివారు దైవజ్ఞులను సంప్రదించడం, అయినతర్వాత ఫలితం లేకపోతే చివరకు నాదగ్గరకు వస్తూ ఉంటారు. వీటికి కారణం పితృదేవతలను ఆరాధించకపోవడమే అని నాకు తెలుసు. తల్లిదండ్రులు శపిస్తారా అని ప్రశ్నించకండి. శపించరు. ఆ తల్లిదండ్రులకు అధిష్ఠాన దేవతలైన పితృదేవతలు (వసు, రుద్ర, ఆదిత్యులు) శపిస్తారు. సుఖజీవనం సాగాలంటే ఈ విషయంలో అశ్రద్ధ వహించకూడదు.

పోయిన వారందరూ వెంటనే జన్మ ఎత్తుతారనే నమ్మకం లేదు. అప్పగించిన పని బాగా చేస్తూ ఉంటే ఇంక్రిమెంట్లు, అదనంగా బోనస్ లభిస్తున్నాయి. చేయకపోతే ఇవి రెండూ ఉండవు. అట్లాగే పై విషయంలోనూ. సరిగా పని చేయకపోతే క్రిందిస్థాయికి పంపివేస్తారు కదా. పుణ్యకార్యాలు చేయడం ఇంక్రిమెంటు వంటిది. స్వర్గంలో ఉంచడం బోనస్ వంటిది. తప్పులు చేస్తే నరకంలో ఉంచడం క్రిందిస్థాయికి పంపించడం వంటిది. నరకవాసులు తిరిగి జన్మమెత్తినపుడు ఇంక్రిమెంటు ఉండదు. పాపం అధికమైతే శాశ్వత నరకవాసమే గతి.

పితృకార్యాల ఫలాలు, నరకం కంటె మిగిలిన లోకాలలో ఉన్నవారికి ఉపయోగిస్తాయి. స్వర్గంలోనూ అనేక లోకాలున్నాయి. దేవలోకం, గంధర్వలోకం, విద్యాధర లోకం వంటివి. అట్లాగే నరకంలోనూ తేడాలున్నాయి. తామిస్రం, అంధ తామిస్రం, పుత్, రౌరవం మొదలైనవి. తిలాదుల నర్పించడం వల్ల వచ్చే ఫలం ఈ నరకలోకంలో ఉన్నవారికి చెందదు.

ఇరు దేశాలలో యుద్ధవాతావరణం ఉన్నప్పుడు డబ్బుమార్పిడి యుండదు కదా! అట్లాగే పితృ దేవతలు నరకంలో ఉన్నవారికి ఫలాన్ని అందీయరు.

అయితే ఋషులు మనమీద దయతో నరకంలో ఉన్న మహాపాపులకు, మంత్రాలద్వారా కొన్నిటిని అందించవచ్చని సూచించారు. మంచి ఆహారం వారికి దక్కదు. మురికి వస్తువులు వాడడం వల్ల వచ్చే ఫలం వారికి దక్కుతుంది. బట్ట పిండేటప్పుడు వచ్చిన నీరు, జుట్టు నుండి కారే నీరు మొదలైనవి వారికి ఆహారంగా ఉపకరిస్తాయి. వారికి కూడా సద్గతులు కలగాలని అట్టివి చేస్తున్నాం. అన్నం తినిన తరువాత చేతిలో పోసుకొన్న నీరు విస్తరికి కుడివైపున విడిచిపెట్టాలి. అది వారి దాహాన్ని పోగొడుతుంది. ఆంధ్ర ప్రాంతంలో దీనిని ఉత్తరాపోశనమని అంటారు. ఇట్టి దానిని అర్పించడమా అని శంకించవద్దు. ఇట్టి దానికి నారు ఆబ్దులు చాస్తారు. పందులు, వేటికి ప్రాకులాడతాయో తెలుసు కదా! అట్టివారి పాపాలను పోగొట్టే ఉపాయాలను ధర్మశాస్త్రాలు అందించాయి.

మన మతంలో దయలేదని, క్రైస్తవ బౌద్ధమతాలలో ఉందని గేలిచేసేవారు పై వాటిని గమనించారా?

*(ఏ సంస్కారమున్నా, లేకపోయినా పితృకర్మలను అష్టాదశ వర్ణాలవారూ ఏదో ఒక రూపంలో ఆచరించడం ఈ మతంలోని ప్రత్యేకత)*

## వేదశాస్త్రాలలో దాన ప్రశంస

కర్ణాటకలో, రాష్ట్రకూటులు పాలించే సమయంలో హేమాద్రియనే మహానుభావుడు 'దాన హేమాద్రి' అనే గ్రంథం వ్రాసాడు. అందనేక దానాలున్నాయి. 700 సంవత్సరాల వెనుక వ్రాయబడిన ఈ గ్రంథానికి ఆధారం, కృత్యచింతామణి అనే గ్రంథం. ఇది వ్రాసినది లక్ష్మీధరుడు. ఇతడు హేమాద్రికంటె రెండు వందల సంవత్సరాల పూర్వుడు. నేటి కనోజ్‌గా

పిలువబడే కన్యాకుబ్జంలో ఉండేవాడు. ఈ గ్రంథంలో చెప్పబడని దానం అంటూ ఏదీ లేదు. విద్యాదానాలు, సంఘసేవ వంటివి దానాల్లోకి వస్తాయి. కాని ఏదో ఒక వస్తువునీయడమే దానం కాదు.

వేదాలలో ఈ దాన ప్రశంస ఉంది. బృహదారణ్యక ఉపనిషత్తులో ఒక కథ ఉంది. వేదాలు శుష్క వేదాంతాన్ని అందిస్తాయని భావించవద్దు. వీటిల్లో అనేక కథలుంటాయి.

దేవతలు, అసురులు, మానవులూ అందరూ బ్రహ్మయొక్క సంతానమే కదా! అతడనేక లీలలను చూపిస్తూ ఉంటాడు. వారి మధ్య కలహాలను వీక్షిస్తూ ఉంటాడు. వారికి సదుపదేశం చేయడమూ అతని కర్తవ్యమే.

దేవతలు వెళ్ళి మాకేదైనా సదుపదేశం చేయండని అన్నారు. 'ద' అనే ఒక అక్షరాన్ని పలికాడు బ్రహ్మ. ఇంద్రియ నిగ్రహం లేకపోవడం తమలో లోపమని గ్రహించారు దేవతలు. వాటిని నియమించడం 'దామ్యత' గా అర్థం చేసుకొన్నారు.

దమమని, శమమని ఉందికదా, శమం అనగా ఇంద్రియ నిగ్రహం. దమం దానికంటే పెద్దది. అది మనస్సును నియమించేది. సాధకులకు శమాది షట్కసంపత్తి ఉండాలని శంకరులన్నారు. ఇంద్రియ నిగ్రహం వల్ల శాంతి; మనోనిగ్రహం వల్ల దాంతి కల్గుతాయి.

దామ్యత యనగా దమమును పాటించుమని. దామ్యత యొక్క సంక్షిప్త రూపం 'ద'.

ఇట్లా సంక్షిప్తంగా చెప్పడం ఇంకా శక్తిమంతంగా ఉంటుంది. చర్చిల్ విజయానికి గుర్తుగా 'వి' అన్నాడు. V for Victory అదే మంత్రంగా పనిచేసింది.

మానవులు వెళ్ళారు. పూర్వకాలంలో బ్రహ్మలోకానికి వెళ్ళే శక్తి వారికుండేది. మళ్ళీ 'ద' అన్నాడు బ్రహ్మ. దాన్ని 'దత్త'గా అర్థం చేసుకొన్నారు

మానవులు. అనగా దానలక్షణాన్ని ముఖ్యంగా మానవులకుపదేశం చేసాడన్నమాట.

ఇక అసురులు ఊరుకుంటారా? వారికి మరల 'ద' అని బ్రహ్మ ఉపదేశించాడు. 'దయధ్వం' దయ కలిగియుండండని అన్నాడని అర్థం చేసుకున్నారు.

అనగా వారు క్రూరులుగా ఉంటారు కనుక దయ కలిగియుండండని ఉపదేశం.

దామ్యత, దత్త, దయధ్వం – దీనిపై శంకరులు భాష్యం వ్రాస్తూ ఆయా మాటలు ఆయా జాతులకి మాత్రమే కాదని, పై మూడు లక్షణాలు మానవులకూ ఉండాలని వ్రాసారు. ఎందుకట్లా వ్రాసారు? మానవులలో కొంతమందికి మంచి లక్షణాలున్నా కొందరు ఇంద్రియాలకు వశులై పోతున్నారు. ఎంత డబ్బున్నా ఈయని పిసినారులూ ఉన్నారు. కొందరు క్రూరస్వభావంతో ఉంటారు. కనుక అన్ని ఉపదేశాలనూ కలిపి మానవులు గ్రహించాలని వ్యాఖ్యానించారు.

మనకెన్నో మంత్రోపదేశాలున్నాయి. పంచాక్షరి, అష్టాక్షరి వంటివి. వాటితోబాటు ఈ 'దత్త' మంత్రాన్ని అందరూ ఆచరించవలసిందే. ఒక్కొక్క దేవతపై ఒక్కొక్కనికి ఇష్టం, మిగతా వాటిని పట్టించుకోకపోవడం ఉంటుంది. కాని ఈ మంత్రాన్ని అందరూ పాటించవలసిందే.

బృహదారణ్యకం, శుక్ల యజుర్వేదానికి చెందింది. నాల్గు వేదాలలో ఎక్కువమంది యజుర్వేదానికి చెందినవారు. ఇందులో రెండు శాఖలు. శుక్లము, కృష్ణమని. ఉత్తర దేశంలో శుక్ల యజుర్వేదానికి; దక్షిణ దేశంలో కృష్ణ యజుర్వేదానికి ప్రాచుర్యం. ఇక కృష్ణ యజుస్సులో భాగమైన తైత్తిరీయ ఉపనిషత్తు ఏమంటుందో వినండి.

దానాన్ని శ్రద్ధతో ఇమ్మంది. అంటే అశ్రద్ధతో ఈయవద్దని. మనం 'శ్రీ'ని అనగా డబ్బునిచ్చేటపుడు మన మనస్సు పవిత్రంగా, సంతోషంతో ఉండాలి. శ్రీ ఉంటేనే శ్రేయస్సు. మనస్సులో శ్రీతో సంతోషంతో ఇచ్చినపుడు మనకు శ్రేయస్సు లభిస్తుంది. అరెరె! మనం ఇంత తక్కువ ఇస్తున్నామేమిటని భావించాలి. హ్రీతో ఇమ్మంది. అనగా సిగ్గుపడుతూ అని. పురుష సూక్తంలో స్వామికి శ్రీ, హ్రీలని ఇద్దరు భార్యలున్నారు. అనగా మనం లక్ష్మినిచ్చేటపుడు శ్రీతో ఇయ్యాలి, హ్రీతో ఇయ్యాలి. ఎందుకు సిగ్గుపడాలి? ఇంతే ఇస్తున్నామని సిగ్గుపడాలి. మనం ఇచ్చేది ఇతరులకు తెలియకూడదు కనుక. తెలిస్తే ఇతరులూ వచ్చి అడుగుతారని కాదు. ఇతరులకు తెలిసి, ఇతణ్ణి పొగుడుతూ ఉంటే ఇతనిలో అహంకారం ఉదయిస్తుంది కనుక. ఆ అహంకారం, దాన ఫలాన్ని పోగొడుతుంది.

ఇచ్చినదానిని పత్రికలలో ప్రకటించకూడదు. ఏదోవిధంగా మనం దానం చేసినట్లు తెలియాలని లోలోపల అనుకోవడమూ మంచిది కాదు. ఇతడు గుప్తదానం చేసాడని ఇతరులింకా పొగుడుతారు. అయినా ఎవరైనా ప్రశంసించాలని ఏదో ఒకమూల దాగియుంటుంది. దానినెట్లా అణచడం? దానం పుచ్చుకొన్నవాడు మనకంటె భిన్నుడు కాదని, అతడూ నేనూ ఒక్కటే అనే భావన రావాలి. మన పిల్లలకో, దగ్గర బంధువులకో ఏదో ఇచ్చి గొప్పలు చెప్పుకోము కదా! అట్లాగే. అందరూ పార్వతీ పరమేశ్వరుల సంతానమే. కనుక దానం ఇస్తున్నామని చెప్పడం తప్పే. భయపడుతూ ఇయ్యాలి. అందుకే 'భియాదేయం' అన్నారు. ఇచ్చేవానిలో అహంకారం ఉంటుంది. అది పనికి రాదని అన్నారు. చివరగా జ్ఞానంతో ఇయ్యాలన్నారు. 'సంవిదాదేయం'. సంవిత్ అనగా జ్ఞానం. ఏమిటా జ్ఞానం? ఇచ్చేవాడు పుచ్చుకొనేవాడూ ఒక్కరేయని.

గీతలోనూ దాన ప్రశంస ఉంది. సాత్త్విక, రాజసిక, తామసిక దానాలని వింగడించారు. ప్రతిఫలాన్ని కోరకుండా ఇచ్చేది అర్హునకు, సరియైన కాలంలో ఇచ్చేది సాత్త్విక దానం. ప్రతిఫలాన్ని కోరుతూ ఇచ్చేది రాజసిక దానం. ఇతరులను చిన్నబుచ్చుతూ, అనర్హులకు ఇచ్చేది తామసికం.

ఏ సమయంలో, ఏ దేశంలో, ఎవరెవరికి ఎంతెంత దానం చేస్తే పుణ్యం వస్తుందో పురాణాలలో విపులంగా చెప్పబడింది. ముఖ్యంగా సంక్రమణాదులలో గంగా తీరాదులవంటి ప్రదేశాలల్లో సత్పాత్రులకిమ్మని, తీర్థాలలో దానం మరీ ఉత్తమమనీ ఉంది. తిరుక్కురల్ అనే తమిళ గ్రంథమూ ఇదే చెప్పింది.

ఇట్టి దానాదులతో సంఘసేవ ఉండగా. ఇట్టిది లేదని. కేవలం. పూజ, వ్రతాలే హిందూమతంలో ఉన్నాయనడం సబబు కాదు.

## కొన్ని ఆక్షేపణలు - సవరణలు

యాగాలని, యజ్ఞాలని విమర్శించేవారు యాగాదులు సంఘసేవకి అని గుర్తించకపోవడం శోచనీయం. అందులో ఉచ్చరింపబడే మంత్రాలు లోక క్షేమానికే. పోయిన వారే రూపంలో పుట్టారో తెలియదు కనుక వారి సద్గతులకై మనం చేసే తర్పణాలు, ఆబ్దికాలను నిర్వహించడం దయతో కూడినది కాదా!

భగవానుని అర్చించడమూ లోకక్షేమాన్ని ఉద్దేశించే. జగద్ధితాయ కృష్ణాయ అని పూజ ప్రారంభిస్తాం. అనగా జగత్తునకు హితం చేసే కృష్ణునకు అని అంటున్నాం.

ప్రజలను పట్టించుకోకుండా యోగంలో, జ్ఞానంలో మునిగినవానికి నేడు ఏమీ ఈయవద్దని అంటున్నారు. అతడు చేసిన సేవ ఏముంది? పరాన్న భుక్కుకదా అని నిందిస్తున్నారు. కొంతమంది దొంగ సన్న్యాసులుంటే

ఉండవచ్చు. అయితే నిజమైన సన్న్యాసులు లేరా? అట్టివారివల్ల లోకోపకారం జరగదా?

ఆత్మోన్నతికై ఉపయోగించని, మనలో మార్పు తీసుకొని రాలేని సంఘసేవ వ్యర్థం. ఆత్మోన్నతికై అన్నిటినీ విడిచిన వానిని గౌరవించవద్దా? అట్టి జ్ఞానులు మనమనుకొనే సంఘసేవ చేయకపోయినా ఇబ్బంది లేదు. వారి ఆధ్యాత్మిక తేజస్సు పరోక్షంగా ఉపకరిస్తుంది. వారు మానసిక శాంతిని తమ దగ్గరకు వచ్చేవారికి ప్రసాదించగలరు. వారి దర్శనమే అఖండ శాంతిని ప్రసాదిస్తుంది. ఇట్టిది సంఘసేవ కాదా? మనం చేసే సేవ శాశ్వతమా వారు చేసేదా? అని ప్రశ్నించుకోండి. మనం ఒకరికి రోగం కుదిర్చినా మరొక రోగం వానిలో వస్తుంది. ఒకపూట అన్నం పెడితే మళ్ళీ ఆకలి మొదలు. పై జ్ఞానులు మానసిక శాంతినే కాదు, వారి అమోఘమైన వాక్కు ద్వారా ఐహిక సంపదలనూ ప్రసాదించగలరు. కొన్నివేల మహాత్ముల జీవితాలే అందుకు సాక్ష్యం.

## దానబుద్ధినే త్యజించాలి

వేదాలు నా మదిలో మెదిలినపుడు త్యాగం గుర్తుకు వస్తుంది. యాగ, త్యాగాలు రెండూ ఒకటే. రెంటినీ ఆంగ్లంలో Sacrifice అని అంటారు కదా. అందువల్ల సనాతనాచరం స్వార్థ పూరితం అనడానికి వీలులేదు. వేద ధర్మం అంటే వేదమతమే. దాని శబ్దాన్ని ధర్మపరంగా వాడుతున్నారని లోగడ చెప్పాను. అది సాంఘిక సేవతో కూడినది.

మనం మన ద్రవ్యాలనెప్పుడైతే అగ్నిలో అర్పించామో దేవతలు తృప్తి పడుతున్నారు. వారు వర్షరూపేణ అనుగ్రహం చూపిస్తున్నారు. తద్వారా పాడిపంటల అభివృద్ధి. ఇది యాగంలో జరిగే అర్పణ, త్యాగము.

అన్నిటిని కూడ బెట్టుకోవడం వల్ల తాత్కాలిక సుఖం లభిస్తోంది. ఇది పరమ సుఖానికి ఆటంకకరం కూడా. అందుకే ఈశావాస్యమనే ఉపనిషత్తులోని మొదటి మంత్రం త్యాగం చేసి ఆనందం పొందమని చెప్పింది. గాంధీగారికి ఈ మంత్రం అన్నా, ఉపనిషత్తు అన్నా చాలా ఇష్టం.

మనం ఏ కర్మ చేసినా దాని ఫలం నా ఒక్కనికి చెందాలని అనడం లేదు. నాకే పూర్తిగా చెందకపోవచ్చని అంటున్నాం. "నమమ" నాకు చెందినది కాదని, లోకహితం కోసం చేయాలని మన మతం బోధిస్తోంది.

అన్నిటిని విడిచిపెట్టి, నేను విడిచిపెట్టాననే అహంకారం ఉంటే అది అభ్యుదయానికి పతనం. కనుక త్యాగం చేయడమే కాదు, త్యాగం చేస్తున్నాననే బుద్ధినీ త్యాగం చేయగలగాలి. బలి చక్రవర్తి గొప్పదాత! అయినా అట్టి భగవదర్పణ భావన లేదతనికి. కనుక అతని అహంకారం పోగొట్టడం కోసం భగవానుడు దానమడిగి, అతని అహంకారాన్ని అణచడానికి గుర్తుగా అతని తలపై పాదం మోపాడు. కనుక సంఘసేవ చేసేవారు దీనిని తప్పక గుర్తుంచుకోవాలి.

## పావురం చేసిన త్యాగం

మనకందరికీ శిబి చక్రవర్తి కథ తెలుసు. ఒక పావురం కోసం తన శరీరాన్నే త్యాగం చేయడానికి సిద్ధపడిన మహాదాత. ఇతరులపట్ల జాలిని చూపించుట మన ధర్మంలో ఉందని చెప్పడానికి ఈ ఒక్క కథ చాలు. పొరుగువాణ్ణి రక్షించడమే కాదు, అన్ని ప్రాణులపట్ల అనుకంప చూపించాలని ఈ వేదభూమి, సందేశమిచ్చింది. అందుకే సర్వభూత హితమన్నారు. పై శిబి కథ మాదిరిగానే భారతంలో కపోతోపాఖ్యానం ఉంది. ఈ కథ మనలను కదిలిస్తుంది.

ఒక వేటగాడు, అరణ్యంలో వల పన్నాడు. దానిలో ఆడ పావురం చిక్కుకొంది. వర్షం హోరున పడుతోంది. ఇతడు మగపావురం ఉన్న చెట్టుక్రింద నిలబడ్డాడు. వర్షం వెలిసింది. చీకటి పడింది. ఆపైన చలిగా ఉంది. కదిలే అవకాశం లేదు. వణుకుతూ అక్కడే ఉండిపోయాడు.

ఇతడు తనపెంటిని బాధించాడని కనుక, ఇతడు బాధపడాలని చెట్టు పైనున్న మగపావురం భావించలేదు. ఇతడు తన ఇంటికి వచ్చిన అతిథియని భావించింది. ఇతనికి ముందుగా చలి బాధను పోగొట్టాలని తన గూటినే పడగొట్టి అతనికి ఎదురుగా చితుకులనుంచింది. తన గూటిని పట్టించుకోలేదు చూసారా!

చెకుముకి రాళ్ళను తెచ్చి అతని ముందుంచింది. రాపిడికి మంట వస్తుంది కదా. శిఖిముఖియే చెకుముకి. శిఖలు కలిగినది శిఖి. అనగా అగ్నిశిఖలు. ముఖమునందు కలదని అర్థం.

రాళ్ళను రాపిడి చేసాడు. మంట వచ్చింది. చితుకులమంటతో చలికాగాడు. ఇట్లా తనకుపకారం చేసిన పావురాన్ని చూసి క్రూర ప్రవృత్తి పోయి బుట్టలో నున్న పావురాన్ని విడిచాడు. వచ్చిన అతిథి ఆకలితో బాధపడటం వల్ల తనకు పాపం చుట్టుకొంటుందని ఆడపావురం భావించి ఆ అగ్నిలో పడి ఆహుతైపోయింది. మగ పావురమూ ఆత్మార్పణ చేసుకొంది. ఇతర ప్రాణుల కోసం తమ ప్రాణాలనైనా త్యాగం చేయాలని కురల్ వంటి గ్రంథాలన్నాయి.

## యముడే భయపడ్డాడు

అతిథిని దేవతగా భావించినవాడవుకమ్మని వేద సందేశం కదా. ఇందేమరుపాటు పనికిరాదు. అసలు యముడంటేనే భయం. అట్టి యముడే

భయపడిన సంఘటనలు విన్నారా? ఈ కథ కఠోపనిషత్తులో ఉంది. ఎవర్ని చూసి భయపడ్డాడు? ఒక చిన్న బ్రాహ్మణ పిల్లవాణ్ణి చూసి.

ఆ కుర్రవాడు యమునింటికి వెళ్ళి మూడు రోజులుండిపోయాడు. అన్నం లేదు, నీళ్ళూ లేవు. ఎందుకు వెళ్ళాడనేది అదొక కథ. దానినట్లా ఉంచుదాం. నీవు నా ఇంట్లో ఏమీ తినకుండా ఉండిపోయావు. నా ప్రవర్తన చూసి బాధపడుతున్నా. మచ్చ కడుక్కోవడానికి సాష్టాంగం చేస్తున్నానని అన్నాడు. మూడు రోజులుపవాసం ఉన్నావు కనుక మూడు వరాలు కోరుకో అన్నాడు. ఇట్టి కథల వల్ల ఎవరికైనా సాయం చేస్తున్నవాడు తానధికుడనని భావించరాదని తెలుస్తుంది. ప్రతి గ్రహీత పట్ల గౌరవం చూపించుట, అతనికేదైనా లోటు వస్తుందని భయపడుట, అతణ్ణి భగవంతునిగా భావించుట, మొదలైన లక్షణాలు ఈ కథవల్ల తెలుస్తాయి.

అట్లా సేవ చేసిన వారిని ఆకాశానికి ఎత్తుతాం. దాతలో కొన్ని అవలక్షణాలున్నా అతని దాతృత్వాన్ని, కర్ణుణ్ణి పొగిడినట్లు పొగుడుతాం.

## తమిళనాడులో దాతలు

దీని అనువాదం అమృతవాణి-2లో చూడండి.

## సనాతన ధర్మ సారాంశం

వేదధర్మం యొక్క సారాంశం, పంచ మహాయజ్ఞాలలో ఉంది. మొదటిది బ్రహ్మయజ్ఞం. అంటే వేదం చదువుట, ఇతరులకు చెప్పుట. విద్యాదానం. పితృయజ్ఞం గురించి లోగడ తర్పణాల సందర్భంలో చెప్పాను. దేవయజ్ఞమనగా దేవతారాధనం. ఇదే అన్ని ధర్మాల లక్ష్యం. భూతయజ్ఞమనగా పక్షులకు, జంతువులకు అనగా కాకులు, కుక్కలు మొదలైనవాటికి ఆహారం ఈయడం.

నృయజ్ఞమనగా అతిథులకు ఆతిథ్యం. మన మతంలో ఇంత విస్తృతంగా, విశాల దృక్పథంతో సమస్త ప్రాణి వర్గాన్ని ప్రేమించబడటమనేది ఉన్నట్లు ఇక ఏ మతంలోనూ కనబడదు. ఇదే కాకుండా 'పూర్తం' అనే పేరుతో సంఘసేవగురించి ధర్మశాస్త్రాలలో ఉంది.

## పూర్త ధర్మం - సామూహికంగా సేవ

అమరం అనే సంస్కృత నిఘంటువులో **పూర్తం ఖాతాది కర్మయత్** అని ఉంది. ఖాతం అంటే తటాకం. ఆదియని చెప్పుటచే దేవాలయ ఆరామాదులకూ పూర్తమని వ్యవహారం.

*("పుష్కరిణ్యాస్సభా వాపీ దేవస్యాయతనానిచ*

*ఆరామశ్చ విశేషేణ పూర్తం కర్మ వినిర్దిశేత్"*

అని స్మృతి చెప్పింది. 'పిపర్తి, పాలయతి పశుదేవ బ్రాహ్మణా' ఇది పూర్తం. అనగా పశుదేవ బ్రాహ్మణాదులను రక్షించునది యని వ్యాఖ్య. – అనువక్త)

ఇట్లా చెఱువులను, కాలువలను, నూతులను త్రవ్వడం పట్ల నిర్లక్ష్యం వహించడం వల్ల నీటికి కటకట పడుతున్నాం. ఎవరినైనా పిలిస్తే అతడు రానపుడు ఏం త్రవ్వుతున్నావు? అనే ప్రశ్న వేయడం మన వాడుకలో ఉంది. అనగా చెఱువులను త్రవ్వుతున్నపుడు మిగతా పనులు చేయకపోయినా ఫరవాలేదనే అర్థంలో వాడారు.

నూయి, ఒక కుటుంబానికే ఉపయోగిస్తుంది. కాని చెఱువు, గ్రామ ప్రజలందరికీ, చివరకు పశు పక్ష్యాదులకూ ఉపకరిస్తుంది కదా!

రహదారులను నిర్మించడం ఒక ధర్మం. చెట్లు నాటడం మరొక ధర్మం. క్రొత్త చెట్లను నాటినా ప్రాతవాటిని కొట్టకుండా ఉండడం, క్రొత్తవాటిని

పెంచడం – ఇవన్నీ పూర్వం ఉండేవి. ఇప్పుడేమో పెద్ద పెద్ద అధికారులు రావడం, ప్రారంభోత్సవాలు, కొంత హడావిడి, క్రొత్తగా నాటిన వాటిని సంరక్షించకపోవడం జరుగుతోంది. అంతేకాదు, రహదారిలో ముళ్లను తొలగించినా, గాజు పెంకులనేరినా, చెత్తను తొలగించినా ఏ చిన్నపనైనా, మన మనస్సును పవిత్రం చేసేదే!

మనస్సులోని చెత్త పోవాలంటే ఆ మనస్సుతోనే ధ్యానం చేయాలి. నాల్కదోషం పోవాలంటే ఆ నాల్కతో భగవన్నామాన్ని పలకాలి. ఏ చెడ్డ ఆలోచనలు చేసినా ఆ మెదడుతోనే ఆత్మవిచారణ చేయాలి కదా. శరీరం తప్పులను శారీరక పరిశ్రమతోనే పోగొట్టాలి. అట్లా శారీరకంగా చేసేదే పూర్తధర్మం. దానివల్ల సంఘమేకాదు, అది మనస్సునూ శుభ్రపరుస్తుంది. అసలు మనస్సులో మంచి ఆలోచన ఉంటేనే కదా శరీరంతో చేసేది.

మనస్సులో ఉన్న దయాగుణం ఎట్లా వ్యక్తీకరింపబడుతుంది? చేతల ద్వారానే కదా! వినోబాభావే చెప్పిన శ్రమదానము, మన పూర్త ధర్మంలోదే! వారానికి ఒక్కరోజైనా మనఃస్ఫూర్తిగా ఇట్టి శ్రమదానాన్ని చేయాలి.

వారానికి ఒక్కరోజు సెలవు కదా! ఎవరికి సేవ చేస్తున్నాం? పార్వతీ పరమేశ్వరులకు చెందిన జగత్ కుటుంబానికే అనే భావనను రానీయాలి. దీనివల్ల ఆరోగ్యమూ బాగుపడుతుంది. అంతకంటె చిత్తశుద్ధి ఏర్పడుతుంది.

ఇక దీనిని విడిగా చేయడం కంటె సామూహికంగా చేయాలి. కలియందు సంఘశక్తికి ప్రాధాన్యమిచ్చారు కదా. 'కలౌ సంఘే శక్తిః'. పూర్వ యుగాలలో ఒక్కొక్క వ్యక్తికీ శారీరక మానసిక బలం ఉండేది. అది నేడు లేదు. కనుక సంఘశక్తి. 'కలి' యంటేనే దెబ్బలాటలు కదా! నాశానికై వాడకుండా సంఘాభివృద్ధికి ఈ సంఘశక్తి వినియోగపడాలి.

దీని నిర్వహణలో క్రమ శిక్షణ ముందుండాలి. చేపట్టిన కార్యక్రమం పట్ల ఏమరుపాటు తగదు. నిర్లక్ష్యం పనికిరాదు. అంతేకాదు ఋజుత్వం,

పవిత్రత ప్రధానాంశములే. ప్రజలను ప్రేమతో, మృదువుగా పలుకరించాలి. డబ్బు ఖర్చుపెట్టేటపుడు నీతి నిజాయితీలుండాలి. నిర్లక్ష్యమూ పనికిరాదు. ఇతరులకు సందేహాలు కలిగేటట్లు ప్రవర్తించకూడదు. ఎవరైనా ఇట్టి సంఘ కార్యక్రమాన్ని నడిపినపుడు శంకించినంత మాత్రంచే మధ్యలో విడిచిపెట్టకూడదు కూడా. ఒక గ్రామాభివృద్ధికి ఇరుగు పొరుగు గ్రామప్రజలూ తోడ్పడాలి.

"నహి జనపదం దుఃఖం ఏకః శోచితు మర్హతి" అనే మాట వాడుకలో ఉంది. అనగా ఒక ప్రాంతానికి చెందిన సమస్యల గురించి ఒక్కడూ బాధపడి ప్రయోజనం లేదని అర్థం. అంటే అందరూ పాలు పంచుకోవాలనే అర్థం. ఈ మాటను విని కూడా మన మతంలో సంఘసేవ లేదంటే ఎలా? సమస్యల గురించి వట్టిగా దుఃఖించడం కాదని, ప్రజలందరూ కలిసి చేయి చేయి కలపాలని దానర్థం. మరొకటి, ఒక్కనివల్ల ఏమీ జరగదని, అందరూ పాలు పంచుకోవాలని హితబోధ.

సాధారణంగా మన పనులు పూర్తిచేసుకోవడానికి ఇతరులను బాధపెట్టినా జరిగేటట్లు చేసుకొంటాం. కాని సామూహిక కార్యక్రమంలో పాల్గొంటే వచ్చే సుఖమే వేరు. అపుడు స్వార్థాన్ని ప్రక్కన పెడతాం. ప్రేమానురాగాల రుచి తెలుస్తుంది.

పూర్త ధర్మాలలో ముందు నీటిని గురించి చెప్పాను. ఈనాటి రాజస్థాన్, ఒక ఎడారి ప్రాంతం. ఏడెనిమిది మైళ్ళ దూరంలో ఎవరో పూర్వులు ఒక నూతిని త్రవ్వించేవారు. వాటిని త్రవ్వించే వారి పేర్లు శాసనాల రూపంలో నేటికీ కన్పిస్తాయి. ఇవి చరిత్రకు ఉపకరిస్తాయి. వీటిని వాపీ ప్రశస్తులంటారు. అనగా నూతి త్రవ్వకాన్ని ప్రశంసించటం. ఈనాటికీ మార్వారీలు ఈ ధర్మంలో అగ్రేసరులు. వారికి నీటి బాధ తెలుసు కనుక.

గ్రామాలలో తటాకాలను నిర్మించవచ్చు. ఉన్నవాటిని శుభ్రం చేయవచ్చు. తరతమ భేదం లేకుండా దీనిని నిర్వహించండి. పూడికలను తీయండి. ఇట్టి పనులలో ధనవంతులూ శారీరక శ్రమ చేయాలని శాస్త్రాలన్నాయి. అంతేనే కాని నేటి మాదిరిగా పునాది రాళ్ళు వేయడం, పత్రికా ప్రకటనలు ఫొటోలు, రిబ్బన్లు కత్తిరించడం వంటివి ఆనాడు లేవు. రథోత్సవంలో అందరూ పాల్గొనరా! అట్లాగే పైవాటిలో కూడా.

## మాధవసేవ - మానవసేవ

ఒక మూల రథోత్సవం జరుగుతూ ఉంటే అది మానివేసి సంఘసేవ చేద్దాం రండని అనడం తప్పు. మాధవసేవ కంటె మానవసేవకే పట్టం కడుతున్నారు. దానికి వారు, తిరుమూలర్ వ్రాసిన తిరుమందిరాన్ని ఆధారంగా చూపిస్తున్నారు. ఆయన మానవసేవయే మాధవసేవ అని అన్నాడు. ప్రపంచాన్ని భగవత్ స్వరూపంగా భావించి సేవించడం భగవానుని సేవించడమే అని భాగవతమూ చెప్పింది.

ఇట్లా చెప్పడం వల్ల భగవంతుని పూజించకూడదనే విపరీతార్థాన్ని లాగకూడదు. అన్న వస్త్ర దానాదులు చేసి వాటిలో అంతిమ లక్ష్యాన్ని గుర్తించునట్లు చేయకపోతే ఏం లాభం? ఇట్టి పరమ గమ్యం లేకపోవడాన్ని తిరుమూలర్ గాని, కృష్ణుడు గాని సమర్థిస్తారా? పైవాణ్ణి తెలుసుకోడానికే ఈ శరీరాన్ని పోషించాలి, రోగాల బారిపడకుండా రక్షించుకోవాలి, జ్ఞాన సముపార్జనకు బ్రతికి యుండగానే ప్రయత్నించాలి. ఎంత సంఘసేవ చేసినా ఈ ఆలయాలు, ఉత్సవాలూ ఏ సందేశాన్నిస్తున్నాయో దానిని చింతించాలి. ఒక నాస్తికునకు వైద్యం చేయవద్దని ఆయుర్వేదం చెప్పిందని ఉపవేదాల గురించి చెప్పేటపుడన్నాను. ఎందుకిట్లా అన్నారు? వాడి జీవితాన్ని పొడిగించిన కొద్దీ ఇంకా నాస్తిక భావాలను వ్యాప్తి చేస్తాడనే కదా. దీర్ఘజీవనం

వల్ల వాడికీ లాభం లేదు. ఇతరులకూ లాభం లేదు! కనుక ఏ సేవ చేసినా మన అసలు స్వరూపాన్ని తెలుసుకోవడానికే. ఆలయ కైంకర్యం వల్ల శారీరక ఆరోగ్యమూ బాగుపడుతుంది. ప్రధానమైన చిత్తశుద్ధి లభిస్తుంది. ఇంతకంటె మించిన శ్రమదానం ఉందా?

మహాత్ముల జీవిత చరిత్రలను, స్తోత్ర గ్రంథాలను మొదలైనవాటిని చౌకగా ముద్రించి ఆస్పత్రులలో కారాగారాలలో పంచిపెట్టవచ్చు. అక్కడ ప్రవచనాలు ఏర్పాటు చేయవచ్చు. ఈ ఆధ్యాత్మిక సేవ, సేవ కాదా?

## సేవలో సహజమైన విలువ

ఈ సంఘసేవ వల్ల వచ్చే లాభాలేమిటని అడగకూడదు. రామాయణంలో సేతు నిర్మాణం జరిగింది. అందొక ఉడత తనవంతు సాయం చేసిందని విన్నాం. దీని సేవవల్ల రామునకేమైనా కలిసి వచ్చిందా? కాని అది లాభం పొందింది. రాముని దయకు పాత్రమైంది. అతని స్పర్శ సుఖాన్ని పొందింది. కనుక చేస్తూ ఉంటే చిత్తశుద్ధి కలిగి లాభపడగలం. అనగా ఈశ్వరానుగ్రహం. ఈ ఉడత మాదిరిగా ఇద్దరు చేసిన ఉపకారం గుర్తుకు వస్తోంది. 1944లో కంచి కామాక్షి ఆలయానికి కుంభాభిషేకం జరిగినపుడు ఒక చిన్నకొట్టుగల ఆసామి ఒక్క రూపాయి పంపి, ఇంతకంటె ఈయలేకపోతున్నానని నాకొక సుదీర్ఘమైన లేఖ వ్రాసాడు. అట్లాగే 1962లో భారత గ్రామ కళా విద్వత్ సదస్సు ఇలయత్తం గుడిలో జరిగినపుడు, ఒక ఆసామీ మద్రాసు నుండి ఐదు రూపాయలు పంపి పెద్ద మొత్తాలతో బాటు దీనినీ స్వీకరించండని అర్థించాడు. పెద్ద మొత్తాలను మరిచిపోయాను కాని పై ఇద్దరూ గుర్తున్నారు.

కనుక చాలాసార్లు చెప్పినట్లు మన సేవవల్ల ఇతరులకు లాభం ఉందా అని విచారించకుండా మనలోని అహంకారం ఎంతవరకూ తగ్గిందో విచారించుకోవాలి. అందరూ కలిసి సేవ చేస్తున్నపుడు, ఏ నూతినో

త్రవ్వినపుడు పెల్లుబికే నీటిని చూసి సంతోషిస్తాం కదా. ఇట్టి ఆత్మతృప్తి, సంతోషం, దయ, ప్రేమలు క్రమక్రమంగా పరమాత్మ స్వరూపాన్ని తెలుసుకోవడానికి దోహదం చేస్తాయి. మనకు భక్తి ఉంది, భగవంతుడు కరుణిస్తాడంటే కుదురుతుందా? సేవ చేస్తూ మనస్సును అదుపులో ఉంచుకోగలిగితే అపుడు ఈశ్వరానుగ్రహం వస్తుంది.

అన్నార్తులకు, రోగార్తులకు ఎన్నో సేవలు చేయవచ్చు. ప్రేమ, చేతలలో వ్యక్తీకరింపబడాలి. అంతేనేకాని రాయివంటి హృదయమైతే రాతినుండి నీరు స్రవిస్తుందా? అనుగ్రహ ప్రవాహం అంతటా ఉంది. నీటిలో ఒక గుడ్డను వేస్తే అది నీటిని పీల్చుకొంటుంది. దానిని పిండితే నీరు వస్తుంది. అట్లా రాతి వంటి హృదయాన్ని పిండగలమా? ఈ గుండెను బట్టగా మార్చుకోగలగాలి. మనం చేరడంతో బాటు ఇతరులను భగవత్ సన్నిధికి చేర్చడమే మనం చేసే మహోపకారం.

మనమే పాఠశాలనో, ఆస్పత్రినో కట్టామనుకొందాం. ఆ సేవ ఎప్పుడు పరిపూర్ణమౌతుంది! దానిని భగవత్ కైంకర్యంగా భావించినపుడు మాత్రమే. ఇట్టి సేవను తమిళంలో తిరుప్పణి అంటారు. పణి యనగా తమిళంలో సేవ. శ్రీ, తిరు అయింది. ఆ పదమే మన లక్ష్యాన్ని నిర్దేశిస్తోంది.

ఇదివరకు జీతాలనాశించి పెద్ద పెద్ద ఆలయాలను కట్టారా? రాజుల వితరణ ఎట్లాగూ ఉంది. కాని సేవ చేసేవారిలో అంకితభావం ఉంది. ఆనాటి జన సంఖ్య తక్కువ. తిండికి, గుడ్డకు బాధ పడవలసిన రోజులు కావవి. విలాసాలు, విందులకు ఖర్చు పెట్టేవారు కాదు. ఈనాడున్నట్లు పెద్ద పెద్ద కర్మాగారాలు, ఆనకట్టలు కట్టవలసిన అవసరములేదు. ఒక్క సైన్యానికి తప్ప మిగతా వాటికి రాజు ఖర్చు పెట్టవలసిన అవసరం ఉండేది కాదు. అందువల్ల ఉన్న ఆదాయంలో ఎక్కువగా దేవాలయాది నిర్మాణాలకై రాజు ఖర్చు పెట్టేవాడు. అందుకే ఆసేతు హిమాచలం అంతంత ఆలయాలు, గోపురాలు మన ఊహకందని రీతిలో వెలిసాయి.

ఈనాడు మానవసేవయే మాధవసేవ యని గొంతు చించుకుంటున్నాం. భగవత్ సంబంధాన్ని త్రుంచి వేస్తున్నాం. లక్ష్యాలు పూర్తిగా నెరవేరుతున్నాయా?

ఏ ఆలయం ఎక్కడున్నా అన్ని మూలలనుంచి వెళ్ళి దర్శించుకొంటున్నారు. ఇప్పుడొక ఆనకట్ట కట్టాలన్నా, ఒక పరిశ్రమ స్థాపించాలన్నా మాకు మాకని ఎగబడడం, దక్కకపోతే పొరుగు రాష్ట్రాలతో కొట్లాటలూ చూస్తున్నాం కదా.

అందరికీ విద్య యనడం బాగానే ఉంది. అయితే దానిని మతంతో ముడిపెట్టవద్దని అంటున్నారు. కేవలం విషయాన్ని అందించడమే విద్యాలక్ష్యంగా మారిపోయింది. మతరహిత రాజ్యంలో దీని ఊసెత్తకూడదని ఆందోళనలు. అందువల్ల నేరాలు, తెలివితో మోసాలు, దుష్ట ప్రవర్తనలు హెచ్చు మీరుతున్నాయి.

ఇక ఆస్పత్రులను కడుతున్నారు. అక్కడా మత సంబంధం ఉండదు. త్రాగినా ఇష్టం వచ్చినట్లు తిన్నా, వ్యభిచరించినా ఇబ్బందేమీ లేదనే మనః ప్రవృత్తి ప్రబలుతోంది. గర్భస్రావం చేసుకోవచ్చని భరోసా. అక్రమ ప్రవర్తనలవల్ల వచ్చే చెడు ఫలితాలను తుడిచివేయవచ్చనే ధీమా ఏర్పడుతోంది.

బ్యాంకులు ఋణాలనిచ్చి ప్రజలను ఆదుకొంటున్నాయని ప్రచారం సాగుతోంది. వాటికై తప్పుడు మార్గాలను ప్రజలన్వేషిస్తున్నారు. ఈయడంలో లంచాలు సకాలంలో చెల్లించకపోవడం.

అట్లాగే సేవాసదనాలున్నాయి .ఆక్కడా మనో నిగ్రహం లేదు. ఆ సేవకు భగవత్ సంబంధం లేదు.

అప్పర్‌స్వామి ఈ సందర్భంలో మార్గ నిర్దేశనం చేసారు. "నా ధర్మం పని చేయడమే, చేసి సదలించుకోవడమే" అన్నాడు. అతడేమి చేసేవాడు! భగవత్ కీర్తనలు పాడి భక్తులను పరవశులను చేసేవాడు. అతని దగ్గర

కొందరు పలుగుపారలతో సిద్ధంగా ఉండేవారు. వాటితో ఆలయాలను శుభ్రం చేసేవారు. ఇట్లా సేవను, కీర్తనను కలిపాడు. అతణ్ణి ఆదర్శంగా తీసుకొని ఏ సంఘ కార్యక్రమం చేసినా లాభం చేకూరుతుంది.

ఎట్లా అనుసంధానం చేయాలో చూడండి. దీపావళి వంటి పండుగలలో క్రొత్త బట్టలను ధరిస్తాం కదా. ఆనాడు పేదలకు వస్త్రదానం చేయడం, ఆలయంలోని మూర్తికి క్రొత్తబట్టలనర్పించడం, వెల్ల వేయడం, ఆలయంలోని పిచ్చి మొక్కలను పెరికివేయడం, మన మనస్సులలో చెత్తను గెంటివేస్తున్నట్లు భావించడం వల్ల కనక సభలోని శివుని మాదిరిగా మన మనస్సులు బంగారు మయమౌతాయి. మన హృదయాలే ఆలయాలుగా మారితే అందు శివుడుంటాడు.

మానవసేవయే మాధవసేవ అని చెప్పిన తిరుమూలర్, ముందు స్వామిని అర్చించి గోవులకు గ్రాసం, పేదలకు అన్నదానం చేయాలన్నాడు. ఇవేమీ చేయలేకపోతే చల్లని మాటలైనా మాట్లాడమన్నాడు. కనుక భగవత్సేవను ప్రక్కనపెట్టి మానవసేవ లేదు. అవి రెండూ ఏకకాలంలో జరగాలి.

స్వామీ! నీ కన్నులు తెరిచి మమ్మల్ని చూడుమని ప్రార్థిస్తాం. అతని కన్నులెపుడూ తెరుచుకునే ఉంటాయి. అతడు మనం కోరినవన్నీ ఈయకపోవడానికి కారణం మనం కన్నులు తెరుచుకొని ఉండకపోవడమే. అంటే ఇతరులపట్ల మనం దయ చూపించకపోవడమే. కనుక ముందుగా మనం కన్నులు తెరవాలి. అతడు కాదు.

బాధపడేవారి బాధను పోగొట్టడమే కాదు, ఇది మనద్వారా చేయిస్తున్నాడనే భావన కలిగియుండాలి. ఈ సుఖదుఃఖాల కంటే అతణ్ణి చేరుకొనుటయే ముఖ్యమని భావించాలి.

మన మతాన్ని ఏదో కంచె అడ్డంగా పెట్టి రక్షించుకోనవసరంలేదు. ఇది ఒక పెద్ద మైదానం వంటిది. దానిని మహాత్ములు రక్షిస్తారనే నమ్మకం

కలిగి యుండండి. చేయవలసింది, అందర్నీ కలుపుకుని సేవ చేయడమే. మనలో నిర్లక్ష్యం, నిర్దయత్వాన్ని తరుమగలిగితే ఇతరులు వచ్చి మన మతాన్ని మార్చారనే చింతరాదు. మతాన్ని మారుస్తున్నారని ఇతరులను నిందించకండి.

నాకు దండలు వేయడం కాదు. ప్రేమ భావంతో భగవంతుడు నన్నొక పనిముట్టుగా వాడుకొంటున్నాడని సేవించండి.

## ముద్రాధికారి వ్యవస్థ

సనాతన ధర్మలక్ష్యం, సర్వజనుల క్షేమాన్ని ఆకాంక్షించేది. దురదృష్టవశాత్తు, ఈ లక్ష్యం పుస్తకాలలోనే ఉండిపోయింది. క్షీణిస్తోంది కూడా. దీనిని మరల ఉద్ధరించాలనే భావనతో 1940లో తంజావూరు జిల్లాలోని-అన్ని గ్రామాల్లో మఠమే ఒక్కొక్క ముద్రాధికారిని నియమించింది. దీనివల్ల పూర్త ధర్మాలైన చెఱువులను త్రవ్వించడం, బాగు చేయడం వంటివే కాక పురాణ పఠనం, ఆలయ పరిరక్షణ మొదలైన కార్యక్రమాలు నిర్వహింపబడేవి.

పశువుల దాణాకై ఏర్పాట్లు చేసాం. పశువులకై ఉండే గోచర భూములు క్రమక్రమంగా క్షీణించిపోయి భవనాలు లేచే కాలం కాబట్టి ఇంటి పెరటిలోనే పశువుల దాణాను ఏర్పాటు చేయడం జరిగింది.

ఎట్లా? ఇంట్లో కూరలను తరుగుతాం. ఆ కూర చెక్కులను ఒకచోట ప్రోగుచేసి అందించవచ్చు. ఇంటింటికి వెళ్ళి ప్రోగుచేయడం జరిగేది.

ఏదో కాస్త డబ్బును హుండీలో వేయవచ్చు యాంత్రికంగా. కాని సేవ చేసేవారికి, చేయబడేవారికి ఒక అనుబంధం ఉండాలి. అప్పుడొక మానసిక అనుబంధం ఏర్పడుతుంది. ఆ కూర చెక్కుల్ని ఆవు తింటూ ఉంటే ఆనందం కల్గడం లేదా? కనుక డబ్బు కంటే, కాయకష్టం కంటె ప్రాణుల మధ్య అనుబంధం ఉండడం విశేషం.

పాలీయనంత మాత్రంచే పశువులను కబేళాలకు పంపివేయడం ఘోరాతి ఘోర నేరం. వాటిని సాకడం మాతృసేవతో సమానం. తన బిడ్డకే కాదు, ఇతరులకు కూడా సరిపడా పాలుండడం అనే సృష్టి ధర్మం కలిగిన ఆవును పోషించవద్దా?

మహమ్మదీయుల కాలంలోనూ గోవధ నిషేధింపబడింది. ఇక మత విద్వేషాన్ని రెచ్చగొట్టారు తెల్లదొరలు. గుజరాత్ ప్రాంతీయులు గోసేవలో ముందున్నారు. గోపాలకృష్ణుడు అక్కడ పుట్టడం వల్ల గోవులపై వారికి ప్రేమ ఎక్కువ.

పూర్వకాలంలో పశువుల కొట్టాలుండేవి. మర్చిపోయాం. కాని ఉత్తరదేశంలో గోశాలలు గణనకెక్కాయి.

గోవధను అన్ని రాష్ట్రాలవారూ నిషేధించేటట్లుగా చట్టాలు వెంటనే తీసుకొని రావాలి. గోరక్షణ అంటే వాటిపై దయ చూపించడమే కాదు, లక్ష్మిని పూజించినట్లే.

చెఱువులను త్రవ్వేటపుడు భోజనాలకు ఏర్పాటు చేసాం. కాని వారి అన్నాన్ని వారే తెచ్చుకొనేవారు. అట్టి ప్రేమతో పనిచేసే బీదలూ మనదేశంలో సంస్కారవంతులే. రథోత్సవంలో అందరూ కూడినట్లు ఇట్టి పనులలో అందరూ కలిసి రావడం నాకెంతో ఆనందాన్ని కల్గించింది. ఒక పున్నమినాటి రాత్రి మాయావరంలో చెఱువు త్రవ్వడాన్ని కళ్ళారా చూసాను. ఆ నీటిలో చంద్రకాంతి ప్రసరించడం, ప్రేమను ఒలకబోసే వారి సేవ, ఇప్పటికీ గుర్తున్నాయి. క్రమక్రమంగా అట్టి పనులు క్షీణించి పోయాయి.

ఒక్క తంజావూరు జిల్లాలోనే చాలామంది ముద్రాధికారులను, ఉప ముద్రాధికారులను నియమించాం. వీరి ఆధ్వర్యంలో పనులు చకచకా సాగేవి. ఆ జిల్లాలోనే మా మఠానికి కొంత భూమి ఉండడం వల్ల దానిపై వచ్చే ఆదాయాన్ని ధర్మకార్యాలకై వినియోగించమని అప్పుడెప్పాను. ఐదువేలమంది కార్యకర్తలు, ఇట్టి పనులు చేసేవారు.

ఇరుగు పొరుగు గ్రామాలవారూ వచ్చి సేవలందించేవారు. ఇట్లా ఒక్కొక్క సంవత్సరంలో ఒక్కొక్క గ్రామంలో పనులుండేవి. ఈ జిల్లాలో నీటి ఎద్దడి ఎక్కువగా ఉండడం వల్ల ఇట్టి పనులు చేసారు. హరిజనవాడలలోను ఇట్టి ఏర్పాట్లు ఉండేవి.

మన శాస్త్రాలలో ఒక సామాన్య ధర్మం ఒకటుంది. చెఱువులో స్నానం చేసేటపుడు నాల్గు ముద్దల మట్టిని తీసి గట్టున వేయాలని. దీనివల్ల పూడిక బాధ కొంత తప్పినట్లే కదా!

కోనేరి రాజపురంలో ఒక బ్రాహ్మణ కుటుంబం ఉండేది. ఎక్కడ చెరువు త్రవ్వినా సగం ఖర్చు వారే భరించేవారు. చెఱువునకు ఒక ప్రక్క మెట్లుండరాదనేవారు. ఎందుకంటే పశువులు దిగడం కష్టం కదా. ఎంత ఉదారభావమో!

ఇట్లా జిల్లా అంతా చేసినా ఒక్క పుదుక్కోట తాలూకాలో మాత్రం చేయలేదు. నాలుగైదు అడుగుల లోతు త్రవ్వితే నీరు పుష్కలంగా వచ్చేది కాబట్టి. అక్కడ చెఱువులకు బదులు రహదారులు ఏర్పాటు చేసాం.

ఏకాదశి రోజులలో పురాణ పఠనం ఉండేది. ఈ వ్యవస్థలో వర్ణభేదాలు, ఎన్నికలు, సభ్యత్వపు రుసుములు, ప్రభుత్వ ఆమోదం, హంగూ ఆర్భాటం లేదు. విడిగా వ్యక్తులు అట్టి పనులు చేయగలరా? చూసారా సంఘశక్తి మహిమ. పరస్పర ప్రేమానురాగాలు, శ్రమ జీవన సౌందర్యం తొణికిసలాడేది.

## వారానికి ఒకరోజు పూజ

వారానికి అందరూ కలిసి పూజ చేయండి. ఇతర మతాలు తమంతట తామే ఈ పని చేస్తున్నాయి. వారి సామూహిక ప్రార్థనల బలంవల్ల దేశాన్ని రెండు ముక్కలుగా చేసి తమ వాటాను తాము పొందగలిగారు. ప్రపంచ ప్రజల మన్ననలందుకొన్న మనం, రోజురోజుకీ క్షీణిస్తున్నాం. గమనించారా?

మాయావరంలో తిరుప్పావై, తిరువెంబావై సంఘం ఒక పద్ధతిలో కార్యక్రమాలను జరుపుతోంది. ఈ రెండు పాశురాలను కంఠస్థం చేసే వారికి పోటీలు, బహుమతులిచ్చి ప్రోత్సహిస్తోంది. భక్తి సాహిత్య వితరణ జరిగింది. అట్లాగే ఈ సంఘంలో అనాథ ప్రేత సంస్కారం, ఆలయంలో దీపాన్ని వెలిగించుట, ప్రసాద వితరణ, పచ్చిక మైదానాల ఏర్పాటు వంటివి ఎన్నో ఉన్నాయి.

అట్లా ముందు సామూహికంగా ఆలయంలో భజనలు చేసి ప్రజాహిత కార్యక్రమాలకు శ్రీకారం చుట్టండి. నీ దయవల్ల పనిచేయగలిగాం, ఈ మానవ జన్మ ప్రసాదించినందులకు ఋణపడియున్నాం అని భగవంతుణ్ణి ప్రార్థించి చూడండి. ప్రవచనాలలో ఏదో ఒక భక్తుని గాథను వినిపించండి. కావలసినంత మనశ్శాంతి దొరుకుతుంది. వైష్ణవ భక్తులైన అళ్వార్లు, శైవభక్తులైన నాయనార్లు ఎందరో మనకున్నారు. ఇట్లా సామాన్య మానవులు దివ్యత్వాన్ని పొందగలరు.

## ఖర్చు పెట్టుటలో జాగరూకత

సంఘసేవకై డబ్బు కావాలి కదా. ధనవంతులపైనే ఆధారపడనవసరం లేదు. ఇంటి కొక పూవు. ఈశ్వరుని కొక మాల. ధనవంతుడు డబ్బీయుడమే కాదు, శారీరక శ్రమ కూడా ఇయ్యాలి. అప్పుడే నిజమైన త్యాగం అనిపించుకొంటుంది.

ధనవంతుణ్ణి విరాళాలకై పీడించకండి. అతడు తన గౌరవాన్ని నిలబెట్టుకోవడం కోసం ఎన్నో పనులను చేయవలసి వస్తుంది. క్లబ్బులలో సభ్యత్వం – విరాళాలు – పాఠశాలలో బహుమతులు – వాహనాలు – బంధ్రోతులు – వారిపై ఖర్చు – రాజకీయ పార్టీలకు విరాళాలు – ప్రభుత్వానికి

పన్నులు కట్టుట - కొన్ని అనవసరపు ఖర్చులు - ఇట్లా ఎంతో భారం ఉంటుంది. కనుక అట్టివారి దగ్గరకు వెళ్ళవద్దంటాను.

అసలిచ్చేవారే కొద్దిమంది. ఆ కొద్దిమంది దగ్గరకు రకరకాల సాంఘిక కార్యకర్తలు వెళ్లినపుడు విసుగు చెంది ఏదో నిర్లక్ష్యంగా ఇస్తూ ఉంటారు. లేదా అవసరమైన దానికి తక్కువ ఇస్తున్నామని బాధపడతారు కూడా. వారంతట వారు తెలుసుకొని ఇస్తే సరేసరి. బలవంతం చేయకూడదంటాను.

మరొక చిక్కుంది. అంత ఖర్చు వారే భరిస్తే కార్యకర్తలపై పెత్తనం చెలాయిస్తారు కూడా.

సాంఘిక కార్యక్రమాలలో మునిగి తేలేవారు డబ్బు బాగా వచ్చి గంతులు వేయకూడదు. ప్రోగు చేయడం అలవాటైతే సేవ పట్ల అనురాగం సన్నగిల్లుతుంది కూడా. రసీదు పుస్తకాలకై పరుగు - పత్రికా ప్రకటనలు - ప్రత్యేక సంచికలకని బయలుదేరడం - ప్రకటనలకై వ్యాపారవేత్తల వెంట బడడం - విరాళాలను వెనకేసుకొంటున్నాడనే అపవాదులు - ఇట్టి తలనొప్పుల వల్ల సేవయొక్క పవిత్రత దెబ్బతింటుంది. కనుక ఇట్టివారు జాగరూకతతో ఉండాలి. మితవ్యయం ఉండాలి.

ఎంతమంది ఐకమత్యంతో ఉండి పనిని నిర్వహిస్తున్నారో దానికే ప్రాధాన్యం కాని డబ్బుకి కాదు. ఇంత చేసామని ప్రకటించుకోకూడదు. దీనివల్ల పుణ్యఫలం పోతుంది. తిరుప్పూందురై అయ్యనార్ కోవెలలో ఒక తటాకాన్ని త్రవ్వించాం. దాతలపేర్లు, ఖర్చులు 'కామకోటి' పత్రికలో ప్రకటించారు. ఇట్లా చేయడం మంచిది కాదని క్షమాపణ పూర్వకంగా ఒక ప్రకటన వేయించాను. డబ్బు వల్లనే అట్టి పనులు జరగవని, ప్రజల ప్రేమవల్లనే అట్టి పనులు కొనసాగుతాయని గుర్తు చేస్తున్నామని ఇకనుండి అట్టి జాబితాలుండవనే వార్తను ప్రచురింపజేసాము.

## డబ్బుతో - శరీరంతో

చేతిలో పైసా లేకపోయినా, పవిత్ర స్థలాలో కొన్ని లక్షల మందికి అన్న సమారాధన చేసిన 'శివన్' గురించి తెలుసుకొందాం. అతడన్న దాన శివన్‌గా ప్రసిద్ధుడు. ఒంటిమీద ఒక తుండుగుడ్డ వేసుకొని ధనవంతులను సమీపించి ఇన్ని బస్తాల బియ్యం పంపు, పప్పు పంపని అనేవాడు. దానినొక ఆజ్ఞగా భావించి గౌరవంతో పంపిస్తూ ఉండేవారు. అందొక ముద్దైనా తినేవాడు కాదు. ఏవో కొన్ని అటుకుల్ని నీళ్ళలో నానవేసుకొని తినేవాడు. కోటీశ్వరులు చేతులు కట్టుకొని నిలబడేవారు. డబ్బుంది కదాయని తానెక్కువ యనే భావన రాకూడదని చెప్పడానికే చెప్పాను.

ఉన్న సంపదకు ఒక ధర్మాధికారిలా భావించి ప్రవర్తించాలని పెద్దలన్నారు. తిరువళ్ళువర్ చెప్పినా, గాంధీగారు చెప్పినా అదే. ఈ భావనను పెంపొందించుకోగలిగితే కమ్యూనిజం వంటి విప్లవ భావాలు దరిచేరవు. ఎవరికి వారే ప్రేమతో దానం ఇచ్చేటట్లు, సేవ చేసేటట్లుగా చేయాలి.

శివన్ గురించి చెప్పాను కదా! అతనికి కొంత భూమి. అందు రెండు కొబ్బరి చెట్లుండేవి. దీనితో బ్రతికేవాడు. ప్రొద్దున్న అగ్నిహోత్రం చేసేవాడు. తరువాత నేలను బాగుచేయట – మరల మాధ్యాహ్నిక సంధ్యావందనం. తరువాత భోజనం – ఇదీ అతని దినచర్య. వయస్సు మీదబడినా కాయకష్టం చేయడం మానక దానిని కొబ్బరితోటగా మార్చాడు.

సంఘసేవ వల్ల వచ్చే ఆనందం కంటె జీవితాంతం తనకున్న కొద్దిపొలంలో శ్రమ పడడం వల్ల ఎక్కువ ఆనందం పొందేవాడు.

పెద్ద పెద్ద సాంఘిక కార్యక్రమాలే చేయలేకపోవచ్చు. ఒక బీదపిల్ల వానికి పలకో, బలపమో ఈయవచ్చు. కొద్ది గంజిని పోయవచ్చు. పలుచని మజ్జిగనిచ్చి దాహార్తిని పోగొట్టవచ్చు. మనకు మనసుంటే దారులు కనిపిస్తాయి.

## సంఘసేవలో వర్ణాల ప్రసక్తి ఎందుకు?

సేవలో డబ్బు, శ్రమదానం కావాలని చెప్పాను కదా. అంతేకాకుండా మత సంబంధ కార్యక్రమాలు తెలిసినవారు ఉండాలి. ఇతరులకు చెప్పాలి. భజనలు చేయించాలి, చేయాలి.

భజన సంఘాలు ఆలయంలో కలవాలి. అట్టివారు సంఘసేవచేస్తే జనులు విశ్వసిస్తారు. ఇట్టి సేవా కార్యక్రమాలలో వర్ణానికి, వర్ణ ప్రాతినిధ్యానికి తావీయకూడదు. ఆర్య ద్రావిడ భేదాలను తీసుకొని రాకండి. అందరూ కలిస్తే సుహృద్భావం తనంతట తానే వికసిస్తుంది.

## తనకున్న దానితో సేవ

శంకరులు భజగోవింద స్తోత్రంలో:

**"యల్లభసే నిజకర్మో పాత్తం, విత్తంతేన వినోదయచిత్తం"** అన్నారు. అనగా నీకు లభించిన వృత్తి వల్ల వచ్చేదానివల్ల నీ శరీరాన్ని పోషించుకోవడమే కాకుండా దానాదులు చేసి మానసికంగా ఉన్నతిని పొందుమని.

కాని నేడు కొన్ని వృత్తులలో పాపాలు చేయవలసి వస్తోంది. సంపాదించిన దాంట్లో ఎంతో కొంత పాపద్రవ్యం ఉంటుంది కనుక దానం చేస్తే సరిపోతుందా అని ప్రశ్నిస్తారు. సంపాదనలో పాపం మిళితమై యుంటుందని ఆనాడు వారు భావించలేదు. ఈనాటి పరిస్థితులానాడు లేవు. నేనేమంటానంటే యథాశక్తి సేవ చేయమంటున్నా. నీవు చేసే సేవవల్ల మరల డబ్బు వస్తుందని ఆశించి మాత్రం సేవ చేయవద్దంటున్నా. కళంకితవృత్తిలో ఉన్నా కొంతవరకూ త్యాగభావంతో, సేవాభావంతో చేయవచ్చు. ఇక పవిత్ర వృత్తుల గురించి చెప్పేదేముంది? వారు చేసిన సేవ వల్ల ఇంకా పుణ్యం వారికి వస్తుంది.

నీవు వైద్యుడివా? డబ్బు తీసుకొని సేవ చేయవచ్చు. అయితే అది నిన్ను పవిత్రుణ్ణి చేయదు. ఒక దొంగ సర్టిఫికెట్ రాయవలసి వస్తే కొంత మురికి అంటుకొంటుంది. ఆ మురికి పోవాలంటే ఏమీ ఆశించకుండా పేదలకు వైద్యం చేయవచ్చు కదా! అట్లాగే న్యాయవాద వృత్తిలో ఇతరులనుండి డబ్బు గుంజినా కనీసం న్యాయం జరగవలసిచోట ఒక పేదవాని నుండి డబ్బు తీసుకోకుండా వానికి తృప్తి కలిగించవచ్చు. ఖర్చు పెట్టించకుండా న్యాయస్థానం బైట ఒక సమస్యను పరిష్కరించవచ్చు. ఇట్టి మంచి పనులను కొన్నింటినైనా చేసి ఆత్మతృప్తిని పొందవచ్చు.

నీవొక సంగీత విద్వాంసుడవైతే ఒక సంఘ కార్యక్రమానికి ఉచితంగా పాడి ఆ డబ్బును వారికీయవచ్చు. అట్లాగే ఒక రచయిత, ఒక పుస్తక ప్రచురణ కర్త చేయవచ్చు.

డబ్బీయకపోయినా, శ్రమదానం చేయలేకపోయినా చల్లని మాటను మాట్లాడి సేద దీర్చవచ్చు. అందుకే మధురమైన వాక్కును మాట్లాడుమని తిరుమూలర్ అన్నాడు.

మేము ఉద్యోగ విరమణ చేసాం. ఏం చేయగలం అంటారు. మీరు శుష్కించిన వృక్షాలా? కాదు, కల్ప వృక్షాలంటాను. భగవానునిపై అచంచల విశ్వాసం, నిరాడంబరత ఉండే మీరు యువకుల కంటే ఎక్కువ సాధించగలరు. బలహీనులమనే భావన రానీయకండి. నాకు వయస్సు వచ్చే చెబుతున్నా.

వానప్రస్థం ఎందుకని విధించారు? ఇంకా వృత్తి వ్యాపారాలు చేయాలా? ఇంతవరకూ పిల్లలకై తాపత్రయం. ఇంకా మునిమనవల కోసం ఆరాటమా? చదువవచ్చు, చదివినది ఇతరులకు చెప్పవచ్చు. జీవనభృతి వస్తూ ఉన్నపుడు దానధర్మాలు చేయవచ్చు కదా!

## ఆచార పరిరక్షణ

ఇంతవరకూ చెప్పినది అందరికీ వర్తించినా ముఖ్యంగా బ్రాహ్మణుల గురించి మాట్లాడుతున్నా. కమ్యూనల్ జీ.వో (వర్ణాలబట్టి కళాశాలలో సీట్లు, ఉద్యోగాలు) ఎప్పుడైతే వచ్చిందో బ్రాహ్మణ విద్యార్థులు కటకట పడుతున్నారు.

ఇట్లా వీరు నిరాకరింపబడడాన్ని విని సంతోషించాను. కారణం. ఆంగ్ల విద్య వల్లనే వేదవిద్య అడుగంటింది. క్రొత్త చదువులు, ఉద్యోగాలూ వీరిని ఊరిస్తున్నాయి. వీటిని తమంతట తామే వదులుకోలేకపోయినా ప్రభుత్వం, వివక్ష చూపి వీరికి అవకాశాలు లేకుండా చేసినందులకు సంతోషించాను. దీనివల్లనైనా వీరు వేదవిద్యకు మళ్ళుతారనిపించింది. ప్రభుత్వం పరోక్షంగా బ్రాహ్మణ విధులను గుర్తుచేసింది.

అయితే ఈ అవకాశాన్ని వినియోగించుకుంటున్నారా? రకరకాల రంగాలలో ప్రవేశించి ఆచార వ్యవహారాలను పాటించడం మానివేసారు. ఈ సందర్భంలో ఉద్యోగ విరమణ చేసిన బ్రాహ్మణులు, బ్రాహ్మణ ధర్మానికి లోటు లేకుండా శిక్షణనీయాలి. ట్యుటోరియల్ కళాశాలలు పెట్టండి. ప్రభుత్వంతో ప్రమేయం లేని క్రొత్త క్రొత్త కోర్సులు నేర్పించండి. ప్రైవేటుగా వెళ్ళి డిగ్రీలను సంపాదించవచ్చు కదా. సి.ఎ, ఎమ్.బి.ఎ వంటి వృత్తివిద్యా కోర్సులున్నాయి. వాటికి శిక్షణ ఇవ్వండి. లేదా సంగీతాన్ని నేర్పించండి. ఇట్లా చేస్తే పోషించేవారికి, శిక్షణ ఇచ్చేవారికి పుణ్యం వస్తుంది.

చదువులతోబాటు మన ఆచార వ్యవహారాలను నేర్పండి. ఆదర్శవంతంగా వీరిని తీర్చిదిద్దండి. నేడు విద్యార్థులలో క్రమశిక్షణ కొరవడుతోంది. సుశిక్షితులుగా వీరిని తీర్చిదిద్దండి.

ఆహార శుద్ధి, ఆత్మోన్నతికి దారితీస్తుంది. నేడు దీనిని పట్టించుకోవడం లేదు. పూర్వం నేటి హోటళ్ళ వంటివి లేవు. ఉన్నవి ధర్మసత్రాలే. అన్నవిక్రయాన్ని మహాపాపంగా పూర్వులు పరిగణించేవారు.

ప్రధానంగా నేటి విద్యార్థులకు శుచిగా, ఆచారయుక్తంగా భోజనం పెట్టడం ఆవశ్యకం. పూర్వ సంస్కృతికి తిలోదకాలియ్యాలా? ఆలోచించండి.

## నేటి విద్యలో ప్రాచీన శాస్త్రాలు

ఉచితంగా వేదవిద్య చెబుదామన్నా గ్రహించేవారు తక్కువైపోయారు. ఒక్క వేదంలోనే కాదు, తిరుక్కురల్, దివ్య ప్రబంధాలు, తేవారం, సిద్ధార్ శాస్త్రం వంటివి అనాదినుండి ప్రచారంలో ఉన్నాయి. నేటి చదువుల వల్ల ఉపాధి దొరుకుతుందని వీటికి మంగళం పాడుతున్నారు. ఈ సమస్య నెట్లా పరిష్కరించాలి. అర్హత కలిగిన విద్యార్థులకు వేదశాస్త్రాలను నేర్పించండి. లేదా అర్హులకు ఆంగ్ల విద్యతోబాటు పాఠశాల పనిదినాలు గానీ పనిగంటలు కానీ కొద్దిగా పొడిగిస్తే నిత్యం ఉపయోగించే మంత్రాలను నేర్పించవచ్చు. సెలవు దినాలు వీటికై కేటాయించవచ్చు. మన కళలలో కొందరికి ప్రవేశం కల్పించవచ్చు, పాఠ్య ప్రణాళికతో బాటుగా అట్లా శిక్షణ పొందేవారిని తిన్నగా మెట్రిక్ పరీక్షలకు పంపండి.

ఇట్లా ప్రాచీన శాస్త్రాలతో, కళలతో పరిచయం ఏర్పడటం వల్ల, భక్తి స్తోత్ర సాహిత్యం పట్టుబడడం వల్ల భావి జీవితంలో మంచి పౌరులుగా ఆ పిల్లలు తీర్చి దిద్దబడతారు. ఇవన్నీ మామూలు పాఠ్య ప్రణాళికలకు భంగం లేని రీతిలో నిరాఘాటంగా సాగవచ్చు.

ఇట్లా ధర్మవృక్షాన్ని సాకండి. నాగరికత అనే వేళ్ళను తడపండి. వేద విద్యను ప్రోత్సహించండి.

భారతదేశానికి శ్వాస ప్రాయమైన వేదవిద్య, సంస్కృత బోధనను ప్రోత్సహించండి. దానాలలో కన్యాదానం, విద్యాదానం గొప్పదని అంటారు. మా మఠం కన్యాదాన్ ట్రస్టును, వేదరక్షణ నిధిని ఏర్పాటు చేసింది. ట్రస్టులు స్వయం ప్రతిపత్తి కల్గియుంటాయి. మతభక్తులు ఇన్సూరెన్స్ పాలసీలు

తీసుకోవచ్చు. పాలసీల నుంచి వచ్చే మొత్తం డబ్బు మఠం ట్రస్టుకు ఇవ్వనవసరం లేదు. పాలసీలు తీసుకొన్నవాళ్ళకు సగం, ట్రస్టునకు సగం చెందితే చాలు మగపిల్లలకైతే వేదవిద్యకు; ఆడపిల్లలకైతే వివాహానికి ఈ డబ్బు వినియోగించబడుతుంది. ఏ పిల్లకు పెళ్ళైనా, ఎవడు వేదవిద్యను నేర్చుకున్నా పాలసీదారులకు ఆ పుణ్యం దక్కుతుంది. సరియైన కాలంలో వివాహం చేసినవారికి, పూర్తిగా వేదం నేర్పించినవారికి అధిక పుణ్యం లభిస్తుంది.

## డిగ్రీ లేకుండా గౌరవాన్ని సంపాదించుట

ఉద్యోగ విరమణ చేసినవారు కల్పవృక్షాలుగా మారి సంఘానికి, నీడనూ, పళ్లనూ ప్రసాదించండని కోరుతున్నా. ఉద్యోగ విరమణ చేసిన ఇంజనీరు, ఇద్దరు పిల్లలకు ఇంజనీరింగ్ మెలకువుల నేర్పితే కాంట్రాక్టుదారులు వారికి ఉపాధి కల్పిస్తారు. అపుడు అగ్రవర్ణం వారికి సీటు దొరకలేదనే దిగులుండదు. సంగీత సభలలో పాల్గొనేవారికి డిగ్రీలున్నాయా? ఫలానా గురువుల శిష్యులమని అంటే గౌరవం దక్కడం లేదా? ఇట్లా వయోవృద్ధులు, జ్ఞాన వృద్ధులు సంఘానికి మేలు చేయవచ్చు. దూరవిద్య నందించే విశ్వవిద్యాలయాలున్నాయి. వాటినుండి అన్నివర్ణాల విద్యార్థులు డిగ్రీలు సంపాదించవచ్చు. అక్కడి సీట్లు కోటా అంటూ ఏదీ లేదు కదా! ఇక సి.ఎ. మరి ఇతర వృత్తివిద్యలకు సంబంధించిన శిక్షణా సంస్థలు ఉన్నాయి. ఈ వృత్తివిద్యలు విశ్వవిద్యాలయాల డిగ్రీల కన్నా మిన్నవే.

## స్త్రీలు చేసే సేవ

పని పాటలు పూర్తియైన తరువాత స్త్రీలు నల్గురూ కలిసి స్తోత్ర సాహిత్యాన్ని చదువవచ్చు. శాస్త్రీయంగా కుంకుమను చేసి ఆలయాలలో అందించవచ్చు.

(కుంకుమ చేసే పద్ధతిని స్వామివారిట్లా వివరించారు. పది తులాల గట్టి పసుపు కొమ్ములను తీసుకొని ముక్కలు చేయండి. సరిపడా, గింజలు లేని నిమ్మ రసాన్ని తీసుకొని అందులో మూడు తులాల వెలిగారాన్ని పటికను వేసి కలపండి. వాటితో పసుపు కొమ్ములను తగరంతో ఉన్న పాత్రలో వేసి వాటిని రోజూ మూడుసార్లు కలపండి. బాగా అన్నీ కలిసిన తరువాత నీడలో నానబెట్టండి. పలుచని వస్త్రంలో వస్త్రగాళితం చేయండి. గట్టి పడకుండా రెండు చెంచాలు ఆవు నెయ్యి, అందులో వేయండి)

ఇంట్లో ఆవునేయిని తయారుచేసి దీపాలకై ఆలయాలలో అర్పించవచ్చు. విరగని బియ్యపు గింజలను అనగా అక్షతలను అందించవచ్చు. విరిగిన బియ్యంతో మంత్రాక్షతలుండకూడదు. డబ్బాలలో పెట్టి ఆవునేతిని అమ్ముతూ ఉంటారు. అందు కొందరు క్రొవ్వును కూడా కలపవచ్చు. అట్టి నేతివల్ల ఫలం రాదు సరికదా దుష్ఫలితం వస్తుంది. నేనొకటి విన్నాను. ఎవరైనా మనకు శత్రువులుండి మిత్రులుగా ఉన్నట్లు నటిస్తూ మీరు చేసే హోమానికి నేతిని పంపిస్తామని అందులో పందిక్రొవ్వును కలుపుతారట. దీనివల్ల విరుద్ధ ఫలం రాదా? కనుక వీటిని బజారులో కొనడానికి బదులు ఇంట్లో చేసినది ఈయండి.

మరొక్క మాట. చాలాసార్లు చెప్పాను. స్త్రీలు పట్టుచీరలను ధరించము అని, వజ్రాల నగలు ధరించము అని, ప్రతిజ్ఞ పూనితే ఇంకా మంచిది. ఒక్క చీరకు వేలకొద్దీ పట్టు పురుగులు చచ్చిపోతున్నాయి. డబ్బున్నవారు కొంటూ ఉండగా సామాన్య స్త్రీలు వారిని అనుకరిస్తున్నారు. ఇట్టి ఆడంబరాలకు స్వస్తి పలికితే మేలు చేసినవారవుతారు. అట్లాగే కాఫీ అలవాటు.

## స్త్రీలు - శ్రమదానం

ఇంట్లో పని సరిగా చేస్తే స్త్రీలకు అదే వ్యాయామం. కార్యాలయాలకు వెళ్ళనవసరం లేదనుకొంటాను. ఇది ధర్మశాస్త్రం ప్రకారం చెబుతున్నా. వంట,

పిల్లల సంరక్షణ, భర్త యొక్క అవసరాలను తీర్చుట ఇదే పని సరిపోతుంది. తమ ఇంటిని చక్కదిద్దుకొంటే అదే దేశానికి చేసిన సేవ అవుతుంది. వారి శారీరక మానసిక ప్రవృత్తికి తగ్గట్టు వారికి పనులుండాలి. వారికి ఎక్కువగా శ్రమ ఉండకూడదు. ఇక సంఘ కార్యక్రమాలంటారా, అవి ఆలయంలో ముగ్గులు వేయడం, భజనలు జరిగేచోట శుభ్రం చేయడం, పాత్రలు తోమడం, ప్రసాద వితరణలు, అనాథాశ్రమాలకు బట్టలు పంచడం, స్తోత్రాలు నేర్పించడం వంటివి, ఎన్నో ఉన్నాయి. తటాకాదులను త్రవ్వడం వంటివి మగవారే చేయాలి.

## కష్టించి పనిచేయుట - సంతానం

మగవాళ్ళు కష్టపడడం ఎప్పుడైతే మానివేసారో మగపిల్లల శాతం తగ్గిపోతోంది. వస్తువులు తక్కువగా వుంటే వాటి ధరలు హెచ్చు అనే న్యాయం ప్రకారం ఉన్న కొద్దిమందీ కట్నాలడుగుతున్నారు. ఇట్టి కట్నాల సమస్య మతానికి కళంకమని గుర్తించండి.

పూర్వకాలంలో బ్రాహ్మణులు కర్మానుష్ఠానం చేసినా, ఇతరులు కాయకష్టం చేసినా శారీరక వ్యాయామం ఉండేది. తినే ఆహారం, పోషక పదార్థాలతో ఉండేది.

బ్రాహ్మణులు వైదిక కర్మలకు మంగలం పలికి కూర్చొని పనులు చేయడం మొదలు పెట్టారు. మిగిలినవారు వీరిని అనుకరించారు. తద్వారా వైదిక కర్మలు పోయాయి. ప్రజలలో ఈర్ష్యాద్వేషాలు ప్రబలాయి. ముందు బ్రాహ్మణులే ఉద్యోగాలకై ఎగబడ్డారు. వీరు ముందున్నారని మిగిలినవారు ఈర్ష్య పడ్డారు. దీనికంతటికీ బ్రాహ్మణుడే పతనానికి నాంది పలికాడు. అంతకంటె శారీరక పరిశ్రమ మృగ్యమై పోయింది. కల్తీ ఆహారాలు – రసాయనికపు ఎరువుల వాడకం – పోషకపు విలువలు తగ్గుట – వీటికి

తోడు కాఫీ టీల వాడకం, నరాల బలహీనతలు - రాజకీయాల కాలుష్యం - ఆందోళనలు సమ్మెలు - ఇట్లా ఒకటేమిటి అన్నీ మానసిక శాంతిని లేకుండా చేస్తున్నాయి. చిన్న వయస్సులోనే కళ్ళజోళ్లు సరేసరి. చివరికి పుంస్త్వానికీ చేటు వచ్చింది.

## శ్రమవల్ల పురుషత్వం

మనస్సు అటూ ఇటూ తిరగకుండా ఉండాలంటే భక్తి, పూజ, ధ్యానం, చదువు మొదలైనవి పనికి వచ్చినా శారీరక బలం అంతకంటే ముఖ్యమైనది. శారీరక శ్రమ చేసినపుడు మాత్రం మనసు తప్పక లగ్నమౌతుంది. మనస్సు చెడ్డ మార్గం త్రొక్కదు. అందుకే శంకరులు ముందు కర్మానుష్ఠానమన్నారు. తరువాత భక్తి, ఆపైన జ్ఞాన మార్గమన్నారు. కనుక కర్మలకే ముందు ప్రాధాన్యమిచ్చారు.

## శారీరకం, ఆధ్యాత్మికం రెండూ

బుద్ధితో పనిచేసేవాడు హాయిగా నిద్రపోతాడా? కష్టించి పనిచేసేవాడే హాయిగా నిద్రపోతాడు కదా! ఇతనిలో చెడు భావాలు రావు. వీనికే శారీరక బలం, మానసిక బలం ఉంటుంది. కేవలం బుద్ధిబలంతో బ్రతికేవానికి నిద్రపట్టక చెడు తలంపులకు లోనౌతాడు.

ముందు కాయకష్టానికి ప్రాధాన్యం ఇచ్చి భగవత్ సంబంధం కల్గియుండాలి. ఆ లక్ష్యాన్ని గట్టిగా పట్టుకోవాలి. పరమలక్ష్యం చేరుకున్నా కర్మానుష్ఠానం మానకూడదు. జీవన్ముక్తులమాట అటుంచండి. మన వంటివారు ఆ స్థితిని అర్థం చేసుకోవడమే కష్టం. ఆ స్థితి వచ్చేవరకూ శరీరంతో సేవ చేయడం మానకూడదు. అందుకే ఒక చేత్తో భగవంతుణ్ణి పట్టుకో. మరొక చేత్తో జగత్ కళ్యాణ కర్మలను చేయుమని పెద్దలంటారు.

ముందు శారీరక శ్రమ, తక్కువగా భగవత్ చింతన. తరువాత చింతనకే ప్రాధాన్యం, కాయకష్టం తక్కువగా ఉండాలి. కనుక రెండు దశలలోనూ ఇవి రెండూ కలిసే ఉండాలి. పాళ్ళల్లో స్థాయిని బట్టి తేడా. ఎందరో జ్ఞానులు కర్మానుష్ఠానాన్ని మానలేదని గుర్తించండి.

## భార్యాభర్త మధ్యలో సహకారం

శ్రమదానంతో సంపత్తి దానమూ ఉండాలి. ఎంత తక్కువగా ఉన్నా ఒక్క పైసయైనా దానం చేయవచ్చు కదా! స్త్రీలకు నగలు, వస్త్రాలపై మోజు; పురుషులకు త్రాగుడు, గుఱ్ఱపు పందాలు, పొగత్రాగడం వంటివాటిపై మోజు ఉంటుంది. ఇద్దరూ పై వాటిపై మోజు తగ్గించుకొని, అనవసరపు ఖర్చులు తగ్గించుకొని తోచినంత ధనరూపంలో సాయం అందించవచ్చు. ఇట్టి విషయంలో ఒకరితో ఒకరు సహకరం ఉండాలి.

## మొదటినుండీ దానబుద్ధి

అవసరాలు తీరిన తరువాత దాచమనే మాట ఉంది కదా! దీనిని మరొక విధంగా అన్వయించి చూపిస్తా. ఏది లేకపోతే బ్రతకడం కష్టమో దానినుంచి కొని మిగిలినది ఇమ్మంటున్నా. అత్యవసరమైన వాటికే ఖర్చుపెట్టి భోగభాగాల్కకై దృష్టి పెట్టకుండా మిగిలినది ఇమ్మంటున్నా. అదే ఆంగ్లంలో 'Charity after one needs are met'. వేదాలు 'ధర్మంచర' అన్నా, అవ్వైయార్ చెప్పినా ఆ ధర్మంలోనే దానం ఉంది కదా. అంటే ఖర్చులు తగ్గించుకున్నపుడు మాత్రమే దానం చేయగలదు. ఋణగ్రస్తుడుగా మిగిలిపోడు. తోటి సంఘానికి ఋణపడి ఉన్నామని గుర్తించండి.

ఈనాడు ప్రభుత్వం అప్పులకై ఎగబడుతోంది. దీనిని మనమూ అనుకరించి అప్పులు చేస్తున్నాం. అందరూ ఒక విధంగా

ఋణగ్రస్తులౌతున్నారు. ఆనాటి శాస్త్రాలనుండి నేటి గాంధీజీ వరకూ సాదాసీదా జీవనం గడపండని నెత్తీనోరూ కొట్టుకున్నారు. ఇక కమ్యూనిజం, వర్గ సంఘర్షణలుంటాయా? ఆదా చేసి సంఘ కార్యాలకై వినియోగిస్తే ఈర్ష్యా ద్వేషాలుంటాయా? ఖర్చు ఎక్కువై ఆదాయం తగ్గితే అదీ దొంగతనం క్రింద లెక్కబెట్టబడుతుంది. అప్పు తెచ్చినది ఇంకొకరి నుండీ కదా. తిరిగి ఇస్తాడో ఈయడో అని అవతలి వానికి బెంగ. ఎగకొడితే అది దొంగతమనే కదా! ఇద్దరికీ ఆందోళన

## కట్నం - ఘోరమైన నేరం

*(ఈ విషయమై అమృతవాణి -2 లో చర్చించడం జరిగింది. అందులేని వాటికి అనువాదం)*

మనం దుబారాగా ఖర్చు పెట్టి ఇతరులు మనలను అనుకరించేటట్లుగా చేయడం తప్పు. ఇక తానేమీ ఖర్చు పెట్టకుండా ఇతరులను ఖర్చు పెట్టునట్లు చేసేవారిని ఋణగ్రస్తులుగా మార్చడం ఇంకా ఘోరమైన నేరం. దానిని పాపమంటాం. వివాహాల పేరుతో ఇట్టివి జరుగుతున్నాయి. వైదిక కర్మలకు ప్రాధాన్యం ఇచ్చి ఆడంబరాలకు పోవద్దని ఎన్నోసార్లు చెప్పాను. ఋణగ్రస్తులై ఇక ఆడపిల్లలను చదివించి వారిచేత ఉద్యోగాలు చేయించి మురిసిపోతున్నారు. ఇది స్త్రీ ధర్మానికే విరుద్ధం.

ఆయా కాలాలలో ధర్మాలు చేయాలన్నారు. ఉదా: వేసవిలో గొడుగు, చలికాలంలో దుప్పట్లు, అన్నదానం మొదలైనవి. నేనేమంటానంటే కట్నం అడగకపోవడమే మహాదానం అంటాను. లోగడ కన్యాదాన్ ట్రస్టు గురించి చెప్పాను. ఆ ట్రస్టు నుండీ తాను కొంత తీసుకొని మిగిలినదానిన బీదపిల్లల పెండిండ్లకై వినియోగపడేటట్లు చేయవచ్చు.

పోయినవారికి అన్నం అర్పించడం కూడా వారిలో ఉందని విన్నాను. దానిని క్రైస్తవులు Viaticum అంటారట. గయకు వెళ్ళి పిండదానాలు చేసినట్లుగా క్రైస్తవులు కూడా సంతానం లేకుండా మరణించినవారికి All Souls Day జరుపుతారు. కనుక పితృదేవతల ఆరాధన అన్ని దేశాలలో ఏదోవిధంగా జరుపబడుతూనే ఉంది.

ప్రధానంగా ఈ ప్రేత సంస్కారం, అన్ని వర్ణాలవారికి సరిగా జరిగేటట్లు చూడాలి. ఇది ముఖ్యమైనది.

## దహనం - ఖననం

బ్రతికి ఉన్నవాళ్ళకే తిండి పెట్టలేక పోతున్నాం, పోయిన వానికి తద్దినాలేమిటని ప్రశ్న. ఇక శవానికి సంస్కారమేమిటి? పోనీయండి, అనాథ ప్రేత సంస్కారాలేమిటి? పురపాలక సంఘం వారున్నారు కదా! వారే పట్టించుకుంటారులే అనే నిర్లక్ష్యం.

శరీరాన్ని జీవుడు విడిచినా కన్నులకు - సూర్యుడు; నోటికి - అగ్ని; చేతికి - ఇంద్రుడు మొదలైన దేవతలు శరీరావయవాలను విడిచి పెట్టిపోరని శాస్త్రాలంటున్నాయి. సంస్కారం చేయడం వల్ల వారిని యథాస్థానాలకు పంపుచున్నాం. ఇది అపర కర్మ మంత్రాల వల్ల తెలుస్తుంది.

ఇక జీవాత్మ 16 కళలతో ఉంటాడు. 15 కళలు జీవం ఉండేటట్లు చేస్తాయి. 16వ కళ జీవుని శరీరమే. కనుక శరీరాన్ని ఈశ్వరార్పణ భావంతో సంస్కారం చేయాలి.

దీనిని అంత్యేష్టి అన్నారు. అనగా చివరి యజ్ఞమని. శాస్త్రాలలో 40 సంస్కారాలున్నాయి. సంస్కారం అంటే ఉన్న దానిని సంస్కరించుట, పవిత్రము చేయుట. సంస్కరింపబడినది కనుక సంస్కృత భాష.

ఉమ్మడి కుటుంబం వ్యవస్థ ఎప్పుడైతే పతనమైందో సోదరుల మధ్య సఖ్యమే కరువైపోయింది. విడివిడి కాపురాలు, విదేశీయ పద్ధతి ఆరాధ్యమై ఉంటోంది. ఇక ఆచారాల గురించే తెలియడం లేదు.

వివాహాలలో మంగలవాద్యాలకై, ఊరేగింపులకై, విందు భోజనాలకై ఖర్చు పెడుతున్నారు గాని పురోహితునకు ఇచ్చే దక్షిణలో వెనుకంజ వేస్తున్నారు.

## వైదిక మార్గానికి ప్రోత్సాహం

మంచి సంభావనలిచ్చి కర్మలు చేయడంలో వారిని ప్రోత్సహించాలి. లేకపోతే ఇక కర్మలు చేయించే వారే ఉండరు. ఆనాటి రాజులు భూరిదానాలు చేసినట్లు శాసనాలు చెబుతున్నాయి.

ఎంత పేదవాడైనా వైదిక కర్మలు చేసుకొనేటట్లు సాయం చేయాలి. శాస్త్ర ప్రకారం చేస్తే పెద్దగా ఖర్చు పెట్టవలసిన అవసరం ఉండదు.

ప్రతి ప్రాంతంలో వివాహ వేదికలతో పాటు ఉత్తర క్రియలకై మందిరాలను ఏర్పాటు చేసి పేదవారు కూడా ఆ ఖర్చులు భరించే రీతిలో ఉంచగలగాలి.

## మరణించినవారి పట్ల చూపించవలసినవి

పోయినవాడు వెంటనే పితృలోకానికి తిన్నగా పోడు. వెంటనే జన్మకూడా రాదు. ఒక సంవత్సరం తరువాత పితృస్థానం వస్తుంది. ఇట్టి సంగతులు గ్రీకు పురాణ గాథలలోనూ ఉన్నాయి. పోయిన జీవుడు వైతరణీ నదిని దాటి యమ పట్టణానికి వెడతాడని మనం అన్నట్లుగా STYX అనే నదిని దాటుతారని; మరొకలోకం అనగా Hadesకి వెడతారని అంటారు. యమపట్టణంలో కుక్కలని మనం అన్నట్లుగా వాటిని Cerberus అంటారు. పోయిన తరువాత మనం కొంత క్రియాకలాపం చేస్తాం కదా. జీవయాత్రలో

పోయినవారికి అన్నం అర్పించడం కూడా వారిలో ఉందని విన్నాను. దానిని క్రైస్తవులు Viaticum అంటారట. గయకు వెళ్ళి పిండదానాలు చేసినట్లుగా క్రైస్తవులు కూడా సంతానం లేకుండా మరణించినవారికి All Souls Day జరుపుతారు. కనుక పితృదేవతల ఆరాధన అన్ని దేశాలలో ఏదోవిధంగా జరుపబడుతూనే ఉంది.

ప్రధానంగా ఈ ప్రేత సంస్కారం, అన్ని వర్ణాలవారికి సరిగా జరిగేటట్లు చూడాలి. ఇది ముఖ్యమైనది.

## దహనం - ఖననం

బ్రతికి ఉన్నవాళ్ళకే తిండి పెట్టలేక పోతున్నాం, పోయిన వానికి తద్దినాలేమిటని ప్రశ్న. ఇక శవానికి సంస్కారమేమిటి? పోనీయండి, అనాథ ప్రేత సంస్కారాలేమిటి? పురపాలక సంఘం వారున్నారు కదా! వారే పట్టించుకుంటారులే అనే నిర్లక్ష్యం.

శరీరాన్ని జీవుడు విడిచినా కన్నులకు - సూర్యుడు; నోటికి - అగ్ని; చేతికి - ఇంద్రుడు మొదలైన దేవతలు శరీరావయవాలను విడిచి పెట్టిపోరని శాస్త్రాలంటున్నాయి. సంస్కారం చేయడం వల్ల వారిని యథాస్థానాలకు పంపుచున్నాం. ఇది అపర కర్మ మంత్రాల వల్ల తెలుస్తుంది.

ఇక జీవాత్మ 16 కళలతో ఉంటాడు. 15 కళలు జీవం ఉండేటట్లు చేస్తాయి. 16వ కళ జీవుని శరీరమే. కనుక శరీరాన్ని ఈశ్వరార్పణ భావంతో సంస్కారం చేయాలి.

దీనిని అంత్యేష్టి అన్నారు. అనగా చివరి యజ్ఞమని. శాస్త్రాలలో 40 సంస్కారాలున్నాయి. సంస్కారం అంటే ఉన్న దానిని సంస్కరించుట, పవిత్రము చేయుట. సంస్కరింపబడినది కనుక సంస్కృత భాష.

ఉపనయనం, వివాహం మొదలైన సంస్కారాలు జీవుణ్ణి ప్రతిదశలోనూ పవిత్రం చేసేవి. ఈ సంస్కారాలు ఈశ్వరునికి ఆహుతిరూపంలో యజ్ఞం మాదిరిగా ఉంటాయి. జీవితం అంతా యజ్ఞంగా భావిస్తే చివరి యజ్ఞమే అంత్యేష్టి. అనగా ప్రేత సంస్కారము. ఏ శరీరముతో ఇతర యజ్ఞములు నిర్వహింపబడ్డాయో అట్టి శరీరం చివరగా అగ్నిలో ఆహుతి కావాలి. అట్లా ప్రేత సంస్కారం చెప్పబడింది. హోమానికి అర్పించే ద్రవ్యాలను నేతితో శుద్ధి చేసినట్లు శవాన్ని కూడా స్నానాదుల ద్వారా శుద్ధి చేసి దహనం చేస్తారు. శరీరాన్ని నేలలో పూడ్చినా ఈశ్వరునకు అర్పించినట్లే.

కొంతమంది జ్ఞానులు, ఈ శరీరం నీచమని దీనినుండి విడుదల కావాలని గానం చేసారు. కాని మరొక విధంగా చూస్తే శరీరమొక అద్భుత యంత్రం. యంత్రంలో ప్రతి పనిముట్టు దాని పని అది చేస్తుంది. అట్లాగే మన శరీరంలోని ఇంద్రియాలు రకరకాల పనులు చేస్తున్నాయి కదా. ఒకే ఆత్మ ఉన్నట్లు అన్ని శరీరావయవాలలో ఒకే ప్రాణశక్తి ఉంది. ఇక శరీరంలోని అవయవాలు ఒక పద్ధతిలో అమర్చబడినాయి. రకరకాల పనులు చేయగలుగుతున్నాం.

తిన్న ఆహారాన్ని జీర్ణం చేసుకొనుట, ఊపిరి పీల్చుట సాగిపోతున్నాయి. అన్ని పనులు ఒక క్రమంలో సాగిపోయే నిర్మాణం మనకుంది. చర్మం, రక్తం, కండరాలు, నరాలు, ఎముకలు మొదలైనవి ఎన్నో ఉన్నాయి. అన్నింటికీ లక్ష్యం ఉంది. లక్షల కొద్దీ రక్తకణాలతో ఒక విచిత్ర ప్రపంచం మనలో ఉంది. అన్నీ ఒకదానితో ఒకటి సంబంధం కల్గియున్నాయి. జ్ఞానులను మినహాయించినా ఈ అద్భుత యంత్రంతో ఎన్నో ధర్మకృత్యాలు చేయవచ్చు. ఇవి చేసి జ్ఞానాన్ని సముపార్జిద్దాం.

శరీరం ఎట్లా నీచమౌతుంది? ఇది చేసిన అపకారమేమిటి? ఇది మనస్సునకు ఒక సాధనం. మనసు చెప్పినట్లు మిగతా అవయవాలు

నడుస్తాయి. మంచి పనులను చేయవచ్చు. చేతితో పూజ, కాలితో ఆలయానికి వెళ్ళుట, కన్నులతో భగవత్‌దర్శనం, నోటితో స్తోత్రపఠనం, మంచి మాటలు మాట్లాడడం జరుగుతూ ఉంటే దీనిని నీచమనడం ఎందుకు? 'శరీరమాద్యం ఖలుధర్మసాధనం' అనే మాట ఉంది. అంతేకాదు శరీరమే దేవాలయమని, అందు పరమాత్మ ఉంటాడని 'దేహో దేవాలయః ప్రోక్తః' అని ఉంది. అప్పర్ స్వామి దీనిని ఆలయంతో పోల్చాడు. తిరుమూలర్ ఒక చక్కని మాట అన్నాడు. "ఇంతకు ముందు దీనిని నీచమనుకొన్నాను. కాని ఇందీశ్వరుడున్నాడని తరువాత గ్రహించాను. అప్పటినుండి దీనిని రక్షించుకొంటున్నాను."

ఇట్టి శరీరం నుండి ప్రాణం పోతే దీనిని అగౌరవంతో సాగనంపుతామా? ఆ శ్మశాన వాసికి ఆహుతి నీయవద్దా? ఎవరీ శరీరాన్నిచ్చారో వారికి దీనిని అర్పించాలి. ఈ సత్యం ఆటవికులకు తెలుసు. కాకపోతే ఆచారాలు భిన్నం.

మరణించిన తరువాత ఇందులో దేవతలుంటారని నమ్మినా నమ్మకపోయినా ఒకటి తప్పక గుర్తుంచుకోవాలి. ఇంతవరకూ శరీరంలోపల భగవదంశ లేదా? ఒక గోడలో చిన్నగూడు కట్టి అందొక విగ్రహం పెట్టి దీపం వెలిగిస్తాం కదా! అటువంటప్పుడు ఇంతవరకు ఇందులో ఆత్మ జ్యోతి వెలుగగా దీనిని మంత్రాలతో సాగనంపవద్దా?

నాయకులు కూడా తమ నాయకుల సమాధులపై పుష్పగుచ్ఛాల నుంచుతున్నారు కదా. ఈ శరీరాన్ని చెడ్డ పనులకు వాడినా, ఈశ్వరశక్తి యున్నట్లు పోయినవాడు గ్రహించకపోయినా, మనం నమ్ముతున్నాం కనుక దీనికి సంస్కారము చేయవలసినదే. అతడే మంచి పనులు చేయక పోయినా ఆ నష్టాన్ని ఈ అంత్యేష్టి సంస్కారం ద్వారా పూడుద్దాం. ఈశ్వరునకు అర్పిద్దాం.

శైవసిద్ధాంతం ప్రకారం శరీరాన్ని, కరణాలను (ఇంద్రియాలను); భువనాన్ని (ప్రపంచాన్ని) ఈశ్వరుడిచ్చాడు. ప్రపంచాన్ని అనుభవించండని ఇచ్చాడు. ఈ తనువు అతని ప్రసాదం కనుక దానిని తిరిగి సంస్కారాలతో అతనికి అర్పించాలని అంటారు. యజ్ఞంలో హోమద్రవ్యం వేసినట్లుగా.

ఒక తేడా ఉంది. మిగిలిన యజ్ఞాలు బ్రతికియుండగా చేస్తాడు. బ్రతికి యుండగా మంచి పనులు చేసాడా లేదా అనేది అతనికి చెందింది. మిగతావాళ్ళకు వాటితో సంబంధం లేదు. కాని ప్రేత సంస్కారం ఇతరులు చేయాలి కదా! అది చేయకపోతే చేయనివానికి పాపం చుట్టుకొంటుంది. గౌరవంతో భగవానుని దగ్గరకు చేర్చే బాధ్యత ఇతరులది.

## అనాథ ప్రేతలు

ఒక బంధువు పోతే మిగిలినవారు కర్మలను చేస్తారు. నిర్లక్ష్యం చేయరు. తర్పణాలు, శ్రాద్ధాలు చేయక పోయినా సంప్రదాయానుగుణంగా ప్రేత సంస్కారం చేస్తారు.

అయితే బంధువులు లేనివారి గతి ఏమిటి? సంఘం దానికి పూనుకోవాలని శాస్త్రాలంటున్నాయి.

నేనీ విషయంలో బాధ పడుతున్నా. ఎవరైనా ఆస్పత్రులలో, కారాగారాలలో, రోడ్డుమీద ఎవరు పోయినా అసలెవరూ పట్టించుకోవడం లేదని బాధ కల్గించింది. ఇక జరుగుతున్నదేమిటి? ఆస్పత్రిలో శవపరీక్ష చేయడం, పురపాలక సంఘం వారికి అప్పగించడం జరిగిపోతోంది. ఇది సంఘానికి మచ్చ కాదా?

ఇతర మతస్థులు తగిన ఏర్పాట్లు చేస్తున్నారు. వారికి ఈశ్వరార్పణ భావన ఉందో లేదో విచారించడం మనవంతు కాదు. వారి సంఘసేవను చూడండి.

## మన సంఘానికి మచ్చ

నేను మఠాన్ని నడుపుతూ, మీ దగ్గర డబ్బు తీసుకొంటూ నేనేం చేస్తున్నాను? ప్రజలను సంఘటితం చేయలేక పోతున్నానేమిటి?

మీరేదైనా పాపం చేస్తే అది జగద్గురు పీఠాన్ని అలంకరించిన నాకు చుట్టుకొంటుంది.

ఇట్టి అనాథలను సంస్కరించదానికి హిందూ జీవాత్మ కైంకర్య సంఘాన్ని అనేక ప్రాంతాలలో స్థాపించాలని కోరుతున్నాను. కొన్నిచోట్ల వచ్చాయి. కుంభకోణంలో ఈ సంఘం బాగా పనిచేస్తోంది. అనాథలు పోతే ఈ సంఘ సభ్యులకు కబురు పెడుతున్నారు.

ఇట్టి సంఘాలు లేకపోయినా కొన్ని భజనమండళ్ళు పూనుకొంటున్నాయి. దీనినొక పవిత్రకార్యంగా చేయండి. ప్రజలలో జాగృతి వచ్చినందులకు సంతోషం.

## ఇదే అశ్వమేధం

నేను మొదట అందరూ అశ్వమేధం చేయవచ్చా అని కలియుగంలో సాధ్యమా అని అన్నాను. ఇతరులకు సేవ చేయడం వల్ల అశ్వమేధ ఫలం వస్తుందని అన్నాను. గుర్తుందా? ఇంతవరకూ చెప్పని సంఘసేవ గురించి చెబుతాను.

'**అనాథ ప్రేతసంస్కారాత్ అశ్వమేధఫలం లభేత్**' అని శాస్త్రాలన్నాయి. అనాథ ప్రేత సంస్కారం వల్ల అశ్వమేధ ఫలం వస్తుందని దానికర్థం.

ఒక వైద్యుడు, శవాల వల్ల మాకు లాభమని, పరిశోధనలు చేస్తామని, శరీర శాస్త్రానికి ఉపయోగపడుతుందని మీరు సంస్కారం అంటూ వీటిని తీసుకుపోతున్నారేమిటని ప్రశ్నించాడు. అయితే మీ మరణానంతరం మీ

శరీరాలను ఈయవచ్చు కదా అన్నాను. ఇట్టి పనిని శాస్త్రం అంగీకరించకపోయినా ఈ కళంకాన్ని కొంతవరకూ తొలగించవచ్చు. నేనింతకు ముందు ఏ వృత్తి చేసినా కొంత కళంకం వచ్చినపుడు, డబ్బు ఆశించకుండా అదే వృత్తిలోనున్న వారిని ఆదుకోవచ్చుని చెప్పాను కదా! అట్లాగే వైద్యవృత్తిలో కూడా. వీరికి అంటిన కళంకాన్ని వీరి మరణానంతరం వీరి దేహాలను ఆస్పత్రులకిచ్చి పోగొట్టుకోవచ్చుని అంటున్నా.

## రామకృష్ణులు చూపిన మార్గం

ధర్మాన్ని ఆచరించి చూపిన రాముడు, జటాయువనే పక్షికి సంస్కారం చేయలేదా? వాలిని, రావణుని చంపిన తరువాత వారి సోదరులచే ఆ సంస్కారాన్ని దగ్గర ఉండి చేయించలేదా? పైవారెంత దుర్మార్గులు కావచ్చు. కాని రాముడు శ్రద్ధ తీసుకొన్నాడు. కురుక్షేత్రంలో కౌరవులందరికీ సంస్కారాలు చేయించిన కృష్ణుడు, ధృతరాష్ట్రుణ్ణి, ధర్మరాజును గంగకు తీసుకొని వెళ్ళి తర్పణాలిప్పించాడు.

కనుక అనాథప్రేత సంస్కారం చేయక పోవడం ఘోరాతి ఘోర నేరం. ఇప్పుడైనా మేల్కొనండి.

చండాలుడు మరణించినా ఇది సరిగా జరగాలి. విరాళాలీయాలి, శారీరక శ్రమ కూడా చేయాలి.

## ఇతరుల బాధను పోగొట్టామనే పరీక్షలో

ఇతరులు బాధపడుతున్నారంటే ఎంతవరకూ ఆదుకొంటున్నారని ఈశ్వరుడు పరీక్షించడమే. కర్మవల్ల బాధపడుతున్నవారికి మనసాయంతో ఆతని కర్మభారాన్ని తగ్గించవచ్చు కదా అని అనడం సబబే. మన సాయం వల్ల అతని కర్మ తగ్గింపబడుతుందా లేదా అనే విషయాన్ని అటుంచినా

సాయం చేయడం మన ధర్మంగా భావించాలి. ఒకని కర్మననుసరించి ఈశ్వరుడుతనని శిక్షిస్తున్నాడంటే అదే సమయంలో ఇతర్లు, ఆదుకొంటున్నారా లేదా అని ఇతరులను పరీక్షించినట్లే కదా! మన సాయం వల్ల అతని కర్మ తగ్గకపోతే అతని కర్మ, అంత బలీయంగా ఉందని అందాం. సాటివారు ఏం చేస్తున్నారని వీక్షిస్తాడు భగవానుడు.

సంఘం అంతా కఱవు కాటకాలతో బాధ పడుతున్నప్పుడు చూస్తాడు. అట్టి సమయంలో ఆర్థికంగా, శారీరకంగా, మానసికంగా తోటి వారందరూ ఎవరూ అడుగకపోయినా నడుం కట్టాలి. ఇవి ప్రకృతి కోపాలని శాస్త్రజ్ఞులంటారు. శాస్త్రాలేమంటాయంటే ఇవి సమష్టి పాపాలంటాయి.

(ఇట్టి సందర్భంలో మహాస్వామివారు చేసిన సాయం అంతా ఇంతా కాదు. 1924లో కావేరీ నదులు పొంగినపుడు అట్లాగే 1961లో వరదలు వచ్చినపుడు మఠం చాలా సాయం చేసింది. తమిళనాడులోని ద్రవిడ పార్టీల కార్యకర్తలను స్వామివారు ప్రశంసించారు - ఆంగ్లానువాదకుడు)

ఇట్టి పనులు చేయడం వల్ల దేవలోకమో, బ్రహ్మలోకమో వస్తుందని భావించవద్దు. అట్టిది ప్రాప్తించినా ఎప్పుడైతే పుణ్యఫలం క్షీణించిందో తిరిగి ఈ లోకానికి రావాలి కదా. కాని అమ్మవారి పాదాల దగ్గరకు వెళ్ళినపుడు తిరిగి రావడమేమిటి?

ఆమె అశ్వమేధసమర్చితగా చెప్పాం కదా. కాని ఈ అశ్వమేధం చాలా సులువైనది. అనగా అనాథ ప్రేత సంస్కారం. జనన మరణ ప్రవాహం నుండే మనం విముక్తిని పొందవచ్చు.

ఇక్కడ అనాథల వర్ణాలను గుర్తించకండి. వీటిని ప్రభుత్వం చూసుకొంటుందని నిర్లక్ష్యం వహించకండి.

అశ్వమేధ సమర్చితతో బాటు ఆమె వర్ణాశ్రమ విధాయిని కూడా. అంటే ఆమె అనుగ్రహం వల్ల పరస్పరం ప్రేమ, సోదర భావం మనలో వర్ధిల్లుగాక.

*(యాగం చేస్తే స్వర్గం వస్తుందని, పై పూర్తకర్మలు చేస్తే మోక్షం వస్తుందని ఒక స్మృతి వాక్యం గుర్తుకు వస్తోంది -అనువక్త)*

## ప్రాణం పోయినపుడు

ప్రాణం పోయే సమయంలో ఏం చేయాలో చెబుతాను. శరీరం పోయినా అందున్న ఆత్మ పోదని గీతలో భగవానుడన్నాడు కదా! అయితే ఆ ఆత్మ ఏమవుతుంది? అది వెంటనే పరమాత్మలో లీనమైపోతుందా? కర్మానుగుణంగా మరొక శరీరాన్ని పొందుతుందని అన్నాడు: పుణ్య కర్మలకు పుణ్యలోకమని, పాప కర్మలకు అసుర జన్మమని చెప్పాడు కదా. అయితే అంతం లేదా? భక్తియోగం, జ్ఞాన యోగం ద్వారా వారికి ఉన్నతిని కల్గిస్తానని తిరిగిపుట్టేట్లు చేయనని అన్నాడు. మోక్షమంటే అన్ని బాధలనుండి విముక్తులై అఖండానందాన్ని అనుభవించడమే కదా! అట్టివారు ఏ కోటికో ఒకరుంటారు.

అయితే ఏం చేయాలి? అన్నిటికి దగ్గరదారులున్నాయి. ఏమిటిది? మరణ సమయంలో ఏది భావిస్తాడో దానికి అనుగుణమైన జన్మ ఉంటుంది. నన్నే తలుచుకొని ప్రాణం విడిస్తే నన్నే చేరుకుంటాడని. సందేహం లేదని అన్నాడు.

"నాస్తి అత్ర సంశయః" ఎన్ని చెడ్డ పనులు చేసినా చివరి సమయంలో స్మరిద్దాంలే అంటాం.

ఇక్కడొక చిన్న మెలిక పెట్టాడు. 'అంతకాలే చమాం స్మరన్' అని 'చ' చేర్చాడు. చ, ఏవ, ఉంచి మెలిక బిగించాడు. అంతకాలేచ = అంతకాలంలో కూడా, మామ్ ఏవ = నన్నని కాదు, నన్నే. అంటే స్మరించడం జీవితాంతమని; జీవితాంత సమయంలో అని.

ఇక మనస్సు పరమాత్మనూ స్మరిస్తుంది. ఇంతలో చెత్తను ప్రోగు చేసుకొంటుంది. ఇంతవరకూ ప్రశాంతంగా ఉన్నాం, అప్పుడే ఇంత గందరగోళమా అనుకొంటాం కదా. ఇంగ్లీషులో Fraction of Second

అంటారు దీనిని. సెకనులో 16వ వంతులో కనుక 'మామ్ ఏవస్మరన్' అని నన్నే స్మరించనే మాట తేలికగా పట్టుబడదు.

మరణ సమయం సమీపిస్తోందని తెలుసు. భయం, తొట్రుపాటూ లేకుండా ఉండగలగాలి. ఏకాగ్రతతో భగవానుణ్ణి స్మరించాలి. ఆ సమయంలో ప్రాణం పోయిందా సరేసరి. అట్లా అందరికీ సాధ్యం కాదు. ఎవరినైనా తుపాకీతో కాల్చినా ప్రాణం పోవడానికి 5, 10 నిమిషాలు పడుతుంది. అపుడు మనస్సు లగ్నమౌతుందా! విద్యుద్ఘాతం వల్ల ప్రాణం వెంటనే పోతుంది. అయితే భయం, మనిషిని క్రమ్మేస్తుంది కదా!

మంచం పట్టినపుడు ఆ రోజులలో స్మరించాలి. విద్యుద్ఘాతం వచ్చినప్పుడు క్షణం స్మరించినా చాలు. సాధ్యమా? కనుక 'అంతకాలేచమామ్' అని 'చ' చేర్చాడు.

## జీవించినంతకాలం అభ్యసించినది జీవితాంతంలో

జీవితాంతం దేనిని స్మరిస్తూ ఉంటామో అదే చివరగా గుర్తుకు వస్తుంది. తనంతట తాను రావాలి.

నేటి మనస్తత్వ శాస్త్రప్రకారం మనస్సులో గాఢంగా నాటుకొన్నవి మనకు తెలియకుండా మనలో పొటమరిస్తూ ఉంటాయి. నిద్రలో ఏ పని చేయనపుడు ఈ ప్రాత భావాలు కలల్లోకి వస్తాయి. అది నిద్రలోనే కాదు, ధ్యానానికి కూర్చున్నా బిరడాను తొలగించినపుడు లోపలనుంచి నీరు తన్నుకు వచ్చినట్లు వస్తాయి. వీటిని వాసనలని శాస్త్రాలన్నాయి. వీటిని సమూలంగా నిర్మూలించినపుడు మనస్సు, అద్దంలా ఉంటుంది. అందులో ఆత్మకాంతి ప్రతిఫలిస్తుంది. వీటిని తరుమడానికి నిరంతరం ప్రయత్నం ఉండాలి. సద్భావనలు నింపుతున్నకొద్దీ దుర్భావనలకు చోటు లేక తొలగిపోతాయి.

ఒకప్పుడు చెడువాసన వ్యాపిస్తే అగరువత్తులను వెలిగిస్తున్నాం. చివరకు సద్భావనలూ పోవాలి. మనస్సే అణగిపోవాలి. అదే చివరి దశ.

## భగవత్ స్మరణ

ఇంతవరకూ చేయలేకపోయినా ఇకనుండైనా భగవానుని మనస్సులో నాటుకొనేలా ప్రయత్నించండి. అది అస్మరణ, ఎడదెగని దారంలా సాగాలి. అది పరమాత్మతో అనుబంధింపబడినట్లుండాలి. ఇక ఎన్ని సమస్యలెదురైనా చివరకు మరణ ఘడియలు సమీపించినా మరచిపోవడం అంటూ ఉండదు. ఒక పెద్దపులిమీద పడినా, ఒక విద్యుద్ఘాతానికి గురియైనా ఎట్టి భయమూ లేకుండా అతడ్ని స్మరించే దృఢమనస్సు ఏర్పడుతుంది. "ప్రాణం పోయేటపుడు నా కంఠం కఫంతో పూడుకుపోయినపుడు నిన్ను స్మరించడం ఎట్లా?" అని కులశేఖరాళ్వార్ ఎలుగెత్తి ఆక్రోశించాడు. "ప్రాణ ప్రయాణ సమయే కఫ వాత పిత్తై:" అన్నాడు. శంకరులు కూడా ప్రాణ ప్రయాణం గురించి మాట్లాడారు:

"ప్రాణ ప్రయాణ భవభీతి సమాకులస్య
లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబం"

ప్రాణం పోయే సమయంలో భయాన్ని పోగొట్టే ఓ లక్ష్మీనృసింహ! నీ చేతితో నన్ను పట్టుకోవయ్యా అని ప్రార్థించారు. అట్లాగే సుబ్రహ్మణ్య భుజంగ స్తోత్రంలో నన్ను చూసే వారెవ్వరూ లేక అనాథనై యుండగా జీవనయాత్రను సాగిస్తున్నాను. నువ్వు వెంటనే వచ్చి నాముందు నిలబడుమని అన్నారు. 'ప్రయాణోన్ముఖే మయి అనాథే' తిరుప్పుగళ్‌లో ఇదే భావం కన్పిస్తుంది. ఇట్లా మహాత్ములందరూ ఆత్మానుభూతి కలిగిన వారే! వారికేమి బాధలు లేకపోయినా మనమెట్లా ప్రార్థించాలో చెబుతున్నారు.

పెరియళ్వార్, స్వామిదగ్గర ఉన్న చనువుతో ఒక అడుగు ముందుకు వేసి ఇట్లా అన్నాడు. నేను పోయినప్పుడు నిన్ను స్మరించకపోవచ్చు. అంతమాత్రంచే నన్ను విడిచిపెట్టొద్దు సుమా! ఇప్పుడు నేను స్మరించేది అప్పటికి ఉపయోగపడనీ. ఇది ఒక రకమైన Advance Booking.

ఇట్లా ఖాతాలో వేసుకొమ్మనడం గీతాకారునికి సమ్మతమా? తప్పక స్మరించాలని అన్నాడు కదా. 'చ' అనే అక్షరాన్ని వాడాడు. ఇంకా స్పష్టతతో **'తస్మాత్ సర్వేషు కాలేషు మామ్ అనుస్మర'** అనగా అన్నివేళలా స్మరించాలన్నాడు. అట్లా ఉండగలిగితే గుర్తుకు రాదా?

## చివరి ఘడియలలో భావన - దాని ప్రాధాన్యం

చొక్కా చిరిగిపోతే మరొకచొక్కా ధరించినట్లు ఒక శరీరం పోతే మరొక శరీరం వస్తుందని అన్నాడు. అయితే ఎన్నిసార్లు చొక్కా మార్చాలి? అంతం ఉందా? అతడు జ్ఞానియైతే అతనికి బ్రహ్మనిర్వాణం కలిగి నన్ను చేరుకుంటాడని అన్నాడు. నా పట్ల నిరంతర భక్తిని చూపించినవాడు నన్ను చేరుకుంటాడని చెప్పే సందర్భంలో ప్రాణం పోయే సమయంలో నన్ను స్మరించినా చాలని, ఇక జన్మముండదని అన్నాడు.

ఈ చివరి మాటను బట్టి మరణ సమయంలో ఉన్న భావానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు.

మరణం ప్రాప్తించి మరొక శరీరం ధరిస్తే క్రొత్త అనుబంధాలేర్పడుతున్నాయి. మరల ఆ ఇంట్లోనే పుట్టినా మనకు తెలియదు. అట్లా పుడతామనీ తెలియదు. లేదా మరొక దేశంలో, మరొక మతంలో పుట్టవచ్చు.

మరణం, ఆత్మనేమీ చేయలేకపోయినా వచ్చే జన్మ ఏమిటి? ఏ వాతావరణంలో పెరగవలసి వస్తుంది? అనేది పెద్ద ప్రశ్న కదా! ఈ జన్మమే

పోతే మరి ఏ జన్మ వస్తుందోనని మహాత్ములే బాధను వ్యక్తీకరించారు.

అందువల్ల భగవానుడిట్లా భావించి ఉంటాడు. ప్రాణం విడిచినా మరల జన్మించిననే భరోసా ఏమీలేదు. జన్మిస్తే ఏ వాతావరణంలో పుడతాడో? వాడ్ని కర్మ వెంటాడుతుంది కదా! లేదా క్రొత్త కర్మలు చేస్తాడా? అని ఆలోచించి మరణ సమయంలో నన్ను స్మరిస్తే చాలులే మరల జన్మను ఏనికి ప్రసాదించనని భావించి చివరి మార్గాన్నైనా అనుసరించండని అన్నాడు.

## నిద్రించేటపుడు భగవత్ స్మరణ

జీవితంలో దేనిని గాఢంగా చింతిస్తూ ఉంటాడో అదే మరణ సమయం లోనూ దాపురిస్తుందనే మాట నిజమా? అబద్ధమా?

రోజూ నిద్రపోతున్నాం. ఇది రోజూ జరిగే మరణమని శాస్త్రాలన్నాయి. దీనిని నిత్య ప్రళయమన్నారు. దీని నాధారంగా చేసుకొని భగవంతుణ్ణి స్మరిస్తూ చనిపోవటాన్ని అభ్యసించవచ్చు. ఇష్టదేవతను స్మరిస్తూ నిద్రపోండి. ఇదీ కష్టమే. నిద్రా సమయం సమీపించడానికి ముందు మనస్సు పరిపరి విధాల పరుగెత్తుతూ ఉంటుంది. అందు పరుగెత్తి పరుగెత్తి నిద్రలో జారుకుంటుంది. దానిని పరుగెత్తకుండా భగవంతునిపై మరల్చి చూడండి. అట్లా రోజూ చేస్తూ ఉంటే మరణ సమయంలోనూ వానిని స్మరించగలమనే ధీమా వస్తుంది. ఇదంతా అభ్యాసం, పట్టుదల, శ్రద్ధపై ఆధారపడింది.

## మోక్షానికి దగ్గర దారి

నిరంతరం నన్ను స్మరింపుమన్నాడు. అటువంటప్పుడు మరణ సమయంలోనూ నన్ను స్మరింపుమని ఎందుకన్నాడు? ఇక్కడొక సూక్ష్మ మార్గాన్ని అందించాడు. చివరి ఘడియలలో నుస్న భావం నన్ను చేరుస్తుందని అన్నాడు:

"యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేబరం
తం తం ఏవైతి కౌంతేయ తద్భావ భావితః"

అంటే జీవితాంతం భగవానుని స్మరించకపోయినా, చివరి ఘడియలలో స్మరించినా చాలని అన్నాడు.

జీవితాంతం దేనిని స్మరిస్తాడో అదే చివరకు కూడా వస్తుందనడంలో సందేహం లేదు. అట్టి స్మరణ నిరంతరం లేకపోయినా చివరి ఘడియలలో వచ్చినా చాలని అన్నాడు. నన్ను ఇంతకుముందు స్మరించకపోయినా అని అనలేదు.

ఇట్లా దగ్గర మార్గం చూపించాడు. ఇట్లా చెప్పి మనలను మోసగించాడా?

## మరణ సమయంలో గొప్పసేవ

చెప్పబోయే అద్భుత సేవను ఇతరులు చేసి చూపించవచ్చును.

మరణ సమయంలో చుట్టుప్రక్కలనున్నవారు భగవాన్నామాన్ని జపించడం చాలా గొప్పది. కొద్దిగా ఇంద్రియాలు పనిచేస్తున్నా ఇది వానిపై ప్రభావాన్ని చూపిస్తుంది. అతనిలో నున్న ఆత్మను తట్టిలేపుతుంది. గత సంస్కారాలు తన్నుకు వస్తూంటే ఈ స్మరణ వల్ల అవి పటాపంచలౌతాయి.

మనం ఏవో మాట్లాడే సందర్భంలో మధ్యలో హరహరమహాదేవ అని బిగ్గరగా కొందరంటే మన భావాలెగిరిపోయి మన గుండెలకు తాకుతుంది. నామానికి అట్టి శక్తి ఉంది. పోయినవాడు తనంతట తాను దాటలేకపోయినా మనం దీనితో అతనిని దాటించవచ్చు.

చివరి సమయంలో భగవానుడే అసలైన బంధువని భావిస్తాడు. అయితే అతని వాసనలు అడ్డుకొంటూ ఉంటాయి. అప్పుడు చుట్టూ ఉన్నవారు భగవానుని గుర్తు చేయాలి. పరమాత్మ అట్టి సమయంలోనైనా రక్షిస్తానని హామీ ఇచ్చాడు కదా! తీసుకొని వెళ్ళవలసిన బాధ్యత భగవానునిదే.

అన్ని సేవలకంటె భగవానుని దగ్గరకు అట్టి వారిని చేర్చడం ప్రధానమైన సేవ కదా!

అట్టివానికి ముక్తియనే మాటను మీరు నమ్మినా, నమ్మకపోయినా అతనికి పాపజన్మ మాత్రం రాదు. పాపక్షాళనానికై ఇది ఉపయోగిస్తుంది కదా! పుణ్యజన్మ తప్పక లభిస్తుంది.

పుణ్యజన్మ అంటే ఏమిటి? డబ్బా? అందమా? ఉగ్రవర్ణమా? కాదు. ఇంతకుముందు ఏ భగవత్ స్మరణను ఎక్కడ ఆపాడో అది మొదలవడం. దానికోసం తనంతట తాను ప్రయత్నం చేసుకోవడానికి మనం దోహదం చేస్తున్నామన్న మాట. మరణ సమయంలో ఇట్టి నామ సంకీర్తన చేసి జీవులనుద్ధరించండి.

## రోగులకు సేవ

లోగడ చెప్పిన సంఘం వారు కారాగారాలకు, ఆస్పత్రులకు అట్టి సమయాలలో వెళ్ళాలి. వట్టి చేతులతో కాదు. పోయేవానికి భగవత్ ప్రసాదం ఎంతో ఊరట నిస్తుంది. విభూతి, తులసీ దళాలు, అమ్మవారి కుంకుమ, వంటివానిని తీసుకొని వెళ్ళండి. శివ భక్తుడా, విష్ణుభక్తుడా అని గుర్తించి తగినది ఇయ్యండి. గంగాజలం అందరికీ ఉపయోగిస్తుంది కదా! ఈ కాలంలో నేను విభూతిస్తూ ఉంటే వైష్ణవులు అడ్డు చెప్పడం లేదు. చివరి సమయంలో సిద్ధాంత రాద్ధాంతాలుంటాయా?

విష్ణువునకు రోజూ అభిషేకం ఉండదు కనుక పాదోదకాన్ని గ్రహించి ఈయండి. కొన్ని రోజులలోనే స్వామికి తిరుమంజనం చేస్తారు.

నాస్తికుడు కూడా మరణ సమయంలో ఏదో తానొక శక్తి చేతిలో నున్నట్లు భావిస్తాడు. అట్టి నాస్తికుని దగ్గరకూ వెళ్ళండి. అతని బంధువులు అడ్డు చెబితే తిరిగి రండి. ఇక్కడ అట్టివారు గౌరవించారా లేదా అని విచారించవద్దు.

మరణించేవాడు కొన్ని గంటలు బాధ పడుతూ ఉంటే నామ సంకీర్తన చేయండని బంధువులకు ఆ పని అప్పజెప్పండి. వీలైనంత మీరు చేయండి. చేయవలసింది చేసామనే తృప్తి, మీకు కల్గుతుంది.

## జీవుడు దేవునిలో చేరగా ఆబ్దికాలేల?

మనం చివరి ఘడియలలో మరణించే వ్యక్తికి నామస్మరణ చేసి సద్గతులు కల్పిస్తూ ఉండగా ఇక కర్మకాండలు, ఆబ్దికాలు పెట్టడం ఎందుకని ప్రశ్నిస్తారు. మనంప్రయత్నం చేసామే గాని, మన ప్రయత్నం ఎంతవరకూ సఫలమైందో తెలియదు కదా! అయినా అతడు చివరి సమయంలో స్మరించాడో లేదో! అందువల్ల కర్మకాండలు తప్పనిసరి.

## శరీర మనస్సులను శుద్ధి చేయుట

మరొక సేవ. ఎవరి శరీరాన్ని, మనస్సును వారంతట వారే శుభ్రంగా ఉంచుకోవడమో సేవయే. చెడు అలవాట్ల వల్ల కొన్ని రోగాలు ఇతరులకు సంక్రమిస్తాయి కదా. అందువల్ల హాని జరగడం లేదా? మనవల్ల కాకుండా ఇతరులకు రోగాలు వస్తే అది మన లోపం కాదు.

ఆనాటివారికి చీటికీమాటికీ రోగాలు రాకపోవడానికి కారణం వారి నియమబద్ధమైన జీవన విధానమే. దురభ్యాసాలకు దూరంగా ఉన్నారు. 'శౌచాయ చ సుఖాయ చ' అన్నారు. శాస్త్రప్రకారంగా నడిచే వానికి ఆరోగ్యం వస్తుంది. కాని శుభ్రమైన అలవాట్లకు నేడు చాలామంది దూరంగా ఉన్నారు.

అంతేకాదు, మన మానసిక ప్రభావమూ ఉంటుంది. మన ఆలోచనలు విద్యుత్ మాదిరిగా ప్రభావితం చేస్తాయని నేటి సైన్సు అంటోంది. "The brain functioning as thought is also an electric current" ఆలోచనకు అంత శక్తి ఉంది. కనుక మనస్సును, శరీరాన్ని శుభ్రంగా ఉంచుకోవాలి. (యన్మనసా

*మనుతే తద్ వాతమపి గచ్ఛతి అని ఋగ్వేద మంత్రం "Thought exists in a sense in the vibrations of the air" అని నేటి శాస్త్రజ్ఞుడు ఒప్పుకోలేక తప్పలేదు–అనువక్త).*

మనం చేసే మంచి పనుల వల్ల మన మనస్సే పవిత్రంగా మారుతుంది.

సేవ చేస్తున్నపుడు అహంకారానికి తావీయరాదు. అది ఏమాత్రం కనిపించినా బుగ్గిపాలౌతుంది. మన బాగు కోసం మనం చేస్తున్నామని భావించడం చాలాసార్లు చెప్పాను.

## సేవ చేయనిరోజు వృథా

నిద్ర పోయేటపుడు, ఈ రోజేమైనా సేవ చేసామా అని ఎవరికి వారే ప్రశ్నించుకోవాలి. భగవన్నామాన్ని జపించని రోజుండడం కంటే పుట్టకపోవడమే మంచిదని తేవారంలో ఉంది. అంటే సేవ చేయని రోజు, మరణంతో సమానమే. బంధువు పోతే మైలపట్టి పూజాదులు చేయం. కనుక అది మనకు మరణ దివసం వంటిదని భావించాలి. సంఘానికి ఉపయోగించే పనులెన్నో ఉన్నాయి. ఇదంతా ప్రచారం లేకుండా సాగాలి. ఇంటి పనులు విడిచి సంఘసేవ అంటూ బయలుదేరకూడదు కూడా.

## ఇది వేద ధర్మము

విదేశాలలో ఈ సంఘసేవ సంస్థల ద్వారా నిర్వహింపబడుతుంది. సంస్థ అంటే అందు కార్యవర్గ సభ్యులు,ఎన్నికలు, పోటీలు, ప్రచారాలు మొదలైనవి ఉంటాయి. ఇట్టి వీటిని తీర్చిదిద్దకుండా వారానికి ఒకరోజు సామూహిక పూజ, భజన కార్యక్రమాలు నిర్వహించండని అంటున్నా. ఎందుకంటే పెద్దపెద్ద పథకాలను చేపట్టడం, కావలసినదానికంటె ఎక్కువ డబ్బు వసూలు చేయడం, ప్రచారం ఉండకుండా ఉంటుందని సంస్థాపరం చేయవద్దంటున్నాను.

దండలు వేయడం, కార్యదర్శి నివేదికలు, పత్రికలలో ప్రకటనలు మొదలైన హడావిడి ఉండకూడదు కనుక. లేకపోతే అహంకారం పోవడం మన లక్ష్యమైతే అహంకారం ప్రబలుతోంది కనుక. సేవ కనబడాలి కాని సేవ చేసేవారు కనబడకూడదని గుర్తుంచుకోండి. అందుకనే ధర్మే క్షరతి కీర్తనాత్ అన్నారు. పాపం చేసిన వాడు చేసినట్లు అంగీకరిస్తే పాపం కొంత పోయినట్లు, ధర్మం చేసినవాడు ధర్మం చేసానని కీర్తించుకొంటూ ఉంటే ధర్మము క్షీణిస్తుందని పెద్దలన్నారు. సంస్కృతంలో ఇట్టివారిని ధర్మధ్వజులని అన్నారు. అనగా ధర్మమనే జెండానే వాడు మోస్తాడు, ధర్మం చేయడని తాత్పర్యం. అట్టి మందలింపు, ఆ పదంలో దాగియుంది.

విదేశాలలో అనాథ శరణాలయాలను స్థాపించారంటారు. మన ఇళ్ళల్లో 'అనాథలున్నారు, అతిథులు వస్తారని అంటాం. విదేశాలలో ఇళ్ళల్లో కుక్కలుండడం వల్ల ఏ బిచ్చగాడు, గడప త్రొక్కడానికీ అవకాశమే ఉండదు. ఆలనా పాలనా లేకుండా ఉన్నవారిని ఇంట్లో పెట్టి మనం, రక్షించడం మన ధర్మమైతే ఇట్టి వారిని విదేశీయులు అనాథ శరణాలయాలలో చేరుస్తారు. అందరూ అట్లా ఉన్నారని భావించకండి. ప్రతి దేశంలో దాతలు, దయామూర్తులు, సంఘసేవాతత్పరులున్నారు. అట్లాగే స్వార్థ పరులూ ఉంటారు. కుక్కలున్నాయని ఫలకం చూస్తే బాధ కలుగుతుంది. గ్రామాలలో ఇళ్ళముందు అరుగులుంటాయి. ఎవరైనా వచ్చి సేద దీర్చుకొంటారని అట్లా ఉంచారు. అవీ లేకుండా చేస్తున్నాం. వైశ్వదేవంలో వండిన అన్నంలో బిచ్చగానికి కొంత పెట్టాలని ఉంది. ఇట్టి ఆచారాలను మూఢ విశ్వాసాలంటే ఎలా?

పశ్చిమ దేశాలలో ఉన్నట్లు కుటుంబం అంటే కేవలం ఒకరిద్దరు వ్యక్తులకే పరిమితమని భావించబడుతోంది. ప్రభుత్వం, అనాథ శరణాలయాలను, వృద్ధాశ్రమాలను సంక్షేమం పేరున స్థాపిస్తోంది. ఇవీ లేకపోతే మరీ

దుర్భరమైపోతుంది. ఇవి ఉండవలసిందే కాని, వసుధైక కుటుంబం అనే భావానికే ప్రాధాన్యం రావాలి. ప్రపంచం అంతా ఒక కుటుంబమనే భావన, అందరిలోనూ ఉండాలి.

పూజ అంటే విధులు, కర్మలూ ఉంటాయి. కర్మయే పూజయని సోపాన పంచకంలో శంకరులుపదేశించారు. వారి వారి కర్మలను చేసుకొంటూ పరోపకారం చేయడం అందరికీ ఉపయోగపడేదే.

కనుక నామం జపించడంతో బాటు ఇతరులతో మాటలూ మాట్లాడాలి. ధ్యానంతో బాటు జగత్తంతా సుఖంగా ఉండాలని కొంతసేపైనా రోజూ భావించాలి. పూజతో బాటు సంఘసేవనూ చేయాలి. ఈశ్వరార్పణ బుద్ధితో ఇట్టి పనులను చేయడం పూర్వాచారం.

మన మతం సంఘసేవను చేయండని అనలేదా? చిన్ననాటి శ్లోకాలు, పద్యాలూ చెప్పడం లేదా? మహాత్ములకున్న సంపదలన్నీ ఇతరుల సేవకే అనే సూక్తి ఉంది. పరోపకారాయ సతాం విభూతయః. దీనినిట్లా విస్తరించి చెప్పారు. ఇతరుల కోసం వృక్షాలు, ఫలాలనిస్తున్నాయని పరోపకారార్థం ఫలంతి వృక్షాః. ఇతరులకై గోవులు పాలనిస్తున్నాయని పరోపకార్థం దుహంతి గావః. ఇతరులకై నదులు ప్రవహిస్తున్నాయని పరోపకారార్థం వహంతి నద్యః. ఇతరులకై మన శరీరం ఉపయోగపడాలని పరోపకారార్థం ఇదం శరీరం. అనే మాట సమర్థిస్తూ చెప్పింది. దీనినే మరొక విధంగా చెప్పారు. చెట్లు తమ పళ్ళను తాము తినవు ఖాదంతి నస్వాదు ఫలాని వృక్షాః. నదులు తమ నీటిని త్రాగవు. పిబంతి నద్యః స్వయ మేవ నాంభః. మేఘాలు తాము కురిపించే వర్షం వల్ల పండే పంటను తినవు పయోధరాః సస్యమదంతి నైవః. అట్లా చెప్పారు.

పాఠం నేర్చుకొనే సమయంలో క్షణ క్షణమూ కూడబెట్టి విద్య గడించాలని; కణము కణమూ కూడబెట్టి డబ్బు సంపాదించాలని; దానం చేసేటప్పుడు వాయిదా వేయవద్దని; యముడు నీ జుట్టు పట్టుకొని ఏ క్షణంలోనైనా రావచ్చునని, ఈలోపే సత్కార్యాలు చేయాలని ఎన్నో నీతులున్నాయి.

అన్ని పురాణాల సారాంశాన్ని ఒక్క ముక్కలో చెబుతానని వ్యాసుడు అన్నాడు.

**"శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథ కోటిభిః**

**పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనం"**

పుణ్యం కావాలంటే ఇతరులకు ఉపకరించు, పాపం కావాలంటే ఇతరులను పీడించుమని అన్నాడు. ఇంతకంటె సేవ గురించి ఏం చెప్పాలి?

ఆత్మోన్నతిని గూర్చి చెప్పింది కాని, ఇతరులకు సేవ గురించి మన మతం చెప్పలేదని విమర్శిస్తూ ఉంటారు. తనను తాను పవిత్రం చేసుకోక ఇతరులకు సేవ చేసి ఏం ప్రయోజనం? అట్టి పరిపక్వతతో సేవ చేయమంటోంది మన మతం.

ప్రశ్నోత్తరమాలికలో శంకరులు కిం మనుష్యేషు ఇష్టతమం? ఏది ఉన్నతమైన కోరిక? సమాధానంగా స్వపరహితాయ ఉద్యతం జన్మ తనహితం కోసం, పరుల హితం కోసం కోరుకోవాలి అని అన్నారు. శంకరుల సమాధానాన్ని విమర్శించేవారు విన్నారా?

అంతే సత్పురుషులు చంద్రకిరణాల వంటి వారని అన్నారు. ప్రపంచ తాపాన్ని పోగొడతాయి ఆ కిరణాలు. ఇట్లా ఉపకరించాలని అనుకోకుండా సహజంగా ఉపకరిస్తున్నారు. అట్లాగే సంఘ సేవా కార్యకర్తలు చేస్తున్నామని అహంకరించరు. ప్రచారం కోసం చేయరు కూడా. అట్లాగే వివేక చూడామణిలో శంకరులు, జీవన్ముక్తులు వసంత ఋతువులా ఉంటారని వసంతవత్ లోకహితం చరంతః అన్నారు. వసంతం మన కంటికి

కన్పిస్తుందా? చంద్రుడు కనబడినట్లు కనబడుతోందా? మహాత్ములట్లాగా కనబడరు. ఈ ఋతువు వస్తే దక్షిణపు గాలులు వీస్తాయి. చెట్లు చిగురిస్తాయి. ముఖ్యంగా మామిడి పండ్లు వచ్చే కాలం. శిశిరంలో ఆకులు రాలిపోతే వసంతంలో చెట్లు చిగురిస్తాయి. వసంత ఋతువుకునకు పచ్చజెండా చూపిస్తాయి. అట్లాగే జీవన్ముక్తుడు శరీరాన్ని ధరించి కనబడకుండా లోకానికి ఉపకారం చేస్తాడు. శంకరులట్టివారే కదా! శుష్క వేదాంతం చెప్పారా? వారి జీవిత వృత్తాంతాన్ని గమనించారా?

లోక సంగ్రహం కోసం జీవన్ముక్తులైన జనకాదులు పనులు చేస్తారని గీతలో ఉంది కదా! సంగ్రహమంటే ప్రేమతో ఇతరులకు మార్గదర్శకంగా ఉంటూ వారిని ఉన్నతులుగా తీర్చి దిద్దుట. భగవానుడే అట్టి పనులను చేసాడు కదా. ప్రశ్నోత్తర మాలికలో ఏది సాధించదగింది? కిం సాధ్యం? అనే ప్రశ్నవేసి **భూతహితం** ప్రాణులకు హితము చేయుటయే అన్నారు. సామాన్యునుద్దేశించి డబ్బు సంపాదించుకోవాలని అనుకుంటున్నావా? సంపాదించు, అది ధర్మకార్యాలకు ఖర్చుపెడితే నీ మనస్సు శుభ్రం చేసుకొన్నట్లే అన్నారు.

"యల్ల భసే నిజకర్మోపాత్తం
విత్తం తేన వినోదయ చిత్తం"

అని భజగోవింద స్తోత్రంలో అన్నారు కదా. అందే ఆత్మగురించి, భగవంతుని గురించి చెబుతూ గీతను పఠించు, విష్ణు సహస్రనామాలను కీర్తించు, సత్సంగంలో ఉండమని చెప్పి పేదవారికి. బలహీనులకు దానం చేయమని అన్నారు:

గేయం గీతానామ సహస్రం
ధ్యేయం శ్రీపతిరూపమ జస్రం
నేయం సజ్జన సంగే చిత్తం
దేయం దీనజనాయ చ విత్తం

అంతా మాయయని చెప్పే అద్వైతము ఈశ్వరార్పణ బుద్ధితో సేవ చేయమంటోంది. అందర్నీ ఈశ్వర స్వరూపులుగా భావించమంటోంది.

## నిందాస్తుతులు

ఈనాడు (1976లో) ఒక మూల నన్ను పొగడడం, ఒక మూల నిందించడం జరిగింది. అయితే నింద, మర్యాదాపూర్వకంగా ఉంది. ఈ నిందవల్ల ఆత్మ పరిశీలన చేసుకొనే అవకాశం దక్కింది.

నిందించడం వల్ల నిందింపబడే వానికే ఎక్కువ లాభం. ఇక స్తోత్రం వల్ల గర్వం, తద్వారా ఉన్నతికి హాని కూడా. నిందవల్ల మన లోపాలు తెలుస్తాయి. అందువల్ల మనకే ఉపకారం. మనం ఏడ్చేటట్లు మన బాగు కోరేవాడు చేస్తాడని, ఇతరులు మనం నవ్వేటట్లు, అనగా పొగడేవారు చేస్తారని లోకంలో ఒక మాట ఉంది.

ఇంతకుముందు పరోపకారం గురించి చెప్పినపుడు ఈ రోజున కల్కి పత్రికలో పడింది. దానిని ఈ రోజే చెప్పానని ఎవరో నన్ను స్తోత్రం చేసారు. గర్వపడకూడదని అమ్మవారు పంపించినట్లుగా ఒక జంట వచ్చి బాధను వ్యక్తీకరించారు. అది నిందాపూర్వకంగానూ ఉంది. క్రోధాన్ని చూపించడానికి బదులు బాధను వ్యక్తీకరించారు. ఏమా కథ?

## సంఘసేవ - కుటుంబం పట్ల కర్తవ్యం

నాతో దెబ్బలాడకుండా ఏడవడం మొదలుపెట్టారు. ఇంటి వ్యవహారాలను పట్టించుకోకుండా సంఘసేవ చేయండని ఎన్నడూ అనలేదు. నా ప్రసంగంలో ఇంటి గురించి గట్టిగా చెప్పి యుండకపోవచ్చు. ఇంటి వ్యవహారాలు ఎవరికీ మనం చెప్పకపోయినా నిర్వహిస్తూనే ఉంటారు కదా.

## హిందూ మతం - వ్యక్తుల గురించి

ముందు వ్యక్తి యొక్క పవిత్రతకే హిందూ మతం ప్రాధాన్యం ఇచ్చింది. ఎవరో మనలను విమర్శిస్తున్నారని మాకూ సంఘ సేవ ఉందని చెప్పుకోనవసరం లేదు. మతసంబంధమైన అనుష్ఠానం వల్లనే నాస్తికులు, ఇతర మతస్థులు ఈ మతంపై ఎన్ని దాడులు చేసినా నేటికీ నిలబడ కలిగింది. స్వధర్మానికే మనం ప్రాధాన్యం ఇస్తాం. ఇతరులకు సేవ చేయడం పై క్రైస్తవం దృష్టి పెడుతుంది. క్రమశిక్షణ కల్గి యుండడమే ఇస్లామ్ ప్రత్యేకత. హిందువులకంటే ఇతర మతస్థులలో ఒక పొందిక కన్పిస్తుంది. మనకు ఈ సంఘటిత వ్యవస్థ కంటె వ్యక్తి యొక్క అభ్యున్నతికే ప్రాధాన్యం ఇస్తాం.

## మిగతా మతాల కంటె ఎట్లా భిన్నం?

సంఘం శరణం గచ్ఛామి - అని బుద్ధుడు సంఘటిత పద్ధతిని ప్రవేశపెట్టాడు. క్రైస్తవంలో సామాజిక మత సమావేశాలుంటాయి. అట్లాగే మసీదులలో కూడా. వీరి క్రమశిక్షణను వర్ణించలేం. సిక్కులు, పార్శీలు తక్కువ సంఖ్యలో ఉండడం వల్ల ఐకమత్యం ఆధారంగా వారి మత క్రియాకలాపాలుంటాయి.

ఇతర మతాలలో విడివిడిగా పూజించరని అర్థం చేసుకోకండి. బుద్ధ మతంలో దీనికి స్థానం ఉంది. మిగిలిన మతస్థులు సామూహిక ప్రార్థనలకే ప్రాధాన్యం ఇస్తారు. ఇండ్లలో దృష్టిని సారించరు సాధారణంగా. మనవంటి వర్ణాశ్రమ నియమాలు వారికి లేకపోవడం వల్ల. అయితే మనమూ ఆలయాలలో కలిసి ఉత్సవాలు జరుపుకుంటాం. కాని చర్చిలలో, మసీదులలో సామూహిక ప్రార్థన చేసినట్లు మనము ఆలయాలలో చేయం. ఆలయాలు మన మతానికి వెన్నెముకయైనా వ్యక్తుల నియమనిష్ఠలననుసరించే ఆలయంలోని దేవుడు కరుణిస్తాడని నమ్ముతాం.

## ఆలయపూజ యొక్క ఉద్దేశం

ఋషులు చేసిన తపస్సు, ఆలయాలలో ధరావత్తు మాదిరిగా ఉండగా దానినుండి భక్తులు గ్రహిస్తారు. అందున్న మూర్తులనుండి ఆశీస్సులను పొందుతారు. అందు మంత్రపఠనం ఉండడం వల్ల ఆధ్యాత్మిక లాభాన్ని పొందుతాం. అయినా దేవాలయారాధన వ్యక్తులకు సహాయకారిగా ఉంటుందే కానీ మొత్తం సంఘానికి ముక్తిని ప్రసాదించేటట్లుగా ఉండదు.

ఆలయాలలో ఉత్సవాలు చేసేటపుడు అనేకమైనవాటిని అర్పిస్తాం. దానిమాట వేరు. కలిసి చేయడమే అంతిమ లక్ష్యంగా భావించం. అయినా సంఘం యొక్క కృతజ్ఞతనది సూచిస్తుంది. భగవానుని నుండి సంఘం, అన్నిటినీ పొందడం లేదా? కృతజ్ఞతా పూర్వకంగా సామూహికంగా సమర్పిస్తూ ఉంటారు. బట్టలు, ఆహారం మొదలైనవి కలిసి పనిచేయడం అంతవరకే.

ముక్తిని పొందడానికి అంతమాత్రం చేస్తే చాలదు. తీవ్రమైన భక్తి, భగవంతునిలో ఐక్యమౌతున్నామనే భావన మొదలైనవాటివల్ల ముక్తి. అదైనా ఎవరికి వారే నిర్వహించుకోవాలి. మత నియమాలను సరిగా నిర్వహించినవానికే ఆలయం, సహకారిగా ఉంటుంది. రోజూ ఆలయాన్ని దర్శించడం వల్ల మత నియమాలను పాటించాలనే దీక్ష ప్రబలి ముక్తికి దారి తీస్తుంది.

Darkness at Noon అనే వివాదగ్రస్తమైన గ్రంథాన్ని వ్రాసిన ఆర్థర్ కోస్లర్ నా దగ్గరకు వచ్చి మీ ఆలయాలలో ఏమిటా శబ్దాలు అని అన్నాడు. [illegible] మతస్థులు మాదిరిగా మౌనంగా ప్రార్థించడం ఇక్కడ ఉండదని, ఏకాంతంగా ఉన్నప్పుడే మౌనంతో కూడిన పూజయని, ఆలయం సామూహిక ప్రార్థనా స్థలం కాదని అన్నాను. రాజు దేశాన్ని రక్షిస్తున్నాడు కనుక అతనికొక భవనం, అలంకరణ వస్తువులు కట్టడం ఉన్నట్లుగా జగత్పరిపాలకునకు ఇట్లా

మనిషి ఉన్నత స్థితిని పొందుతాడు. రకరకాల దానాదుల వల్ల సంఘం బాగుపడుతుంది. అంతమాత్రంచే తృప్తి పడకుండా ఆధ్యాత్మికంగా సాధనను కొనసాగించాలి. వాటిని పొందేవాని కంటె ఇచ్చేవానికే ఎక్కువ లాభమని చెప్పాను.

సంఘ సేవలో ఏవేవి వస్తాయో వివరించాను. ఆధ్యాత్మిక ప్రగతి గురించి చెప్పేటపుడు గృహస్థ ధర్మాల గురించి స్త్రీ ధర్మాలను గురించి చెప్పలేదు.

డబ్బు సంపాదించండి, దానమీయండని; అనారోగ్యం ఉంటే వైద్యుణ్ణి కలవండని చెప్పలేదు. ఇది చెప్పాలా? ఒక బీదవిద్యార్థికి చదువు చెప్పించండని అన్నాను కాని మీ అబ్బాయికి చదువు చెప్పించండని అన్నానా? అట్లాగే బీద పిల్లలకు వివాహం చేయండని అన్నాను కాని మీ అమ్మాయికి పెళ్ళి చేయండని అనలేదు కదా!

ఇతరులకెందుకు సాయం చేయాలన్నాను? తాను పవిత్రుడౌతాడని, చిత్త శుద్ధి కల్గుతుందని. ఇంటి కార్యక్రమాలను గురించి చెప్పాలా? దీనివల్ల ఆధ్యాత్మిక ప్రగతి వస్తుందా? నిస్వార్థంగా చేయడం వల్లనే ఫలం వస్తుందని చెప్పడమే నా లక్ష్యం.

## మామూలు విషయాలెందుకు చెప్పలేదు?

లోకక్షేమం కోసం ప్రార్థన చేయాలని చెప్పాలి గాని నీ కుటుంబం కోసం ప్రార్థన చేయండని చెప్పనవసరం లేదు. ఆత్మోన్నతికి భంగం కలిగే రీతిలో ప్రార్థిస్తూ ఉంటారు. ఇక ధర్మాధర్మాలను పాటించరు. ఒకరికి ఇయ్యాలనీ తట్టదు. ఇట్టివారినుద్దేశించి మీ విషయాలను మాత్రమే పట్టించుకోకుండా ఇతరులకు సాయం చేయండని, కోరికలను తగ్గించుకోండని సంఘానికి సేవ చేసి తద్వారా ఆత్మోన్నతికై పాటు పడండని చెప్పవలసి వస్తుం

## కాస్త శ్రద్ధ తీసుకొని యుండవలసింది

నా దగ్గరకు వచ్చిన దంపతుల మాటను బట్టి నా ఉపన్యాసాల వల్ల వాళ్ళ అబ్బాయి తన విషయాలు, ఇంటి విషయాలు పట్టించుకోకుండా, రోజూ ఒక పిడికిలి బియ్యాన్ని ఇంటింటికి వెళ్ళి సేకరించడం, కూరతొక్కల్ని సేకరించి జంతువులకు వేయడం, ఆస్పత్రులకు ప్రసాదాలు తీసుకొని వెళ్ళి రోగులకు పంచిపెట్టడం మొదలైన సంఘసేవలు చేస్తున్నాడని, వాడి బట్టలే వాడు ఉతుక్కోవడం లేదని ఏదైనా వద్దని చెబితే ఇంటికే రావడం మానివేస్తాడని ఫిర్యాదు చేసారు. కాస్త సలహా చెప్పండని అన్నారు.

దీనికంతటికీ మీరే కారణం కాదా అని పరోక్షంగా నా లోపాన్ని ఎత్తి చూపించారు.

కనుక సంఘసేవ గురించి చెప్పేటప్పుడు మీ ఇంటిపనులకు భంగంలేని రీతిలో సంఘసేవ చేయండని ఇకనుండి చెబుతాను. ఇట్లా నిర్లక్ష్యం చేసి సేవ చేస్తారని ముందూహించలేదు.

సంసార క్రియలు పూర్తి చేసుకున్న తర్వాత సంఘసేవ చేస్తాననడం ఎటువంటిదనగా అలలు తగ్గిన తర్వాత స్నానం చేస్తాననడం వంటిది. అట్లా చెప్పడానికి బదులు ఇంటి పనులను నిర్లక్ష్యం చేయకండని కర్తవ్యబోధ చేస్తాను.

## కపటం, మోసం

తన బాధ్యతను ఇతరులపై నెట్టివేసి సంఘసేవంటూ బయలుదేరడం ఒక మోసం, దగా. ఇట్లా ప్రవర్తిస్తున్నావేమిటని అడిగితే అతడు కోపపడతాడు కదా. కోపతాపాలున్నవాడు దయతో కూడిన సేవనెట్లా చేయగలడు?

మనం మానవులుగా జన్మించాం. కొన్ని పరిమితులుంటాయి. తల్లి బిచ్చమెత్తుకుంటూ ఉంటే ఎవడో గోదానం చేసాడనే మాట ఉంది. కనుక స్వీయ ధర్మాలను విడిచిపెట్టకూడదు. తన పనులు తాను చేసుకోవాలి.

రాజగోపాలాచారిగారు మద్రాసు ముఖ్యమంత్రిగా పని చేసినపుడు తన బట్టలను తానే ఉతుక్కునేవాడు. అట్లాగే కొంతమంది ఉన్నతాధికారులు తమ జోళ్ళను తామే శుభ్రం చేసుకొనేవారని విన్నాను. కనుక గృహకృత్యాలను నిర్లక్ష్యం చేయకండి

## శాస్త్రాదేశములు

తన బట్టలు తానే ఉతుక్కోవాలని, తన వంట తానే చేసుకోవాలని (స్వయం పాకం) శాస్త్రాలన్నాయి. పూజ చేసినా పూజా సామాగ్రిని తానే సేకరించాలి. గురువులను, పెద్దలను, తల్లిదండ్రులను సేవించి పుణ్యం కట్టుకోవడానికి శిష్యులు, పిల్లలూ పైవారికై సేకరించి ఈయాలి.

## పెద్దల నడవడి

కొందరాచార్య స్థానంలో ఉన్నా శిష్యులకు ఉపదేశించకుడా తమ పనులను తామే చేసుకొనేవారు. వేదాంత దేశికులనే మహాపురుషులు, ఉంఛవృత్తితో జీవించేవారు. అట్లాగే త్యాగరాజ స్వామి కూడా. ఎందరో అట్టివారికి సేవ చేయడానికై సిద్ధంగా ఉండేవారు. మహమ్మద్ ప్రవక్త కూడా తన పనులను తానే చేసుకొనేవాడట.

నామదేవ్, ఘోరా కుంభర్, తిరునీలకంఠ నాయనార్ ఇంకా ఎందరో శివభక్తులు తమ కుటుంబాన్ని పోషించుకోవడానికి కుమ్మరి, దర్జీ మొదలైన వృత్తులను చేసేవారు.

శివాజీ తన సామ్రాజ్యాన్ని సమర్థ రామదాసు స్వామి పాదాల దగ్గర నుంచాడు. వారి ప్రతినిధిగా పరిపాలించాడు. కాని రామదాస స్వామి మధుకర వృత్తితో జీవించేవాడు. ఎందుకంటే ఇతరులు తమకై బాధపడకూడదనే.

కనుక కుటుంబానికి, సంఘానికి సంఘర్షణ లేని రీతిలో సేవ కొనసాగించాలి.

## తల్లిదండ్రుల పట్ల

సంఘసేవ చేసే విషయంలో తల్లిదండ్రులను ఒప్పించలేక పోయినా వారితో పోట్లాటకు దిగకూడదు. వారి మాటలను అతిక్రమించి నడవకూడదు కూడా. వారి మాటలకే శాస్త్రాలు ప్రాధాన్యం ఇచ్చాయి. వారు సంకుచిత దృష్టితో ఉన్నా వారిని ఒప్పించి పిల్లలు ప్రవర్తించాలి.

## భార్య పిల్లల పట్ల

భార్య, బిడ్డల మాట వేరు. వారు యజమాని మాట వినే స్థితిలో ఉంటారు. వారి అవసరాలకై మనలను లాగివేస్తూ ఉంటారు. వారిపట్ల మన బాధ్యతను నిర్వహించినా, ఒకపుడు మనం చేసే సేవ వారికిష్టం లేకపోయినా పెద్దగా పట్టించుకోనవసరం లేదు. దేంట్లోనైనా 'అతి' పనికిరాదు. మనం వారిని నిర్లక్ష్యం చేసామని ఇతరులనుకోకూడదు.

## లక్ష్యం దెబ్బతినకుండా

తానింట్లో చేయవలసిన దానిని ఇతరులకు అప్పజెప్పి తాను సంఘసేవ చేస్తాననడం వల్ల సంఘసేవ పట్లనే ఏవగింపుగా ఇతరులు చూస్తారు. ఇంటిని నిర్లక్ష్యం చేయకుండా సేవ చేస్తే ఇంట్లో వారూ సహకరిస్తారు.

సేవ చేసేవారికి ఒక చిట్కా చెబుతాను. మనం అందరం సంసార లంపటంలో చిక్కుకున్నాం. వాడైనా కొంత సేవచేసి పుణ్యం సంపాదించు కొన్నాడులే అని అనిపించేటట్లుగా ప్రవర్తించాలన్నమాట. అపుడు ఇంట్లో చేయవలసిన పనులనూ తామే నిర్వహిస్తూ ఉంటారు.

## ముందు ఇంటికే

అన్నీ అర్హతలుండి ఎవరైనా సన్న్యాసాశ్రమానికి సిద్ధపడితే తల్లిదండ్రులు అంగీకరించకపోతే అతనికి సన్న్యాస ఆశ్రమాన్నీ ఇయ్యరు. అట్లాగే

భార్యాబిడ్డలకు ఆధారం చూపించకుండా ఉన్నా ఊయరు. కనుక ఉద్దేశింపబడిన విధులను నిర్వహించడం ప్రథమ కర్తవ్యం.

మరొక అనుభవం. ఒక బ్రాహ్మణుడు న్యాయవాదిగా ఉండేవాడు. దేశంలో ఏ ప్రాంతంలో ఏ వేదశాఖ ప్రబలంగా ఉందో చూసిరమ్మని పంపించాను. దీనివల్ల అతని భార్య, పిల్లలు కొంత ఇబ్బంది పడ్డారు. వాళ్ళ పిల్ల నాతో దెబ్బలాడింది కూడా. అట్లా అనడం కంటె నాకుపదేశం చేసిందని చెప్పాలి. "నాన్న న్యాయవాద వృత్తి మానేసాడు. ఆరోగ్యం దెబ్బతింది. మీరేమో దేశం అంతా నాన్నను త్రిప్పుతున్నారు" అని ఫిర్యాదు. వాళ్ళేమో వాళ్ళ కుటుంబం గురించే బాధపడుచున్నారు, కాని ఆయనను పంపించడం నా విధియని అనుకున్నాను. నా చేష్టవల్ల వారు బాధపడినా వాళ్ళ ఇంట్లో జరిగిన మంచి అంతా నావల్లనే అనుకుని నా పట్ల గౌరవం చూపించారు. భర్త మాట వినాలనే శాస్త్ర వాక్యాన్ని నేను మాటల ద్వారా చెప్పవచ్చు గానీ మౌనం వహించాను. తల్లిదండ్రుల తరువాత నేను గురుస్థానంలో ఉన్నాను కదా. వారికి నేనేమని చెప్పేది?

## ఉన్నతస్థితి అందరికీ అందేది కాదు

నేను ప్రసంగిస్తున్న సమయంలో "పొరుగువారి పిల్లను మనం సాకితే మన పిల్లలు తమంతట తామే పైకి వస్తారని" అనేవాణ్ణి. మరొకవిధంగా చెప్పాలంటే నీ పిల్లను పస్తుండబెట్టు గాని ఇతరుల పిల్లలకు అన్నంపెట్టమని ఒక సామెత ఉంది. ఈ మాటలు ఉన్నత స్థితిలో ఉన్నవారికి నప్పుతాయి. అది కేవలం సేవలో మునిగినవారికే. ఆ మాట వల్ల వారి పిల్లలను సాకడంలో నిర్లక్ష్యం వహించారని కాదు. ఇతరులకు సేవ చేయడమే లక్ష్యమని చెప్పడమే దాని పరమార్థం. శివ భక్తులైన నాయనార్లు తీవ్ర భక్తిలో సాంఘిక ధర్మాలను

ఉల్లంఘించలేదా? అట్లా తీవ్రసేవ చేసేవారికి ఈ మాట నప్పుతుంది. అట్టివారి తీవ్ర మనః ప్రవృత్తిని గమనించి భగవానుడు వారి పిల్లల అభివృద్ధిలో అనుకంప చూపించడా? అయితే ఇట్టివారి నడవడిని సామాన్యులు అనుకరించకూడదు.

నేనొక చిత్రమైన వార్తను విన్నాను. ఒక డబ్బున్న ఇల్లాలు సమాజ సేవ పేరుతో హరిజన వాడలకు పెట్రోలు ఖర్చుపెట్టి తన వాహనంలో వెళ్ళి వాడలోని పిల్లలకు వేరే దేశం వాళ్ళిచ్చిన పాలపొడితో చేసిన పాలను కాచి వాళ్ళకు అందిస్తూ ఉండేదట. కాని ఆవిడ ఇంట్లో ఆ వాడలో పాలు త్రాగిన పిల్ల తల్లి వచ్చి ఈ యజమానురాలు యొక్క పిల్లలకు తన పాలనిచ్చేదట.

కనుక సంఘసేవ పేరుతో ఎవరికి వారు మోసం చేసుకోవడం తగదు.

## విధి నిర్వహించకపోవడం - శిక్ష

ఒక్క విషయం మరిచిపోతున్నాం. మన సేవవల్లనే జగత్తు నిలబడు తోందా? నారుపోసినవాడు నీరు పోయడా? మనం, వట్టి పనిముట్లు వంటివారం. ఇతరులకు సేవచేయడం వల్లే వాళ్ళను ఉద్ధరించడం కాదు, మనలను మనం ఉద్ధరించుకొంటున్నామని గాఢంగా భావించాలి. గత జన్మ కర్మలను పోగొట్టుకోవడంకోసం, చిత్తశుద్ధి ఏర్పడడం కోసం శాస్త్రం విధించిన ధర్మాలను మనం ముందుగా నిర్వహించాలి. ఏ కొంతమందికో బరువు బాధ్యతలంటూ ఉండకుండా కాలం గడుస్తుంది. కొంతమందికి బరువు బాధ్యతలుంటాయి. పైవారు సేవకే వినియోగించాలి. మిగిలినవారికి తమ ఇల్లు చక్కబెట్టుకుంటూ సేవ చేయాలి. అయినా తన పని ఇతరులకు అప్పజెప్పడం మాత్రం పనికిరాదు. శాస్త్ర నియమాలను ఉల్లంఘించి ఎట్టి మంచి పని చేసినా అది ఒక శిక్షగా మారుతుందని గ్రహించండి.

## సేవా దృక్పథము యొక్క విలువ

లోగడ రెండు సామెతలు చెప్పాను. మరొకటి తనను తాను ఉపకరించుకొనుట పెద్ద ఉపకారమని. Self help is the best help.

సంఘసేవ చేస్తే ఇతరులు పొగుడుతారు. ఇంటి పనులు చేయకుండా సేవ చేస్తే ఇంట్లోవారు తిడతారు. ఇట్లా ఐతే సేవ చేయడానికే బుద్ధి పుట్టదు, చేసినా అది పేరు, ప్రతిష్ఠకు దారి తీస్తుంది. కనుక నా బాధ్యతలు నేను నిర్వహించిన తరువాత నేను సేవకై పూనుకొంటాననాలి. ప్రేమ, వినయంతో చేయాలి.

తన బాధ్యత అంటే ఇల్లు, తల్లిదండ్రులు, భార్య, పిల్లలు మొదలైన అందరి పనులూ చక్కబెట్టడమే. నా కర్తవ్య నిర్వహణలో నాకు నీ కృప కావాలని పరమేశ్వరుని ప్రార్థించాలి. చివరకు వసుధైక కుటుంబకం అనే భావన దృఢపడుతుంది.

## నిందించడమే స్తుతి

మన మతం గురించి రెండు విమర్శలున్నాయి. ఒక మూల బ్రహ్మమొక్కటే అంటూ ఆత్మనే పరమాత్మగా భావించాలనినపుడు పూజాదుల అవసరం ఏమిటి? మిగతా మతాలలో లేని రీతిలో అనేక దేవీ దేవతలుండడమేమిటి? అనేక ఆలయాలు, పురాణ కథలు మంత్ర తంత్రాలు మొదలైనవి మనకుండగా ఇతర మతస్థులు ఏకేశ్వరోపాసనయే చేస్తారు కదా. అద్వైతం గురించి చెబుతూ అనేక స్వాములు వారిలో అభిప్రాయ భేదాలతో మనమున్నాం. క్రైస్తవులకు క్రీస్తు, మహమ్మదీయులకు మహమ్మద్ ప్రవక్త, సిక్కులకు నానక్ అనగా మతస్థాపకుల పట్ల భగవంతునితో సమానంగా భక్తి ప్రపత్తులను చూపిస్తారు. అది గురుభక్తి వంటిది. బౌద్ధ, జైన మతాలలో దేవుడు లేడు. మోక్షస్థితిని

ఎలా పొందవచ్చో తమ ప్రవర్తన ద్వారా చూపించారు. కనుక బౌద్ధులు, జైనులు వారినట్లా పూజిస్తారు. అనుయాయులు వారిని సృష్టికర్తలనరు. మనం బుద్ధుణ్ణి అవతారం అంటాం గాని వారనరు. పూర్ణజ్ఞానం పొందినవారుగా వారిని కొలుస్తారు. వారి మతంలో దేవుడు లేకపోయినా కర్మ సిద్ధాంతాన్ని, పునర్జన్మ సిద్ధాంతాన్ని నమ్ముతారు. నిర్వాణం, కేవల భావన, దానంతవరకూ కర్మఫలాలను అనుభవించవలసిందే అని అంటారు. ప్రపంచం ఉన్నంతవరకు దేవతలు, గ్రహాలూ ఉన్నాయని, వారు కృపను, శక్తిని చూపిస్తారని నమ్ముతారు. ఈ నమ్మకంతో వారిని కొలుస్తారు. బుద్ధుణ్ణి, జినుణ్ణి పూజించినట్లుగానే ఇతర దేవతలనూ పూజిస్తారు. ఎందుకంటే వారు తమ కంటె అధిక శక్తి వంతులని భావించడం వల్లనే.

పెక్కుమంది దేవతలను పూజించడం అర్థం చేసుకోలేము గాని, ఈశ్వరునితో సంబంధం లేని వాటికీ ప్రాధాన్యం ఇస్తున్నారేమిటని, పితృకర్మల మాటేమిటని వారు ప్రశ్నిస్తారు. మిగతా మతాలలో తాము నమ్ముకొన్న స్వామిని పూజిస్తే చాలు. కాని 'అహం బ్రహ్మాస్మి' నేనే దేవుణ్ణి అంటూ పితృకర్మలు చేయడమేమిటని ప్రశ్నిస్తారు. ఈ తద్దినాలేమిటి? మాసికాలేమిటి? రోజూ తర్పణాలేమిటి? అని విమర్శ.

మిగతా మతాలలో పుట్టిన రోజు పండుగలుంటాయి. పెళ్ళి హడావుడి తక్కువే. ఇక మనకు గర్భాదాన పుంసవన, సీమంత, జాతకర్మ, నామకరణ, విద్యారంభ, ఉపనయన, వివాహాదులుంటాయి. వివాహం అయితే ఔపాసన ఉంటుంది. (ఇది మానివేస్తున్నారని బాధపడుతున్నాను) ఇవి అన్నీ దేవునితో సంబంధం ఉన్నా అనేకమైన కోరికలుంటాయి. అనేక ప్రార్థనలు.

ఇక వేదధర్మంలో ఉన్న పంచ మహాయజ్ఞాలలో వేదాంతం ఆధారంగా చేసుకొనిగానీ ఏదో ఒక దేవుడిమీద భక్తితో నిమగ్నం కావడంగానీ లేవు. అట్లాగే యజ్ఞాలు కూడా. ఇక పెక్కుమంది దేవతలను గ్రామదేవతలను

పూజించడమేమిటి? అనే విమర్శలున్నాయి. ఆపైన నా కుటుంబం క్షేమంగా ఉండాలని గ్రహపూజ లేమిటి? ఇదంతా వ్యాపారంలా ఉంది. భగవంతునకు లంచాలిస్తున్నారని ఆక్షేపణ.

ఇట్లా ఎవరైనా ప్రశ్నిస్తే కొందరిట్లా సమాధానం చెబుతారు. అయ్యో! మా మతంలో కొన్ని బలహీనతలున్నాయి, మాకు ఏకేశ్వరోపాసన చేసే పరిపక్వమైన బుద్ధిలేదు, నిర్గుణ బ్రహ్మము మొదటిది అనేక దేవతలను ఆరాధిస్తున్నాం. మతం పేరుతో ఎన్నో మాలో ప్రవేశించాయి. పంటలో కలుపు మొక్కలుండి పంటను నాశనం చేసినట్లు అనవసరమైన కర్మకాండ, ఆచారాలు పురోహితవర్గం తమ స్వార్థం కోసం ప్రవేశపెట్టారని, ధ్యానం చేయడమే ఉత్తమ మార్గమని విమర్శించేవారికి వీరు సమాధానం చెబుతారు.

కాని ఇవన్నీ తప్పని నేను మాట్లాడను. అన్నీ ఉండడమే మన మతం యొక్క ప్రత్యేకత అని అంటాను.

ప్ర: ఏకేశ్వరోపాసన మంచిది కాదా?

స: మంచిదే.

ప్ర: మనమూ మన కుటుంబం, పితృదేవతలకంటె మొత్తం సంఘానికి సేవ చేయడం ఉత్తమం కాదా?

స: అంగీకరిస్తాను.

ప్ర: అయితే స్వార్థం కోసం చేసే యజ్ఞాలను సమర్థిస్తారా?

స: ఎందుకు ఒప్పుకుంటున్నానో మీకు తెలుసా? అన్నిటిలో పరమాత్మ ఆరాధన ఉంది కనుక. వీటిల్లో సేవాభావం దాగియుంది. వీటివల్ల చిత్తశుద్ధి ఏర్పడుతుంది.

ప్ర: అర్థం చేసుకోలేకపోతున్నాం. ఎట్లా?

స: వీటిని అర్థం చేసుకోకుండా చాలమంది హిందువులు ఆచరిస్తున్నారు.

అర్థం చేసుకోకపోవడం వల్ల కొందరు విదిలేస్తున్నారు. అర్థం చేసుకొంటే ఇది పరమాత్మ ఆరాధనయని తెలుస్తుంది. ఇందున్న సేవా భావం, మిగతా మతాలలో లేదు.

ప్రశ్న: ఎట్లా?

స: ఉన్నది ఒక్క పరమాత్మయే. దానికి భిన్నమైనదేదీ లేదు. సమస్త ప్రాణివర్గమూ పరమాత్మ స్వరూపమని అనుభవంలోకి రావడమూ కష్టమే. ఇతర మతస్థులు ఒక దేవుడని, నిర్వాణమని, కైవల్యమని అంటారు కదా. అయితే మీరు నమ్మినది, మీ అనుభవంలోకి వచ్చిందా? ఆత్మానుభూతి కలిగినవారు మీలో ఏ కోటికి ఒకడో ఉంటాడు. ఇక మాలో కర్మకాండలలో మునిగినా, మీరన్నట్లు భగవంతునితో సంబంధం లేని పనులు చేస్తున్నా అనుభూతి పొందినవారెందరో మాలో ఉన్నారు. విమర్శించేవారు కూడా ఇది మహాత్ముల భూమియని ప్రశంసించడం లేదా? మిగతా దేశాలవాళ్ళు వీరిని దర్శించడానికి వస్తున్నారు కదా.

అంతా పరమాత్మయని చెప్పినా వ్యవహార జగత్తులో కొన్ని పనులు చేయాలి కదా. మనం ఆత్మ స్వరూపులం అనే ఎఱుకను, మన గత కర్మవాసనలు మరుగు పరుస్తాయి. ఆపైన సంసారంతో ఉన్నాం కదా. ఇదీ కర్మవల్ల వచ్చిందే. మన మనస్సును అపవిత్రం చేసేవి కర్మలే. కర్మబంధం వల్ల అనేక విధులు నిర్వహించవలసి వస్తుంది. చేయకపోతే కర్మక్షయమెట్లా అవుతుంది? ఇన్ని పెట్టుకొని ఆత్మను చూడడం కుదురుతుందా? సత్కర్మల వల్ల దుష్కర్మలనే మేఘాన్ని తరుమగలిగితే జ్ఞాన సూర్యుడుదయిస్తాడు. సత్కర్మ అనేక విధుల రూపంతో ఉంటుంది. ఎవనికో ఒకనికి జ్ఞానం పట్టుబడుతుంది. మిగిలినవారు కర్మనుండి విముక్తులు కావాలి కదా! శైవ సిద్ధాంతం ప్రకారం చెడ్డ కర్మ, అనేక జన్మలనూ ఒక సిబ్బిలో వేయగా అది క్రిందకు లాగుతూ ఉంటే మరొక సిబ్బిలో సత్కర్మలను వేస్తూ వీటి బరువెక్కేటట్లు చేయాలి.

శరీర రక్షణ - డబ్బు - వృత్తి - ఇవన్నీ స్వార్థంతో కూడినట్లే ఉంటాయి. గత జన్మ కర్మల వాసనలు పోవడానికి, కర్మలు చేయడం తప్పదు. కర్మలను చేస్తున్నామని సిగ్గు పడనవసరం లేదు.

చేసే కర్మలను మంత్రపూర్వకంగా చేస్తే ప్రపంచానికి క్షేమం కలగడమే కాకుండా చిత్తశుద్ధి ఏర్పడుతుంది.

స్త్రీ గర్భిణిగానున్నపుడు చేసే పుంసవనం గాని, పుట్టిన వెంటనే జరిగే జాతకర్మ కాని, జ్ఞానానికి ఉపయోగించే ఉపనయనకర్మగాని జీవుల్కి శుద్ధి చేసేవే.

ఇట్లా జీవుడు - తద్వారా కుటుంబం శుద్ధి పొందితే సంఘ శ్రేయస్సు కలగదా? అట్టివానికి సేవా దృక్పథమూ కల్గుతుంది.

ఈ లోక ప్రజలకే కాదు, ఇతర లోకాలలో ఉన్నవారికీ సద్గతి కలగాలని ప్రార్థిస్తున్నాడు హిందువు. పోయినవాడు ఏ లోకానికి వెళ్ళినా వాని సద్గతులకై క్రియాకలాపాలు నిర్వహింపబడుతున్నాయి. ఇదంతా సేవ కాదా?

ఇక బహుదేవతారాధన గురించి - మన కంటికి కనబడని దేవతలు, క్షుద్రదేవతలూ ఉన్నారు. ఆ క్షుద్రమైన వాటిని పరమాత్మ సేవకులని అంటారు.

మనుష్యులలో, జంతువులలో సాధు, క్రూర అన్నట్లుగా దేవతలు, క్షుద్రదేవతలూ ఉన్నారు. సాత్విక, రాజసిక, తామసిక పద్ధతులలో వాటిని భక్తుల మనః ప్రవృత్తులను బట్టి కొలుస్తూ ఉంటారు. గ్రామదేవతలకు పూజారులున్నారు. నైవేద్యాలు భిన్నభిన్నంగా ఉంటాయి.

వీటిని స్వార్థం కోసం కాకుండా పూజిస్తే గ్రామాదులును రక్షిస్తాయి. ప్రకృతి ప్రశాంతంగా ఉంటుంది. గ్రామ క్షేమం కోసం చేసే పూజ, సేవ కాదా! అందుకై వాటికై బలులనర్పిస్తారు. అదీ పరమేశ్వర శక్తిలో భాగాలే. వాటిని తృప్తి పరచడం సేవయే.

ఇతర మతాలవారు మానవులకు, జంతువులకు సేవ అని అంటున్నారు. ఇక మనం వాటితో బాటు మన కంటికి కనబడనివాటికి ఇతర లోకాలలో నున్నవారికీ తృప్తి పరచాలని అంటున్నాం. పంచ మహాయజ్ఞాలలో కుక్కలకు, కాకులకు రోజూ బలివేయాలని అంటున్నాం.

ఇక ఏ దేవతను ఆరాధించినా ఒకే ఒక పరమాత్మ అందున్నాడనే భావనతో పూజిస్తున్నాం. మనం కొలిచే గ్రామదేవతలను కూడా పరమాత్మ స్వరూపంగానే ఆరాధించాలి. అందరూ ఈశ్వర స్వరూపులైనా వ్యక్తులని విడివిడిగా సేవిస్తున్నాం కదా. ఒక్కొక్క రోగానికి ఒక్కొక్క చికిత్స ఉంది. వృత్తులు లేనివారికి వారికి తగ్గ వృత్తులను కల్పిస్తున్నాం. అట్లాగే ఒక్కొక్క దేవతను ఒక్కొక్క రీతిలో పూజిస్తున్నాం.

కర్మల లక్ష్యం చిత్తశుద్ధి. దానికోసం యజ్ఞాలని, దానాలని, తపస్సులని చెప్పింది శాస్త్రం. ఆ దానమూ త్రికరణాలతో అని చెప్పింది ఉపనిషత్తు. యజ్ఞేన, దానేన, తపసా. ఆ ఉపనిషత్తే తండ్రీ లేదు, తల్లి లేదు, దేవత లేదు, పూజించేవాడే లేదని చెబుతూ దేవతలను పితృదేవతలను అర్చించడం మానవద్దనీ అంటోంది. దేవ పితృకార్యాభ్యాం న ప్రమది తవ్యం

అంటే ఎట్లా పొసగింది? నాకీ ప్రపంచంతో సంబంధం లేదు, పరమాత్మను తెలుసుకోవాలి అనినపుడు ఈ ఆరాధనలు, సంఘసేవలూ పోవాలి కదా! అయితే ఆ రాయిలా పడి యుండి సేవ చేయకుండా ఉండాలా? అట్టివానికి పరమాత్మ జ్ఞానం లభిస్తే అతడందరికీ శాంతిని ప్రసాదించగలడు. అట్టి మహాత్ములెందరో ఉన్నారు.

మాకొక్క దేవుడే, ఇంతమంది లేరనినపుడు అట్టి ఈశ్వరానుభవం వారిలో కొంతమందికే కల్గుతోంది కదా! మనం ఒక్క పరమాత్మపై ధ్యానమనే భావనను విడిచి అనేక దేవతలను, అనేక లోకాలలో ఉన్నవారిని తృప్తి పరుస్తున్నామని, అదృశ్య శక్తులను సంతోష పరుస్తున్నామని పరమాత్మ కరుణించి మనకు

మిగిలిన మతస్థుల కంటె ముందుగా జ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాడని ఎందుకనుకోకూడదు? అందుకే మనలో జ్ఞానులు, మహాత్ములు ఎక్కువగా ఉన్నారేమో!

ఈశ్వరుడు ప్రభువు. అతని దగ్గర దేవతలు, పితృదేవతలు మొదలైన వారుంటారు. ప్రతి పనికి ప్రభువు దగ్గరకు వెళ్ళం. క్రిందనున్న అధికారులను ఆశ్రయిస్తాం. జ్ఞానం కలిగేటంతవరకూ ఇట్టి దేవతలనారాధించవలసిందే. అన్ని ధర్మాలు వీడి నన్నే శరణు పొందుమనే మాట గీతలో చివరగా ఉంది. ముందనలేదు. ఏడవ అధ్యాయంలో ప్రజలు స్వభావానుగుణంగా అనేక దేవతల నారాధిస్తారని, ఆ సందర్భంలో ఆ దేవతపై అనురక్తిని భక్తునిలో కల్గిస్తానని, అప్పుడు కూడా ఆయా దేవతలలో అంతర్యామిగా ఉన్నానని మరువరాదని, ఆయా దేవతలు వారి వారి కోర్కెలను తీరుస్తారని, నన్నే చింతిస్తూ వారిని ఆరాధించేవారు నాదగ్గరకే చివరకు వస్తారని అన్నాడు కదా.

అన్ని విడిచి నన్నే పొందుమన్న గీతలో ఆఖరిన చెప్పిన మాట పరిపక్వ స్థితిలో నున్నవారికే. గీత మధ్యలో చెప్పినది మధ్యస్థాయిలో నున్నవారికి. ప్రాథమిక స్థాయిలో నున్న మనవంటివారికి పెద్దపెద్ద మాటలు చెప్పలేదు. మొదటి దశలో దేవతలలో అంతర్యామిగా ఉంటానని చెప్పలేదు. ఏమన్నాడు? సృష్టి ఆరంభ దశలో దేవతలను మనుష్యులను సృష్టించాడని; ఒకరిని ఒకరాదుకోవాలని, దేవతలకు యజ్ఞరూపంలో హవిస్సులనందించాలని, అపుడు వారు సంతుష్టులై వర్షాన్ని ప్రసాదిస్తారని, అపుడు జీవనం సరిగా సాగుతుందన్నాడు. ఆ కృష్ణుడే 'మామేకం', నన్నే అని చెప్పినవాడే, దేవతలకు అర్పించకుండా తినేవాడు దొంగయని అన్నాన్ని కాదు, పాపాన్నే తింటున్నాడనీ అన్నాడు. అక్కడ బహుదేవతారాధనను ప్రశంసించాడు.

కనుక క్రమమార్గం చెప్పింది హిందూమతం. అందరికీ ఒకే ఆరాధనా పద్ధతి లేదు. వారి వారి స్థాయినిబట్టి యుంటుంది. దీనిని గుర్తించరు విమర్శకులు. చివరి స్థాయిని గుర్తించాలని ముందే ఎగిరితే అది పతనానికే దారి తీస్తుంది.

వినయం ఉండాలి. అన్నీ మనమే సాధిస్తామనే అహంకారం పనికిరాదు. మనకంటె గ్రామదేవతలు అధికశక్తి కలవారు. వారిని తృప్తి పరచాలి. బ్రాహ్మణులు కూడా గ్రామదేవతలకు నైవేద్యాలర్పిస్తారు. శాస్త్రాలలో చెప్పని దానిని స్త్రీలనుండి, శూద్రులనుండి గ్రహించాలని స్మృతులే చెప్పాయి. ఈ మాట గ్రామదేవతారాధనను సమర్థిస్తుంది. వీటిని పూజించడం అనాగరికమని త్యజించకూడదు. కొన్ని అంటురోగాలను నివారించే శక్తులు వీటికున్నాయి.

మనలను ఇతరులు నిందిస్తున్నారని అనడం కంటె వారొకవిధంగా పొగుడుతున్నారనే భావిస్తున్నాను. ఒకవైపున అద్వైతం అన్నా బహుదేవతారాధనలు, పితృదేవతారాధనలు సాగినా, అందరికీ, అన్ని లోకాలలో నున్నవారికీ సేవలందిస్తున్నారు మనవారు. జగత్ కల్యాణం జరుగుతోంది. పైవి అన్నీ మతానికి బలం చేకూర్చేవే.

## లోభిత్వం సేవకు దారి తీస్తుంది

డబ్బును ఖర్చు పెట్టేటప్పుడు తన అవసరాలకై తాను లోభిత్వం వహించినపుడు అట్టివాడు, ఆర్థికంగా ఇతరులను ఆదుకొనగలడు. విలాసాలకై ఖర్చు పెట్టేవారి కోరికలకు అంతుండదు కనుక అట్టివారు దానం చేయలేరు. అప్పు చేసి పప్పుకూడు తినాలని అనుకునేవాడు ఎప్పుడూ ఋణగ్రస్తుడే ఔతున్నాడు.

అయితే లోభి తాననుభవించలేదు, ఇతరులకు దానం చేయదు కదా. తన అవసరాలకు మించకుండా ఖర్చు పెట్టేవాని దగ్గరే డబ్బుంటుంది. అట్టివానికి దానబుద్ధి ఉంటే వారు పుణ్యాన్ని సంపాదించగలరు.

పంట పండాలంటే ముందు క్షేత్రం మంచిది కావాలి. మట్టి ఏమిటి? బుద్ధి, పని చేసే ఇంద్రియాలున్నపుడు శరీరమనే క్షేత్రం పనికి వస్తుంది. సరియైన కాలమే ఇక్కడ అతని శక్తి. అపుడు ఈ శరీరమే ధర్మక్షేత్రమవుతుంది. కలుపు మొక్కలు లేకుండా ఉండాలి. అనవసరపు ఖర్చు ఇక్కడ అట్టిది. అట్లా ఉండగలిగితే ధర్మక్షేత్రమే.

## ఋణం, అందరికీ హానికరం

అనవసరపు ఖర్చు మాట విన్నారు. ఇక ఋణం చేయడం వల్ల తనకూ ఇబ్బందే, అప్పు చేయడం అలవాటైతే అది జాడ్యమౌతుంది.

శంకరులు తమ ప్రశ్నోత్తరమాలికలో దీనివల్ల ఆశౌచం (మైల) ఏర్పడుతుందని అన్నారు. కి మిహ ఆశౌచం భవేత్? దానికి జవాబు, ఋణం నృణాం అన్నారు. అనగా అప్పుచేయడమే మైలయని.

ఈనాడు ముట్టుమైలలను కలుపుకొని పవిత్రతకు భంగం కల్గిస్తున్నారు. నిన్న మొన్నటివరకూ ఎవరైనా పోయినా, ఎవరైనా పుట్టినా మైల, పురుడును పట్టేవారు. ఆలయాలకు ఈ మైలతో వెళ్ళి అపవిత్రం చేస్తున్నారని దానివల్ల అనర్థాలు వస్తున్నాయని లోగడ చెప్పాను. మైల ఉన్నవాణ్ణి ఎవ్వరూ సమీపించనట్లు అప్పు తీసుకొన్న వానికీ అందరూ దూరంగా ఉంటారు. అప్పు తీసుకొన్నవాడూ దూరదూరంగా కనబడకుండా ఉంటాడు కదా!

ఓటమి అంచులో ఉన్న రావణుడు ఋణగ్రస్తునిలా బాధపడ్డాడని కంబమహాకవి వ్రాసాడే. కనుక ఋణం తీసుకొన్నవాడు ఇచ్చినవాణ్ణి చూసి

భయకంపితుడై యుంటాడు. అబద్ధాలు చెబుతాడు. దొంగతనాలు తీర్చడానికై చేస్తాడు. వీడిస్తాడో లేదో అని ఇచ్చినవానికీ కంగారే.

కాని అప్పు పుచ్చుకొన్నవానికి చాలా సదుపాయాలు కల్పిస్తోంది నేటి ప్రభుత్వం. ఇవన్నీ ఓటు బ్యాంక్ రాజకీయాలే. అప్పు తీర్చడం మన ధర్మం అనే భావన ప్రజలలో కల్పించడం లేదు.

అప్పులిచ్చేవాడు కాబూలీ వడ్డీలు వసూలు చేయడం, హింసించడం జరుగుతోంది. తీసుకొన్నవారిని ప్రభుత్వం ఆదుకొనవలసి వస్తోంది. ఋణగ్రస్తులు ఆత్మహత్యలకు సిద్ధమౌతున్నారు. కనుక దీనిని మైలతో పోల్చారు శంకరులు.

సంఘసేవ గురించి చెప్పేటపుడు ఇతరులకు హాని చేయకుండా ఉండడమూ మంచిదే అన్నారు. క్రైస్తవులలో పది ఆజ్ఞలున్నాయి. చేయవలసిన వాటిని చెప్పడానికి బదులుగా చేయకూడని వాటిని చెబుతాయి.

అట్లాగే మన ధర్మాలలో 'అస్తేయం' దొంగతనం చేయకుండా ఉండుట, 'అపరిగ్రహం' ఎక్కువగా కూడబెట్టకుండా ఉండడం ఉన్నాయి. ఇవి రెండూ పాటించగలిగితే వారిలో లోభిత్వం, విచ్చలవిడిగా ఖర్చు చేయడం, ఋణాలు చేయడం తగ్గుతాయి.

## సేవ చేయడము ఋణమే

ఇతరులకు సేవ చేయడం ఋణమని చెప్పింది ధర్మశాస్త్రం. బ్రాహ్మణుడు మూడు ఋణాలతో పుడతాడని అవి దేవ, ఋషి, పితృ ఋణాలని అన్నారు. వాటినెట్లా తీర్చాలి? వేదాధ్యయనం వల్ల ఋషి ఋణం, యజ్ఞాలు చేయడం వల్ల దేవ ఋణం, సత్సంతానం కనడం వల్ల పితృ ఋణాన్ని తీర్చుకోవాలి. ఒకనికి అన్నం పెట్టడం, ఇతరులకు సేవ చేయడం యజ్ఞం. చుట్టు ప్రక్కలున్న

జీవరాసులకు అన్నం పెట్టడం భూత యజ్ఞం. ఇతర మానవులకు, పశు పక్షులకు చెయ్యవలసిన ఉపకారం అంతా ఋణపడడమే అని హెచ్చరించింది వేదమతం.

మనం ఒకనికి దానం చేయకపోవచ్చు, అప్పు అడిగినా తిరస్కరించవచ్చు. కాని మనం అప్పు చేసినపుడు తీర్చాలి కదా. అందువల్లనే వేదాలు, ఈ పంచమహాయజ్ఞాలను విధించాయి.

ఈశ్వరుడన్నీ ఇచ్చి మనలను సృష్టించడం వల్ల మనం అన్నీ అనుభవిస్తున్నాం. మనమూ సేవ చేసి ఋణాన్ని తీర్చక తప్పదు. అదీ ప్రేమతోనే. నిర్లక్ష్యంతో కాదు.

ఇట్టి భావన ఉంటే మనం క్లిష్టపరిస్థితులలో ఉన్నా ఇతరులకు సాయం చేయగలం. మనమే బాధపడుతూ ఉంటే ఎట్లా చేయడం అని ప్రశ్నించకండి. మన బాధలకు మన పూర్వకర్మలే కారణం కదా. ఇతరులకు సాయం చేయకపోవడం వల్లనే కదా మనకీ బాధలు? కష్టకాలంలో ఉన్నా సేవ చేయగలిగితే భావిజన్మలోనైనా సుఖంగా ఉండవచ్చని భావించాలి.

ఇలయంకూడి మారనాయనార్ అనే భక్తుడు తాను కష్టాలలో ఉన్నా ఇతరులను ఆదుకొన్నట్లుగా అతని చరిత్ర చెబుతోంది. ఇది ఉత్తమస్థాయి. ఋణాలు చేయకుండా తన అవసరాలకు మాత్రమే ఖర్చు పెట్టి దానం చేయటం మామూలు పద్ధతి.

## ఆదా చేయడమెట్లా

కాఫీ, పట్టు వస్త్రాలు, హోటల్‌లో ఉపాహారాలు, వివాహంలో ఆడంబరాలు, కట్న పిశాచం వంటి వాటికి దూరంగా ఉంటే చాలా ఆదా చేయవచ్చని చాలాసార్లు చెప్పాను.

# ఆచారములు

## ఆచారము

లోకంలో ఆచార వ్యవహారాలనే మాట ఉంది. పూర్వులనుసరించిన బాటను అనుసరించుట ఆచారం. తరతరాలుగా ఆచారం రావడంచే అది పెద్ద వృక్షమై, బలంతో ఉంటోంది. సంఘం శాస్త్రప్రకారం నడిచింది కనుకనే జ్ఞానం భక్తి మార్గాలలో కళలలో అత్యున్నత స్థానాన్ని గడించింది. ఈ దేశం మనకెంత చెడినట్లున్నా ఇతర దేశస్థులు ఆధ్యాత్మిక దాహాన్ని పోగొట్టుకుంటున్నారు. ఇదంతా ఆచార మహిమయే.

మన ఆచారాలలో ఇది కలుపుమొక్క ఇది పిచ్చి మొక్క పీకివేయండని సంస్కర్తలంటారు. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క ఆచారాన్ని పెకలించుకుంటూ పోతే ఇక మిగిలిన పంట ఎంత. ఎంతో బుద్ధితో, దయతో ధర్మశాస్త్రాలనందించారు ఋషులు. సాధ్యమైనంతవరకూ పాటించే శక్తినిమ్మని పరమేశ్వరుని ప్రార్థిద్దాం. ఈ సంస్కర్తలలో ఎందరు ఋషులు, అవతార పురుషులున్నారు. ఈశ్వర దూతలున్నారా? అందరి కష్టాలను పోగొట్టే వారెందరున్నారు? పూర్వం గురువులిచ్చే ఆశీస్సులు, ఆత్మానుభూతులు వీరివల్ల సాధింప బడతాయా? ఏనాడో పాతుకుపోయిన వృక్షాన్ని వీరికై నరకాలా?

సంప్రదాయం శాస్త్రవిజ్ఞానంపై, ఆత్మానుభూతిపై, ఆచరణపై ఆధారపడింది. అట్టి ఆచార్య పురుషుల ఉపదేశాలను ప్రక్కనబెట్టి ఏమి సాధించగలరని నా దగ్గరకు వచ్చిన పాశ్చాత్యులూ అంటున్నారు.

పూర్వాచార్యులు బాటలు వేసారు. సంప్రదాయాలు భిన్నంగా ఉండవచ్చు. వారు స్వార్థం లేకుండా అనుభూతితో చెప్పిన మాటలవి. ఇన్నాళ్ళు ఆ

బాటలలో నడిచి ప్రగతిని పొందుతున్నారు కదా. అంతా సమానత్వం అనే సంస్కర్తలను భౌతిక జగత్తులో ఉన్నవారు పొగడవచ్చు. వీరు ఆధ్యాత్మిక ప్రగతికి ఎంతవరకూ ఉపయోగిస్తున్నారు?

న్యాయాధీశుడు రాజకీయ పార్టీలకు చెందకుండా న్యాయం చెప్పినట్లుగానే నేనూ సనాతన ధర్మలక్షణాలను చెప్పడం ఆచరించడం నావంతు. మీకు నచ్చడం, నచ్చకపోవడం ఆచరణ సామర్థ్యాన్ని బట్టి యుంటుంది.

మతాల ఆచారాలు భిన్నంగా ఉండవచ్చు. అసలొక మతంలోనే భిన్నంగా ఉండవచ్చు. బౌద్ధంలో హీనయానం, మహాయానమని, క్రైస్తవులలో ప్రొటస్టంటులని, క్యాథలిక్కులని ఇస్లాంలో షియా, సున్నీ, మహమ్మదీయ భేదాలున్నట్లే హిందూమతంలోనే శైవ, వైష్ణవ, వైదిక, తాంత్రిక భేదాలున్నాయి.

దేశాలను బట్టి, శీతోష్ణస్థితులను బట్టి ఆచార భేదాలుంటాయి. ఉత్తర దేశంలో పూజారి, చొక్కా ధరించి పూజించడం వంటివి.

## సంప్రదాయ ప్రవక్తయే విముక్తి ప్రదాత

ఎక్కడ, ఏమతంలో పుట్టినా అందే శాఖలో జన్మించినా సంప్రదాయాల నేర్పాటు చేసిన పూర్వుల మాటలను పాటించడం మంచిది. లేకపోతే భ్రష్టత్వం వస్తుందని ఒక శ్లోకం:

**"శిఖాం సూత్రంచ పుండ్రంచ సమయాచారమేవ చ**

**పూర్వై రాచరితం కుర్యాత్ అన్యథా పతితో భవేత్"**

ఇందులో శిఖను గురించి – శిఖ ఎట్లా ఉండాలి. మహమ్మదీయులు తలను గొరిగించుకుంటారు. సిక్కులు గడ్డాన్ని పెంచుతారు. తలమీద జుట్టు ఉంటుంది. క్రైస్తవులు క్రాఫ్ చేసుకుంటారు. కాని హిందువుల శిఖను ధరించుట మంత్రపూర్వకంగా ఉంటుంది. ఇందులో రకరకాలున్నాయి.

సంబూద్రీలు, దీక్షితార్‌లు, మిగిలినవాళ్ళు ధరించేవి భిన్నంగా ఉంటాయి. కొందరు ఊర్ధ్వ శిఖ కలిగి, కొందరు పూర్వశిఖ కలిగి యుంటారు.

ఇక సూత్రం గురించి:- సూత్రం అంటే ఇక్కడ యజ్ఞోపవీతమని అర్థం కాదు. మహర్షులు అనేక సూత్రాలనందించారు. ఆశ్వలాయన, ఆపస్తంబ బోధాయన సూత్రాలు మొదలైనవి ఉన్నాయి. ఇవి కర్మానుష్ఠాన నియమాలు చెప్పేవి.

పుండ్రం - నుదుటిపై కొందరు విభూతి, గోపీచందనం, నామం, నల్లనిచుక్క మొదలైనవి వారివారి ఆచారాలను బట్టి ధరిస్తారు.

సమయాచారం - అనగా మతసంబంధమైన క్రియాకలాపాలు. అనేక తరాల నుండి వచ్చే మతానుష్ఠానం ఇందుంటుంది. ఒక దేశంలో పుట్టాడంటే ఏదో అనుకోకుండా జరిగింది కాదు, అది ఈశ్వర సంకల్పానుగుణంగానే ఉంటుంది. అందుకే పూర్వులాచరించినది చేయండని ఆదేశం.

పూర్వైరాచరితం కుర్యాత్... అనగా పై శిఖాదులును ఆచరింపుమని లేదా భ్రష్టత్వమని తరువాతి మాట. పాతివ్రత్యాన్ని విడిచిపెట్టిన స్త్రీని పతితయని అంటున్నారు. భర్త నెట్లా మోసం చేసిందో వీడు కూడా ఈశ్వరుణ్ణి మోసం చేసి పతితుడై అధమ జన్మను పొందుతాడు. ఈ మతాన్ని విడిచి పెడతానన్నవాడూ పతితుడే.

కనుక ఇట్టి పరిస్థితులలో సంస్కర్తలు చెప్పే తీయని మాటలను పరికించండి. ఇవి సద్గతిని కల్గిస్తాయా లేదా అని ఆలోచించండి.

## అనుభవంలోకి గురుత్వం

పరంపరగా వచ్చే ఆచారంలో గురుత్వం ఉంటుంది. అట్టి సంప్రదాయాన్ని గౌరవించి పాటిస్తే మనస్సు, ఇంద్రియాలు అదుపులో ఉంటాయి. అపుడు

చిత్తశుద్ధి ఏర్పడుతుంది. చీటికిమాటికి ఎందుకు? ఏమిటి? ఎలా? అనే వేసే ప్రశ్నలకు అంతం అంటూ ఉండదు సరికదా క్రొత్త వాటిని ప్రవేశపెట్టలేము కూడా. గాంధీవంటివారు సాదాసీదా జీవితం గడిపి ప్రాచీనాచారాలను పాటించినవారే. కాని అట్టివారు కూడా కొన్ని పాత అచారాలకు స్వస్తి చెప్పి క్రొత్తవాటిని ప్రవేశపెట్టడం వల్ల చెడు ఫలితాలు రావడం చేత వాటి లోపాలను బహిరంగంగా వెల్లడించారు.

## సంస్కరణలు - క్రమశిక్షణా రాహిత్యం

ప్రాచీనాచారాల వల్ల మన స్వాతంత్ర్యానికి భంగం వస్తోందని ఎవరైనా సంఘసంస్కర్త అనినప్పటికీ ఈ క్రొత్తవాటినీ పాటించకుండా ఉంటారు. అతడు స్వయం ఆచార్యుడై అనగా తనను తాను గురువని ప్రకటించుకొన్నా, నువ్వు మమ్మల్ని ప్రాత ఆచారాలనుండి విముక్తులను చేసావని అంటున్నావు, నీ నియమాలనూ మేము ఉల్లంఘిస్తాం అని తిరగబడతారు.

ఇట్లా స్వేచ్ఛ పేరుతో క్రమశిక్షణారాహిత్యాన్ని ప్రోత్సహించకండి.

## గీత చెప్పిందేమిటి?

అందువల్లనే గీతలో, పూర్వాచారాలలో ఒకటి రెండు తప్పనిపించినా అట్టి విషయాలలో కలుగజేసుకోవద్దని ప్రజలలో గందరగోళ పరిస్థితిని తీసుకొని రావద్దని సాధారణంగా సామాన్యులు అజ్ఞానంలో ఉంటారని, చెప్పింది. కనుక సంఘంలోని పెద్దలు శాస్త్రాచారాలను పాటిస్తూ ఆదర్శవంతంగా ఉండాలని అన్నాడు. కొన్ని ఆచారాలు, కర్మలు అవసరం లేని వారనుకొన్నా, వాటికి అతీతులైనా శాస్త్రవిరుద్ధంగానే ప్రవర్తిస్తే మిగిలిన సామాన్యులూ వారి మార్గాన్ని త్రొక్కుతారని ఉంది కూడా:

న బుద్ధి భేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినాం

జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్ (3-26)

గీతను గురించి చాలామంది ప్రసంగిస్తూ ఉంటారు. కొన్ని శ్లోకాలపై దృష్టి పెట్టరు. ఒకటి చూడండి. ఇది చేయదగినది, ఇది చేయదగనిదీ అని నీవు నిర్ణయించవద్దు. శాస్త్రాలను చూడు. అవే ప్రమాణములు. అందు చెప్పబడినవాటిని ఆచరించు. వద్దన్న వాటిని ఆచరించకమని స్పష్టంగా ఉంది.

**తస్మాత్ శాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ**

సంస్కర్తలు ఈ మాటలను పట్టించుకోరు. అంతేకాదు. ఇట్టి ఉపదేశాలను ఎవరో చేర్చారంటారు.

## సంఘ సంస్కర్తలు

ఈ సంస్కర్తలు వ్యక్తిగత జీవితాలలో సత్యాన్ని పాటించుట, సత్ప్రవర్తన, త్యాగం, ప్రజల పట్ల ప్రేమ కలిగినవారని నేనూ గుర్తించకపోలేదు. అందరూ విద్యావంతులే. ప్రజలను సన్మార్గంలో పెట్టాలనే తహతహ కలిగినవారే. చిక్కెక్కడ వచ్చిందంటే వారికి బుద్ధికి తోచిందే నిజమని, మిగిలినదంతా అబద్ధమని భావించడంలోనే ఉంది. వేద శాస్త్రాలనందించిన పూర్వాచార్యులు తమకంటె పవిత్రులని జ్ఞానం కలిగినవారని వారు గుర్తించలేదు. శాస్త్రంలో చెప్పిన అదృష్ట ఫలాన్ని అనగా ప్రత్యక్షంగా కనబడని దానిని గురించి నమ్మరు. ప్రత్యక్ష ఫలాలనే నమ్ముతారు.

ఒక మహాశక్తి మనలను నడిపిస్తోంది. అది ఒకప్పుడు వెంటనే ఫలాన్ని చూపదు. గుర్తించేటట్లుగా కనబడదు. కొన్ని కర్మలు వెంటనే కొన్ని కాలాంతరంలో, జన్మాంతరంలో ఫలిస్తాయి. దానినే అదృష్టమంటారు. దీనిని

వీరు నమ్మరు. పాశ్చాత్య విధానంలో ఆరితేరిన వారవడం వల్ల వారి ఆలోచనా ధోరణులలోనే వీరూ వాదిస్తారు. కర్మలవల్ల మానవులలో భేదాలను చూడరు. అంతా సమానత్వం అంటూ వాదిస్తారు. కనుక అదృష్ట ఫలాలనిచ్చే యజ్ఞ యాగాదులను, తర్పణాలను, పితృకర్మలను మూఢ విశ్వాసాలుగా పరిగణిస్తారు. కర్మ ఫలదాత, ఈశ్వరుడని నమ్మరు. తాము తెచ్చే సంస్కారాల ఫలాలను తాము బ్రతికి యుండగానే చూడాలని భావిస్తారు. నేనీ జగత్తును మారుస్తాననంటాడొకడు. ఇట్టివారిని గురించి గీత ఇట్లా చెప్పింది:

**ఇద మద్యమయా లబ్ధం ఇదం ప్రాప్స్యే మనోరథం - 16-13**

అనగా నేడిది నావల్ల సంపాదింపబడింది. ఈ కోరికను పొందగలను అని ప్రపంచం వ్యవహారాలలో మునుగుతారు. వారికి శాస్త్రాచారాలతో పనిలేదు:

**న శౌచం నాపి చా చారః (16-7)**

అనగా శుభ్రత, సన్మార్గం వారిలో ఉండవని అర్థం. ఉపనిషత్తు కూడా ఇట్లాగే చెప్పింది. నేను బుద్ధిమంతుణ్ణి, నేను విద్వాంసుణ్ణి అని భావించి ఇతర లోకాలు లేవనేవారు, తాము గోతిలో పడడమే కాకుండా ఇతరులను గోతిలోకి నెట్టివేస్తారని చెప్పింది. గమ్యంలేని బ్రతుకులవి.

## నాయకులు - అనుయాయులు

ఈనాడు మతాచారాలు వేరని, నైతిక ప్రవర్తన వేరనే అభిప్రాయాన్ని వ్యాప్తి చేస్తున్నారు. ఈ రెంటిని మనం భిన్నభిన్నంగా చూడం. శాస్త్రాలట్లా చెప్పలేదు కూడా. మనం ఆచారాలకు కట్టుబడితే ఛాందసులని అంటున్నారు. ఇవి కనబడని వాటిని గురించి చెబుతాయని, దీని నాధారంగా కర్మలు, ధర్మాలని అన్నారని, ఇవన్నీ పిచ్చి నమ్మకాలని పాశ్చాత్యుల మాటలకు మన వారూ వంత పాడుతారు.

నేటి నాయకులు కర్మకాండలపై నమ్మకం లేకపోయినా నైతికమైన వాటికి ప్రాధాన్యం ఇస్తున్నారు. వారు నైతిక సూత్రాలను జోడించి క్రొత్త మతాలను స్థాపిస్తున్నారు. ఇక వీరిననుసరించిన వారి మాట ఏమిటి? వారి నాయకులలో ఒక నిబద్ధత, ఒక సిద్ధాంతం, విజ్ఞానం, అనుభవం, పరిపక్వత ఉండగా వీరి అనుయాయులలో అవి ఏమీ లేవు. కాని శాస్త్రీయమైన ఆచారాలనే విడిచిపెట్టి వారి అర్హతలను మంట గలిపారు. వీరు ఆచారాలను, నైతికమైన విలువలకూ తిలోదకాలిస్తున్నారు.

మతం యొక్క కబంధ హస్తాలనుండి దూరంగా ఉండండని వారనగా సామాన్యులకు స్వేచ్ఛ వచ్చి అన్నిటిని వదిలేస్తున్నారు. సంస్కృతంలోనే కర్మకాండలెందుకు జరగాలని సంస్కర్తలనగా వీరి అనుయాయులు హిందీనే జాతీయ భాషగా ఎందుకు చేయాలని ప్రశ్నించడం లేదా? ఆ వ్యతిరేక ఉద్యమ వల్ల ఎంత నష్టం జరిగిందో తెలియదా? సత్యాగ్రహం, సహాయ నిరాకరణోద్యమని తెల్లదొరలు పాలించినపుడన్నారు. వారిని తరిమికొట్టడమే ఆ ఉద్యమ లక్ష్యం. ఆ ఆయుధాలనే నేడు వాడి ప్రతి చిన్నవాటికి ఆందోళనలు రేపి ప్రజలను అల్లకల్లోలం చేయడం లేదా? ప్రజలనెట్లా మేల్కొల్పాలో తెలియక ముందు చూపులేక సాగిన ఉద్యమాలవి.

ఒక కథ: అప్పిచ్చినవాడు, పుచ్చుకొన్నవాడిపై దావా వేసాడు. పుచ్చుకొన్నవాడి న్యాయవాది, విచారణలో పిచ్చివాడిగా ప్రవర్తించమని, ఏ ప్రశ్న అడిగినా బే, బే అనమని సలహా ఇచ్చాడు. ఆ మాటకు అర్థం లేదు కదా! ఆ మాట నమ్మి ప్రవర్తిస్తే వాడికి అనుకూలంగా తీర్పు వచ్చింది. నెగ్గించాను కదా, నా డబ్బు మాటేమిటని న్యాయవాది అన్నాడు. అపుడు నేరస్థుడు నీకు బే, నీ అబ్బకు బే అన్నాడు.

శాస్త్రాలను వినకండి, మా మాటలను వినండని సంస్కర్తలన్నారు కదా. దానినిబట్టి సామాన్యులు అన్నిటికీ మంగలం పాడారు. అట్టి సంస్కర్తలను

పూర్తిగా బహిష్కరించారు కొందరు. మేము మిమ్మల్ని బహిష్కరిస్తున్నామని క్రొత్త సంస్కర్తలు బయలుదేరి క్రొత్త మతాలను స్థాపించారు.

## ప్రత్యక్ష సాక్ష్యం

ధర్మశాస్త్రం గురించి యున్న నియమాలు అవిచ్ఛిన్నంగా కొన్నివందల సంవత్సరాలనుండి సాగుతున్నాయి. ద్వైతాద్వైత విశిష్టాద్వైత భేదాలుండవచ్చు. ఏ ప్రవర్తకుడూ క్రొత్త ధర్మశాస్త్ర గ్రంథాన్ని వ్రాయలేదు. అందరూ ఆపస్తంబ, అశ్వలాయన మొదలైన సూత్రకారుల మాటలనే అనుసరించారు. అందు కొందరు క్రొత్త క్రొత్త ఆచారాలను చేర్చారు.

రాజకీయ పార్టీలవారికి ప్రత్యక్షమైన ప్రణాళికలున్నాయి. మత సంస్కరణలు చేసేవారూ రెండు మూడు వర్గాలుగా చీలిపోయారు. వీరిలో నిలకడ లేదు. ఇవి తపస్సు పై ఆధారపడినవి కావు. సిద్ధాంతం సత్యంపై ఆధారపడినపుడు తపశ్శక్తి దానికి తోడ్పడితే దేనికైనా బలం చేకూరుతుంది. అట్లా ఉంది కనుకనే కొన్నివేల సంవత్సరాలనుండి వైదిక ధర్మం, ఋషులవల్ల పరిరక్షింపబడింది. ఈనాడెన్ని సంఘ సంస్కరణ ఉద్యమాలు వచ్చినా, మత సంస్కరణలను ప్రవేశపెట్టినా, అందు ప్రవేశించే వారు తక్కువమందే.

ఆచారాలను విమర్శిస్తున్నా లోలోపల ఆచరించేవారే ఎక్కువమంది. వారి జీవితంలోనే కొన్ని అంధవిశ్వాసాలుంటాయి. అంధవిశ్వాసాలన్నవారే ఎన్నికలలో నిలబడినపుడు, ముహూర్తాలు చూసుకోవడం లేదా?

## ఒక్కటీ చాలు

పురాతనాచారాలు కావాలా? నేటి సంస్కరణలు కావాలా? అసత్ప్రవర్తన, దొంగతనం, మోసం, హత్యలు, వ్యభిచారం ముందు కాలంలో ఎక్కువగా ఉన్నాయా చూడండి, మీకే తెలుస్తుంది. ఏఛాందస భావాలలో ఆనాటి వారుండేవారో ఆనాడే సరియైన ప్రవర్తన ఉండేది కదా!

## పవిత్రమైన మనస్సు - బాహ్య వ్యాపారాలు

మనస్సు పవిత్రంగా ఉంటే సరిపోతుంది కదా. ఈ బాహ్యవ్యాపారాలెందుకు? అని సంఘ సంస్కర్తలు ప్రశ్నిస్తారు.

మనస్సును పట్టించుకోకపోతే అది ఇష్టం వచ్చినట్లు గంతులు వేస్తుంది. మనస్సు స్తిమితంగా ఉండడం ఏ ఒక్కనికో చెల్లింది. భగవత్సేవలోనో, సంఘసేవలోనో లగ్నమైనపుడు మాత్రమే దానిని పెక్కుమంది అదుపులో పెట్టగలరు. అందుకే ఆచార, అనుష్ఠానాలని అన్నారు. జపం చేసినా, స్తోత్రాలను పఠించినా కొంతసేపే నిలకడగా ఉంటుంది. అందుకే కర్మకాండను జోడించారు. ఇందు మాట, మనస్సు, శరీరం అదుపులో ఉంటాయి. మంత్రాలను చదువుతూ హోమం, అర్చనలో సహస్రనామ పారాయణం అట్టివే.

కేశవ నామాలను పలుకుతున్నప్పుడు మనస్సు లగ్నం కాదు. అందుకే అట్టి నామాలను ఉచ్చరిస్తూ ఆ పన్నెండు నామాలను తిరుమణితో (పవిత్రమైన మట్టితో) శరీరంపై పెట్టుకొమ్మని అన్నారు. త్రివిక్రముడే విశ్వాన్ని కొలచినవాడు. అతడే శ్వేతవరాహమై తెల్లని దంతాలతో భూమిని ఉద్ధరించాడు. ఈ దంతాలతో స్పృశింపబడిన నేలలోనే తెల్లని మట్టి లభిస్తుంది. ఆ మట్టిని తిరుమణి అంటారు. తులసి మొక్క క్రిందనున్న మట్టి, పవిత్రమే. ఆ మట్టిని నీళ్ళల్లో కలిపి ఒంటికి పూసుకొనినపుడు, స్వామీ! నీ స్పర్శచే పునీతమైన మట్టిని ధరిస్తున్నానయ్యా అనే భావన కల్గుతోంది.

ఆధ్యాత్మిక సాధనలో ధ్యానంలో ఉన్నపుడు మాట, పని కూడా ఆటంకంగా ఉంటాయి. అపుడు స్తోత్రాలను, మంత్రపఠనాదులనూ ఆపాలి. ఒక్క ఉదాహరణ చూడండి. కప్ప నీళ్ళల్లో గ్రుడ్డు పెడుతుంది. గ్రుడ్డును

పెకలించుకొని వచ్చిన పిల్లలు చేపలు మాదిరిగా నీళ్ళల్లో ఉంటాయి. అపుడు ఊపిరితిత్తులకు ఇంకా బలం రాదు. చేపల మాదిరిగా నీళ్ళల్లోని ప్రాణవాయువును మాత్రమే పీల్చగలవు. కొంతకాలం పోయిన తరువాత ఊపిరితిత్తులు వస్తాయి. బైటనున్న గాలిని పీల్చగలవు. అట్లాగే ఉన్నతస్థితి వచ్చేవరకూ కర్మకాండలు, మంత్ర పఠనాదులూ తప్పవు. కప్పకు పుట్టిన వెంటనే ఊపిరితిత్తులు రావడం లేదు కదా!

కనుక పై పై ఆచారాలు, గుర్తులూ ఉంటే ఎట్టి చిహ్నాలు లేని, ఎట్టి క్రియలేని తత్త్వాన్ని ఒంటబట్టించుకోగలం. కాని ముందే ధ్యానమంటే కుదరదు. అది నిలబడదు. ప్రాథమిక దశలో ధ్యానం బదులు, నిద్ర ముంచుకు వస్తుంది.

క్రమశిక్షణ లేకపోతే పవిత్ర మనస్సు లభించదు. మేము మనశ్శుద్ధికే ప్రాధాన్యం ఇస్తామని ఆధునికులంటే అది ఏ కొద్దిమందికో లభిస్తుంది. అందరికీ కాదు. కనుక క్రమశిక్షణతో ఈ సంస్కరణలు బయలు దేరలేదని నేనంటే మీరంగీకరించరని తెలుసు.

ఇక నాస్తికుల మాట అట్లా ఉంచండి. అట్టివారు కొద్దిమందే. ఇక ఆస్తికులై సంస్కరించాలనే భావం కలిగినవారు వేదరహస్యార్థం మాకు తెలుసు, ప్రాచీనమైన కర్మకాండలకు అనుగుణమైన వేదవ్యాఖ్యానాన్ని అవతలకు బెట్టి క్రొత్త అర్థం, నిజమైన అర్థాన్ని చెబుతున్నామని కొందరు బయలుదేరారు. నానా కళ్మలం చేస్తున్నారు. వారే త్రిశంకు స్థితిలో ఉండి మిగిలినవారిని క్రిందకు త్రోసివేస్తున్నారు. ఏమీ తెలియనపుడు ఈశ్వరుని పట్ల భయభక్తులుండాలి కదా! ధార్మికంగా జీవించాలి కదా! ఇంతకు ముందున్న వారు పూర్వాచారాలను పాటిస్తూ వినయంతో ఉండేవారు. క్రొత్త క్రొత్త సంస్కరణల పేరుతో అల్లకల్లోలం సృష్టిస్తున్నారు. ఒకడు, మరొకని ఒద్దికలో ఉండాలనే మనస్తత్వం పోతోంది. హక్కుల పరిరక్షణ పేరుతో స్వార్థం చోటు చేసుకుంటోంది.

మేమీ మతాన్ని రక్షిస్తున్నామని, నమ్ముతున్నామని అనేవారు మత రాహిత్యాన్ని ప్రోత్సహిస్తున్నట్లుగా ఉంది.

## ఆధునికమైన అంధవిశ్వాసాలు

ఆధునికులు కొందరు అదృష్ట ఫలాన్ని ఒప్పుకోకపోయినా కొన్నింటిని తాము సృష్టించుకొని సంబరపడతారు. ఉదా: జైహింద్ అనడం. దీనివల్ల వెంటనే ఫలం కన్పిస్తోందా? అట్టి నినాదాల వల్ల దేశం సౌభాగ్యవంత మౌతోందా? మంత్రాలమీద నమ్మకం లేనివారు జైహింద్‌ని మంత్రంగా భావిస్తారు.

ఇట్టిది మనదేశంలోనే కాదు, ప్రతి దేశంలోనూ ఇంతే. ఎక్కడ, నమ్మకం పోయి తర్కానికి బలం వచ్చిందో అక్కడా అంతే. జెండా గురించి ఆలోచించండి. అది బట్టలో చిన్న ముక్క. దానినెవరైనా చింపితే నేరం. దృష్టఫలం కన్పిస్తోందా? ఇక కారాగారంలో బంధిస్తారు. బంధింపబడడం వల్ల ప్రత్యక్ష ఫలం కన్పించింది. మంత్రాలనుచ్ఛరించి ప్రాణ ప్రతిష్ఠ చేసి ఆ విగ్రహాన్ని పూజిస్తున్నాం. ఇట్లా పూజించడం తప్పంటూ ఒక గుడ్డముక్కను తీసుకొనివచ్చి ఇది జాతికి ప్రతినిధియని ప్రచారం చేస్తున్నాం. అట్టి దానిని చింపితే నేరంగా పరిగణించడం లేదా? పుణ్యకాలం గురించి, పుణ్యక్షేత్రం గురించి హేళన చేసేవారు బుద్ధ జయంతియని, అంబేద్కర్ జయంతియని జరుపుకోవడం లేదా. అవీ ఏ కాంచీ పురంలోనో జరుపుతున్నామంటూ ప్రచారం చేస్తున్నారు. త్యాగరాజ సమాధి, లేదా సదాశివ బ్రహ్మేంద్రుల సమాధి దగ్గర ఏ ఏడాదికో ఒక రోజున ఆరాధనోత్సవాలు జరుపుతాం. కాని పైవారు వారి నాయకుల సమాధులను రోజూ పూజిస్తారు. నాస్తికులైన శాసనసభ్యులు ప్రమాణ స్వీకారం రోజున ఏ గుడికీ వెళ్ళరు. కాని ఆ రోజు తమ ప్రియతమ నాయకుల సమాధులను సందర్శిస్తారు. నల్లబ్యాడ్జీలు

ధరించడం, నినాదాల అట్టలు పట్టుకొని తిరగడం, పాదయాత్రలు చేయడం మొదలైనవాటిని తప్పుగా ఎంచకుండా ఎవరైనా భజనలు చేసినా, వాద్యాలతో నామసంకీర్తన చేసినా వేళాకోళం చేస్తారు. రాజకీయ ప్రయోజనాలకోసం ఎవడైనా కిరోసిన్ పోసుకొని నిప్పంటించుకుంటే అట్టి వానిని త్యాగియని కీర్తిస్తారు. అట్టిది ఒక్క ధర్మానికే మతానికో చేస్తే మూర్ఖత్వం అంటారు.

ఆచారాలను విడిచిపెట్టడం వల్ల విపరీతమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తూ ఉండే అట్టివారికి ఇహమూ లేదు, పరమూ లేదు.

వారనుకొనునట్లు మతం మత్తుమందు కాదు. ఇంద్రియాలవల్ల వచ్చే మత్తును విదిలించడానికి ఉపయోగించే మందు వంటిది మతం. ఈ ప్రపంచం సత్యం, దీని కంటె మరొకటి లేదు, 'అనుభవించండి' అనే మత్తు మందువల్ల జోగుతున్నారు.

## దేవుడు - మతం - ధర్మం

భగవంతుడనేమాట ఎప్పుడైతే మరిచిపోయామో ధర్మమూ ఎగిరి పోయింది. మేము దేవుణ్ణి ఆత్మను నమ్ముతున్నామని, ఆచారాలను పట్టించుకోమన్న సంస్కర్తల వల్ల లాభం చేకూరదు. ఋషులు శాస్త్రాలనందించినా, ప్రవక్తలు బైబిల్, ఖురాన్‌లను అందించినా ఆధ్యాత్మిక శక్తివల్లనే. వాళ్ళ మాటలను పాటిస్తే ధర్మమార్గంలో, సన్మార్గంలో నడవగలం. ఏ మనిషిని ఏ దేశంలో, ఏ కాలంలో పుట్టాలో నిర్దేశించేవాడు పరమేశ్వరుడేనని నమ్మితే చాలు. దానినే సమయాచారమన్నారు. దానినే పూర్వులాచరించారని ఆచరించండని: 'సమయాచారమేవ చ పూర్వైః ఆచరితం కుర్యాత్' అన్నారు.

అనుసరించకపోతే పతితుడౌతాడని 'పతితో భవేత్' అని అన్నారు.

## నాయకుని ధర్మం - గీతోపదేశం

గీత ఏమని చెప్పింది? ఆచారాలు, సంప్రదాయాలు నీకక్కరలేకపోయినా వాటిని నీవు ఆచరింపకపోయినా, ఇతరులు నీవల్ల చెడిపోతారు. ఎందుకంటే నీవు చేరిన ఉన్నత స్థితిలో వారు ఉండకపోవచ్చు కనుక. అజ్ఞానులు కర్మములో ఆసక్తులై ఎట్లా కర్మను ఆచరిస్తూ ఉంటారో, జ్ఞాని కూడా లోక కల్యాణం కోసం కర్మ చేయవలసిందే అని అంటూ కర్మలందాసక్తి కలవారికి బుద్ధి భేదాన్ని కల్గించవద్దని గీత హెచ్చరించింది:

"సక్తాః కర్మణీ అవి ద్వాంసో యథాకుర్వంతి భారత
కుర్యాత్ తథాఽసక్తః చికీర్షుః లోక సంగ్రహం
న బుద్ధి భేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినాం"

సామాన్యులు కర్మల పట్ల ఆసక్తిని చూపిస్తారు. ఆత్మయని, జ్ఞానమని పెద్ద పెద్ద ఉపదేశాలు వారివద్ద చేయవద్దు. చేసే కర్మలవల్ల కొన్నిచోట్ల దృష్టఫలం కొన్నిచోట్ల అదృష్టఫలం లభిస్తాయి. యజ్ఞ యాగాలు చేయడం వల్ల వర్షాలు పడడం, పంటలు పండడం వంటి కనబడే ఫలాలుంటాయి. చివరకు స్వర్గ ప్రాప్తి. అందుకూడా సుఖమే కాని మోక్షం మాత్రం లభించదు. కనుక స్వర్గాన్ని పొందడం కర్మల లక్ష్యం. వీటివల్ల చిత్తశుద్ధి ఏర్పడుతుంది. మనస్సు పరిపక్వమై శాశ్వత సుఖం ప్రాప్తిస్తుంది. అట్టి ఆత్మజ్ఞానం కలిగినవారు యాగాదులను తగ్గిస్తారు. అయినా లోక సంగ్రహం కోసం పనులు చేస్తారు. రామేశ్వరం వెళ్ళమని, రావి చెట్టు చుట్టూ ప్రదక్షిణాలు చేస్తే సంతానం కల్గుతుందని, సూర్య నమస్కారాలు చేస్తే కంటి బాధలు పోతాయని; కనకధారాస్తవం చేస్తే డబ్బు వస్తుందని ఇట్లా అనేకోపాయాలను, కర్మలను శాస్త్రాలు చెప్పాయి. ఫలాలు వస్తాయనే అందరూ చేస్తారు.

ఇట్టివారిని 'సక్తాః కర్మణ్యవిద్వాంసః' అని అన్నాడు. అట్టివారికి వేదాంతోపన్యాసాలు గిట్టవు. ఆధ్యాత్మ విద్యతో సంబంధం లేనివాటిని వారికుద్దేశించి చెప్పబడ్డాయి. వారు తొందరగా వచ్చే ఫలాలను పొంది, చిత్త శుద్ధియనే మహాఫలాన్ని క్రమ క్రమంగా పొందుతారు.

అది సరియైన మార్గం కాని, సమత్వం, హక్కులు అని కేకలు వేసేవారివల్ల మనస్సు పవిత్రం కాదు సరికదా అపవిత్రమౌతుంది కూడా.

## మూడు భిన్న సిద్ధాంతాలు

ప్రపంచ సుఖాలకై సూత్రాలనందించింది మతమనుట ఒకటి. ఉన్నతలక్ష్యం కోసం, చిత్తశుద్ధి కోసం కర్మలు చేయాలనడం మరొక పద్ధతి. శాస్త్రీయ దృక్పథం, ఆత్మగౌరవం కావాలి కనుక మతాన్ని సంస్కరించాలని చెప్పడం మరొక పద్ధతి. ఈ సంస్కరణలలోనూ రెండు పద్ధతులున్నాయి. ఆధ్యాత్మికతతో సంబంధం లేక కేవలం భౌతిక సుఖాల కోసం ప్రయత్నించాలనుట. దీనికి రాజకీయ సంబంధం ఉంది. ఆధ్యాత్మిక జ్ఞానాన్ని అందరికీ అందుబాటులోకి తీసుకొని రావాలని అనడం మరొకటి. వీరిద్దరూ మనుష్యులలో ఏ భేదభావం చూపించకూడదని అందరూ ఒకటే అని అంటారు.

ఇద్దరూ సాంఘిక సమానత్వం కావాలంటారు. అందులో ఒకరు ఆచారాలను ఆధ్యాత్మిక ఉన్నతికై మార్చాలని అనగా; ప్రపంచ సుఖాల కోసమే ఆచారాలను మార్చాలని మరొకరు అంటారు.

## ప్రపంచ సుఖాలకై సంస్కరణలు

పై రెండవవారు విద్యార్థి ఉద్యమాలు, స్త్రీలకు స్వేచ్ఛ, కార్మిక సంక్షేమం మొదలైనవాటిని రాజకీయ ధోరణిలో మాట్లాడుతారు. ఎవరేది మాట్లాడినా

అంతా రాజకీయమై పోయింది. మతంలో కూడా ఆ రాజకీయాలు చోటు చేసుకున్నాయి. ఇదొక దురదృష్టం. వీరు భౌతిక సుఖాల అభివృద్ధి గురించే మాట్లాడతారు. ఇందులో భాగంగా సమ్మెలు, సంఘర్షణలు, వర్గాల మధ్య పోరు మొదలైనవాటితో ఉంటాయి.

ఇక వీటికి, సంతానం కలగడానికి శాస్త్రం చెప్పిన మార్గాలకు తేడా ఏమిటి? రెండూ భౌతిక సంపద కోసమే కదా! భౌతిక జీవన అభివృద్ధి కోసం మత కార్యక్రమం ఉంటే అందులో దేవుని ప్రస్తావనవస్తుంది. ఇట్టి పనులలో లేదా కోరికలలో ఈశ్వరుడు, దేవత, శాస్త్రాల పెద్దల మాటలు మొదలైనవి ఉంటాయి. అనగా ఈశ్వరశక్తి సాయం వల్ల తమ భౌతిక ప్రయోజనాలు నెరవేరుతున్నాయనే భావన ఉంటుంది. పోను పోను ఈశ్వరార్పణ భావన ఉంటుంది. చిత్తశుద్ధికి వెసులు బాటుంటుంది.

ఫలాలనాశించి కర్మకాండలను చేస్తున్నాం. అవి ఫలించకపోయినా ఎక్కువగా నిరాశ చెందడం లేదు. అన్నీ కర్మననుసరించి జరుగుతాయని తృప్తి పడతాం. ఫలించకపోవడం కర్మవల్ల అని; ప్రాయశ్చిత్తం చేసుకోవాలని భావించి మనలను మనం ఓదార్చుకొంటాం. ఇట్లా కోరికలు కూడా సన్మార్గానికి దారి తీస్తాయి. ఏమీ ఫలించడం లేదని ఇట్టి ఆరాధన తప్పని నాస్తికులుగా సాధారణంగా మారరు.

అటువంటి అపజయాలు సాంఘిక కార్యక్రమాలలో వస్తే అనగా మత సంబంధం లేని పనులను చేయవలసి వస్తే మరొక తీవ్ర ఆందోళనకు దిగుతారు. ద్వేషాలు పెరుగుతాయి. ఇట్టి భావనలు మనస్సును కలుషితం చేయడం లేదా?

ఇక భగవంతునితో మిళితమై కొన్ని కర్మలను చేసినప్పుడు ఫలిస్తే భగవానునకు కృతజ్ఞత చెబుతాం. అతనిపట్ల ప్రేమ, భక్తి వృద్ధి పొందుతాయి. ఇక మామూలు ఆందోళనలు చేసినవారు విఫలురైతే మన సత్తా ఏమిటో

చూపిస్తాం, అవతలివారిని పడగొడతాం అని శత్రుత్వాన్ని పెంచుకొంటాం. ఇదీ తేడా.

## ఆధ్యాత్మిక లక్ష్యాలు

ఇంతవరకు సాంఘిక సంస్కరణల గురించి మాట్లాడాను. ఇక మత సంస్కరణలు చేసేవారు. వీరందరూ ఛాందసాన్ని, మూఢ విశ్వాసాలను తరమాలని బోధిస్తారు. ఇదంతా అందరూ ఒకటే అనే భావనలో ఈ క్రొత్త మతాలను స్థాపించినవారు విధించిన నియమాలను కొన్నిచోట్ల కొంతమంది పాటిస్తారు. కొంతమంది అసలు పాటించరు. ఇక చాలామంది తమ నాయకుల జన్మదినాలను జరుపుకోవడం, పత్రికలలో ప్రచారం, వారినుద్దేశించి స్టాంపులు ప్రచురింపజేయడం, పుస్తకాలు వ్రాయడం మొదలైనవాటితోనే తృప్తి పొంది నిత్యజీవితంలో పూర్వాచారాలనే పాటిస్తారు.

ఇక క్రొత్త మతాలలో చేరనివారు కూడా ఇట్టివారికి జైకొడుతూ ఉంటారు. అంటే తాము నమ్మినవాటిల్లో ఐకమత్యాన్ని పొందరు, క్రొత్తమార్గాల్లో చేరకుండా పాత ఆచారాలే పాటించే వారు పూర్తిగా ఉంటారన్నమాట. వారికొక నిశ్చితమైన అభిప్రాయం లేదన్న మాట. ఇట్లా ఉన్నవారు తాము నమ్ముకొన్న మతానికి ద్రోహం చేసినట్లే కదా.

దీనికంతటికీ కారణం ఆధునిక మతనాయకులే.

## ఆధునిక మతనాయకులు - ప్రత్యేక వర్గంగా లేకపోవడం

క్రొత్తగా వచ్చిన బ్రహ్మసమాజం, ఆర్యసమాజం, దివ్యజ్ఞాన సమాజం మాదిరిగా కాకుండా క్రొత్త స్వాములు బయలుదేరి మేమే సనాతన ధర్మ ప్రతినిధులమని చాటుకొంటూ ఉంటారు. వీరు వేదాంతంపై ఇతిహాసాలపై ప్రసంగిస్తూ భజనలు చేయిస్తూ, యోగాన్ని నేర్పుతూ, రోగాలను కుదురుస్తూ

కొన్ని సిద్ధులను ప్రదర్శిస్తూ జనాన్ని ఆకర్షిస్తారు. కొన్ని సాంఘిక క్రియా కలాపాలను చేయిస్తూ ఉంటారు కూడా. మా మాదిరిగా సంప్రదాయ పీఠాలుండవు. అయితే జనులను నాస్తికులుగా మార్చకుండా కొంతవరకూ అడ్డుకొంటున్నారు.

అయితే ఇందులో కొందరు కపటులు చేరుతున్నారు. రోగం కుదరక చివరకు ఎవరే మందు చెప్పినా వేసుకొన్నట్లు కొంతమంది విదేశీయులు వీరి దగ్గర చేరుతూ ఉన్నారు. వచ్చేవారికి కొంత ఉపశమనం ఉంటోంది. వెళ్ళినవారిలో కొంత అహంకారమైనా తగ్గుతోంది కదా! కాకతాళీయంగా కొన్ని కోరికలు తీరుతున్నాయి కదా! కొంత భక్తి ఏర్పడుతోంది. ఇదీ కొంతవరకు నయమే.

అయితే ఈ క్రొత్త సన్యాసులు పూర్వాచారాలను మంగళం పలుకుతారు. వర్ణాశ్రమాల గురించి ఎత్తుకోరు. ప్రస్తుత కాలానికి కొన్ని ఆచారాలు సరిపడవని, కేవలం సారమే పట్టుకోవాలని, పై ఊకవంటి ఆచారాలను పాటించనవసరం లేదని ప్రబోధిస్తారు. తామనుకొన్నది సారము, వద్దనుకున్నది ఊకయని, శుష్కప్రాయమైన దానిని ప్రాచీన మతాలవారు పట్టుకొన్నారని, ప్రాణం వంటి దానిని తాము గ్రహించామని ప్రచారం చేస్తారు. తామాచరించినదే నిజమైనదనే భ్రాంతిని కల్గిస్తారు. ఇట్టివారు ఉద్యమాలు చేసి విడిపోయి యుండడమే మేలని భావిస్తాను. ఇందులో ఉంటే ఇదే నిజమైన మార్గమని జనులను మోసగించడం ఘోరం. సంప్రదాయాన్ని వీరు నిరసించడం ఏమీ బాగాలేదు. సంప్రదాయమతం పోతోందని నేను బాధపడడం లేదు.

ఇట్టి ప్రబోధకులు పెద్దవారు కావచ్చు. ఆశీర్వదించే శక్తులు కలవారు కావచ్చు. వారిని శరణు జొచ్చిన వారిపై వారి ప్రభావం ఉంటుంది కాని, అందరిపై ఉండదు. సంప్రదాయవాదుల మార్గము నెమ్మదిగా, నిలకడగా

పనిచేస్తుంది. వ్యక్తులు శాశ్వతం కాదు కదా! వారి తరువాత వారి భక్తులను నడిపేవారెవరుంటారు? కాని సంప్రదాయ మతాలకీ దుఃస్థితి రాదు.

ఇక సంప్రదాయ పీఠంలో పీఠాధిపతి ప్రధానం కాదు. అందు పరంపరాగతంగా సాగు ఆచారాలు, సిద్ధాంతం అనుష్ఠానాలే ప్రధానం. వీసమెత్తు మారకుండా వాటిని పరిరక్షించుకొంటూ వస్తున్నారు. జీవుని కర్మభారం తగ్గడానికి అనేక కర్మ మార్గాలున్నాయని బోధిస్తారు. ఇది కష్టమైన మార్గమే. రోగాన్ని బట్టి మందెంత వాడాలో వైద్యుడు చెప్పడం లేదా? చివరకు శస్త్రచికిత్స చేస్తున్నాడు కదా.

ఆధునిక సన్న్యాసులు, ఉపవాసాలక్కరలేదు. అంతా ఈశ్వర ప్రసాదమే, నీకిష్టమైనది తిను, ఈశ్వరుడు నీ మనస్సు చూస్తాడు గాని శిఖ పెట్టుకోవడం వంటి బాహ్యాచారాలను కాదని అంటూ భజన, ధ్యానము, జపం గురించి చెబుతారు. ఇదంతా కొంతవరకు పనిచేస్తుంది. ఎంతో ఉన్న కర్మభారాన్ని ఎట్లా తగ్గించడం?

అమ్మవారికి సుఖారాధ్య, సులభగతి అనే నామాలున్నాయి. అనగా సులభంగా ఆరాధించవచ్చని పొందవచ్చని అర్థం. నిజమే. అంత అఖండ విశ్వాసం ఉంటే అట్లానే పొందవచ్చు. అయితే ఈ విశ్వాసం ఎట్లా పట్టుబడుతుంది? ఇట్లా ఒక్క క్షణంలో ముక్తి, ఎవరికో గాని సాధ్యం కాదు. ఎన్నో పాపకర్మల ఫలం, ఎన్నో కర్మలు చేస్తేనేగాని పోదు. అదీ భగవానుడు చెప్పిందే. అందరూ నియమాలను దాటకూడదు. అట్లా ఆచారాలను పలచన చేస్తూ పోయి ఉంటే వారు నాస్తికులుగా మారకపోయినా సుగతి కనబడదు. ఇట్లా కొందరు నాస్తికులుగా, చాలా తక్కువమంది సనాతన ధర్మాన్ని పట్టుకొనే వారుండగా చాలామంది, ఏ స్వామినో నమ్ముకొన్నవారే కనబడుతున్నారు. ఆచార రూపంలో ఉన్న అనాచారమే కన్పిస్తోంది. అందుకే శ్లోకంలో పతితో భవేత్ అని యుంది.

అయితే విశాల దృక్పథం ఉండవద్దా అని అడుగుతారు. ఉండవలసిందే. అది మనస్సుకు సంబంధించింది. ఒక పద్ధతి లేకుండా ఎలా సాధ్యం? ఫుట్‌బాల్ నియమాలు క్రికెట్‌లో పనికి వస్తాయా? కనుక సర్వజన సమ్మతమంటూ ఆచారాలలో గందరగోళం తీసుకొని రాకండి.

సంప్రదాయం పూర్తిగా పాటించండి. లేదా పూర్తిగా మానివేయండి. ఇష్టమైన దానిని గ్రహించి ఇష్టంలేని దానిని త్యజించడం సబబు కాదు. శిష్యుడు గురువును, భార్య, భర్తను కొన్ని సందర్భాలలోనే శరణు జొచ్చుతారని అనడం సబబుగా ఉందా? గురువులో కాని, భర్తలో కాని కొన్ని లోపాలుండ వచ్చు. అట్లాగే ఆచారాలలో కొన్ని చెడ్డవి ప్రవేశించి యుండవచ్చు. అహంకారాన్ని విసర్జించి శరణాగతిని పొందితే పాప పరిహారమౌతుంది. వ్యక్తిగత కారణాల వల్ల సంప్రదాయానికి చిల్లు పెడితే పోవదగిన అహంకారం పడగ ఎత్తుతుంది. ఒక్కొక్క స్వామి ఒక్కొక్క మార్గం చెబితే దేనిని ఆశ్రయించాలనే సందేహమూ కల్గుతుంది.

మేమీ యాగాలు చేయిస్తున్నాం. వేద పారాయణలు చేయిస్తున్నాం అంటారు. అట్టివి వారు చేయించకపోవడం మంచిదంటాను. ఇవి చేయించడం వల్ల ఇదే అసలైన మతమనే భ్రాంతిని లోకులకు కల్గించి నట్లౌతుంది. వీరు లోలోపల అసలైన మతానికి దూరంగా తొలగిపోతున్నామని భయపడి ఈ యాగాదులు చేయిస్తారు. వీరందరూ సనాతన ధర్మాన్ని అనుసరిస్తున్నారని సామాన్య ప్రజలు నమ్ముతారు. మూకుమ్మడిగా వీరిని ఆశ్రయిస్తూ ఉంటారు. అంతేకాదు, వేదవిద్వాంసులను పిలవడం వారికి భూరి సంభావనలీయడం మొదలైన తంతు కూడా ఉంటుంది. వారు చేసేవాటిలో కూడా శాస్త్ర నియమాలను పాటించరు. సమత్వం అనే పేరుతో సంస్కారానికి ప్రాధాన్యం ఈయరు. ఒకదానిని ప్రయోగశాలలో ప్రయోగించేటప్పుడు అనేక నియమాలుంటాయి. అట్లా ఉన్నపుడే ఆ ప్రయోగం

సఫలమౌతుంది. మన ఇష్టం వచ్చినట్లు అక్కడ నియమాలు మారుస్తారా? వేసుకొనే వేషం – ఉష్ణోగ్రత ఎక్కడ ఏ లోహాన్ని వాడాలి! మొదలైనవి తు.చ తప్పక పాటించాలి కదా.

(వర్షం పడడానికి కారీరి అనే ఇష్టిని చేస్తారు. ఋత్విక్కులపుడు ఉప్పులేని ఆహారాన్ని మాత్రమే తినాలి. కానీ ఒకసారి వారీ నియమాన్ని పాటించలేదు. ఇష్టి చేసినా వర్షం పడలేదని స్వామివారితో వారు అన్నారు. లవణవర్జితమైన ఆహారాన్ని తిని చూడండని స్వామివారు చెప్పినట్లు చేయగా వర్షం పడినట్లు, స్వామివారి చరిత్రలో ఉంది–అనువక్త)

అట్లాగే కర్మలను పాటించడంలో అనేక నియమాలున్నాయి. వీటిని అతిక్రమిస్తే దుష్ఫలితం వెంటనే కనబడదు. కాని సైన్సుతో అట్లా కాదు. వెంటనే కన్పిస్తుంది. శాస్త్రాలు అదృష్ట ఫలాలనందించాయి. చెడ్డ ఫలితం వెంటనే కనబడకపోవడం వల్ల తాము చేసిన పద్ధతులే బాగున్నాయని ఈ యాగాలను పోడిగిస్తున్నారు. అందుకే ఎన్ని చేసినా ప్రజలలో క్రౌర్యం, ఆందోళనలు తగ్గడం లేదు.

## ఆధునిక వేదాంతులు

వీరు వేదాంతం గురించి మాట్లాడుతూ, కర్మలు అనవసరం అంటూ, పూర్వాచారాలు వద్దంటూనే చర్కా వాడడం, చేతి వృత్తులు వంటివాటిని ప్రోత్సహిస్తూ ఉంటారు.

మన మనస్సును శుద్ధి చేయాలంటే కర్మమార్గం తప్ప మరి ఒక గతి లేదని మాటిమాటికీ చెబుతున్నా. కర్మలు చేస్తే చిత్తశుద్ధి ఏర్పడి, ఇక కర్మలు చేయక కేవలం ధ్యానంలో ఉండే స్థితి వస్తుంది. కర్మలు చేయకుండా కేవలం వేదాంతం గురించి చెబితే ఏమవుతుంది? గీతలో:

"కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే" (3-6)

తా॥ "ఏ మూఢుడు కర్మేంద్రియాలను నిగ్రహించి శబ్దం మొదలైన ఇంద్రియ విషయాలను మనసా స్మరిస్తూ ఉంటాడో అతడు కపటియని చెప్పవలసి వస్తుంది. ఇంద్రియాలు పనిచేయకపోవచ్చు, మానసికంగా వాటిమీద ధ్యాసతోనే ఉంటాడు కదా!"

కర్మలో జ్ఞానం లేదు పనులు చేయకుండా ఇంద్రియాలను విడిచిపెడుతూ తిన్నగా ధ్యానం చేస్తానంటే పరమాత్మ ధ్యానం కుదురుతుందా? కుదరదు.

మనస్సు ఇంద్రియాల వెంట పడుతూనే ఉంటుంది. ఇవి కర్మలు చేయడం వల్ల శుద్ధి పొందనపుడు మనస్సులో పేరిన చెత్తా చెదారాన్ని శుభ్రం చేయడం వీలు పడదు. అంతవరకూ అతడు విమూఢాత్ముడే. అతడు మిథ్యాచారి, మూర్ఖుడు. కపటియని గీత చెప్పింది. మానసికంగా అపవిత్రుడే.

ఎవరు ఆచారాలను పాటిస్తారో వారు మూర్ఖులుగా, స్వార్థపరులుగా, క్రూరులుగా లోకానికి కనబడవచ్చు, కానిపై వేదాంతులుగా మాత్రం ఉండరు. అదీ క్రమశిక్షణలోని గొప్పదనం.

## సారాంశం

ప్రాత ఆచారాలను తొలగించి క్రొత్తవాటిని ప్రవేశపెడితే అన్నిటినీ కొంత కాలానికి ప్రజలు గెంటివేస్తారు. విచ్చలవిడితనం ప్రబలుతుంది. పనులన్నీ స్వార్థపూరితంగానే ఉంటాయి.

ఆచారాలను సడలిస్తే ఫలాలు జారిపోతాయి. పవిత్రత సన్నగిల్లుతుంది. కేవలం వేదాంతాన్ని బోధిస్తూ ఉంటే ప్రజలలో సోమరితనం ప్రబలుతుంది. నడవడిక ఒక క్రమపద్ధతిలో ఉండదు. ఆహార నియమాలుండవు. చాలా పాపాలు చేస్తారు.

## తెలిసినవాడు, తెలియనివాడు

సామాన్యులు కర్మ ఫలాలను కోరుతారు. నిష్కామం, నైష్కర్మ్యం, ధ్యానం, జ్ఞానం వంటి పదాలు వారికి రుచించవు. వీరిని అవిద్వాంసులని గీతా కారుడన్నాడు.

అయితే విద్వాంసులేమి చేయాలి? వారు కూడా నేటి సంస్కర్తల మాదిరిగా కర్మలను మానాలా? మనస్సు పవిత్రంగా ఉంటే సరిపోతుందని చెప్పాలా? అన్ని కర్మలను విడిచి పెట్టడం చిట్టచివరి దశలోనే అని గీతాకారుడన్నాడు. విద్వాంసుడు మొదట్లో ఏం చేయాలి?

"అవిద్వాంసో యథా కుర్వంతి భారత

కుర్యాత్ విద్వాన్ తథాஉసక్తః చికీర్షుః లోక సంగ్రహం"

అనగా అజ్ఞానులు కర్మలలో ఎట్లా ఆసక్తులై యుంటారో ఎట్లా ఆచరిస్తూ ఉంటారో జ్ఞాని కూడా ఆసక్తి ఉన్నా లేకపోయినా లోక కల్యాణం కోసం కర్మలు చేయవలసిందే అన్నాడు.

అయితే జ్ఞానికి అజ్ఞానికున్నట్టి కోరికలు, ఆసక్తి ఉంటుందా? గీతాచార్యుడు అజ్ఞాని ఫలాలనాశించి చేస్తాడు, జ్ఞాని ఫలాలనాశించకుండా చేయాలన్నాడు. అసక్తాః అనే పదం చేర్చాడు. అజ్ఞానుల గురించి సక్తాః అన్నాడు. అదీ తేడా.

జ్ఞానం కంటె పొందదగింది జ్ఞానికేమీ లేదు. ఫలాలనాశించకపోతే ఈ కర్మలనెందుకు చేయడం? చికీర్షుః లోక సంగ్రహం అన్నాడు. సంగ్రహం అంటే ఒకదానిని బాగా పట్టుకొనుట. లోక సంగ్రహం అనగా ప్రేమతో లోకాన్ని పట్టుకొనుట, తద్వారా రక్షించుట, సన్మార్గంలో మనిషిని నడిపించుట. లోకంలో మునిగినవాడు అజ్ఞాని. లోకాతీతంగా ప్రవర్తించేవాడు జ్ఞాని. పై మాటకు లోకాన్ని సన్మార్గంలో పెట్టడము అని అర్థం.

అనగా జ్ఞాని ఉన్నత స్థానంలో ఉన్నా క్రిందకు దిగి చేయినందిస్తాడు. వారి చేతులను పట్టుకొంటాడు. సం-గ్రహం=పైకి ఎత్తుతాడు. మామూలు పనులనితడు చేసినా మార్గదర్శకంగా ఉండి తన జ్ఞానాన్ని, భక్తినీ సామాన్యులకు పంచినా వారు వాటిపట్ల రుచి చూపించరు. తాను పంచిన ఫలాల రుచి వారు క్రమేణా తెలుసుకుంటారని జ్ఞాని ఈ పనులు చేస్తాడు.

తనకవసరం లేనిదానిని తానాచరించడం మిథ్యాచారం కాదా? కాదు. అతనికి లోపల, బయటా అంటూ ఏదీ లేదు. అంటీ ముట్టకుండా ఉంటాడు. తాను వేదాంతిగా నటిస్తూ తనను వేదాంతియని జనులనుకోవాలనుకుంటాడా? జ్ఞానిగా నటించదలచుకుంటే కర్మలే చేయనవసరం లేదు కదా. నిష్క్రియంగా కూర్చోవచ్చు కదా! కనుక తనకవసరం లేకపోయినా ఇతరుల పట్ల దయతో, ప్రేమతో కర్మలను చేస్తాడు. ఇట్టి భావనయే త్యాగం. కనుక ఇది మిథ్యాచారం కాదు.

అతడు చేస్తే ఇతరులూ చేస్తారని: యద్య దాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః

ఉన్నత స్థితిలో ఉండి కర్మలను చేయడం మనవల్ల కాదని సామాన్య జనులనుకొంటారని అతని స్థాయిని తగ్గించుకొని ప్రజలలో క్రమశిక్షణను అనగా తానట్లుండి చేసే స్థితిని చూపిస్తాడు శ్రేష్ఠుడు. కర్మఫలాలలో బంధింపబడకుండా శాస్త్రకర్మలను చేసి, వాటి ఫలాలను రుచి చూపిస్తూ వారి ఇంద్రియాలు ఆ ఫలాలలో చిక్కుకోకుండా చిత్తశుద్ధిని వారిలో కలిగేటట్లు చేస్తాడు. కర్మల లక్ష్యము మోక్షము కాకపోయినా వారు కోరుకున్న ఫలాలు కనుక సిద్ధిస్తే క్రమక్రమంగా వారి మనస్సులలో పేరుకొన్న చెత్తను తుడిచివేయడం వల్ల చిత్తశుద్ధిని పొందుతారు. అపుడు వారిలో క్రమక్రమంగా కర్మను స్వీయ ఫలాల కోసం చేయడం కాదని సంఘం యొక్క ఉన్నతికై

చేయాలనే భావన ఏర్పడుతుంది. తద్వారా తాను తన కుటుంబం, సంఘం ఒక క్రమశిక్షణతో సాగుతుంది. ఆ స్థితిలో అది నిష్కామ కర్మ అవుతుంది. కేవలం కోరికలతో చేస్తే అది కామ్యకర్మ.

జ్ఞానియే చేస్తున్నాడు, మనం చేయకపోతే ఎలా అని సామాన్యులు భావిస్తారు. వీరు కోరికలతో ఉండడం సహజం. ఏ పని చేయకుండా ఒక్కడూ ఒక్క క్షణమైనా ఉండడని ఉంది.

**నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠతి అకర్మకృత్**

ఎందుకంటే ప్రకృతి యనగా మాయ, ఇతణ్ణి సత్త్వరజ స్తమోగుణాలతో బంధిస్తోంది. ఈ గుణాలచే అవశులై అనగా స్వేచ్ఛ లేనివారై అందరూ కర్మలను చేస్తారు.

కార్యతే అవశః సర్వః ప్రకృతిజైః గుణైః

కనుక ఆదర్శప్రాయంగా కర్మలను జ్ఞాని చేయకపోతే సామాన్యులు, ఏదో పనులు చేసి కోరికలను తీర్చుకుంటారు. అయితే జ్ఞాని ఏం చేస్తున్నాడు? ఆ చేసే కర్మలను శాస్త్రప్రకారం చేయండని ఆచరణతో కూడిన బోధ చేస్తున్నాడు. కర్మ లక్ష్యం కామ్యమైనా అది శాస్త్ర ప్రకారం చేయబడితే దాని గుణం మారుతుంది. ఉత్తమ గుణం ప్రాప్తిస్తుంది. కోరికలతో కామ్యకర్మలు చేసినా వాటికీ ఎన్నో విధులున్నాయి. ఒక కాలం, స్నానం, సాత్వికాహారం, హోమం వంటి క్రియలున్నాయి. ఇష్టం వచ్చినట్లు చేస్తానంటే ఫలాలు రావు. ఇట్టి కోరికలతో చేసినవారిలో కూడా ఒక నియమపాలన, శాంతి, పవిత్రత ఏర్పడుతాయి. ఇష్టం వచ్చినట్లు చేస్తే వారిలో అహంకారం ప్రబలుతుంది. శాస్త్రప్రకారం చేస్తే ఇతనిలో వినయం, ఈశ్వర భక్తి కల్గుతాయి. భయభక్తులుంటాయి.

## పంచదార మెదిపిన మాత్ర

పంచదార మెదిపిన చేదు మాత్రను పిల్లవానికి ఇస్తున్నాం. అది రోగాన్ని పోగొడుతుంది. పంచదార లేకుండా తింటాడా? అట్లాగే శాస్త్ర కర్మ కూడా. పైకి మాత్రం తియ్యగా ఉంటుంది. లోపల వివేకమనే చేదుమాత్ర ఉంది. అట్లాగే కర్మలుంటాయి. చేదు మాత్ర ఉందని తెలియకపోయినా మ్రింగు తున్నాడు. రోగం పోతోంది. కామ్య కర్మలను గురించి చెబుతూ కొన్ని నిష్కామ కర్మలను జోడించాడు గీతాకారుడు. ఉదాహరణకు సంధ్యావందనం చేస్తే ఫలానా ఫలం వస్తుందని చెప్పబడలేదు. అది చేయకపోతే పాపమని అన్నారు. అవి నిత్య కర్మలు. కర్మఫలాలను కోరేవాడు ఇట్లా ఒకటి రెండు నిష్కామ కర్మలను సకామ కర్మలతో కలిపి చేస్తూ ఉంటాడు. ఇది కూడా చిత్తశుద్ధికి తోడ్పడుతుంది.

## ఆనాడు వృద్ధి - ఈనాడు పతనం

ధర్మ, భక్తి, జ్ఞాన, సంస్కృతులకు ఆదర్శవంతంగా భారతదేశం పరిఢవిల్లిందని చరిత్ర చెబుతోంది. మహాత్ములే నిష్కామ కర్మ చేస్తూ ప్రజలకు ఆదర్శవంతంగా నిలిచారు. వారిని సామాన్యులు అనుసరించారు. కాని ఈనాడు జ్ఞానులమని కర్మలపట్ల ఏవగింపు చూపిస్తున్నారు. ఆనాడు భౌతిక రంగంలోనూ ఉన్నత దశలో ఉండేది. అంతా మిథ్య అంటూ దేశ ప్రగతికి పూర్వులు తోడ్పడలేదనే దానికి ఆధారం లేదు. మహమ్మదీయులు, తెల్లదొరల కాలంలో మనం వెనుకబడ్డాం గాని మతాచారాలను, వేదాంతాన్ని ఆచరించడం వల్ల కాదు.

అయితే ఈనాడు ఆధ్యాత్మిక ప్రగతి లేకపోవచ్చు, భౌతిక రంగంలో, అణుశాస్త్ర రంగంలో అభివృద్ధి సాధించాము కదా, మరి దీని గురించి

ఏమంటారని ప్రశ్నించవచ్చు. ఇంతవరకూ పొగిడిన పాశ్చాత్యులు నీతి నిజాయితీలు లేకుండా భారతీయులు వ్యాపారం చేస్తున్నారని, అమ్మేటపుడు మంచి రకాన్ని చూపించి నాసిరకాన్ని పంపిస్తున్నారని ఈసడిస్తున్న విషయం గమనించారా అని తిరిగి ప్రశ్నిస్తున్నా. మనం సైన్సులో వృద్ధిని సాధించినా శాస్త్రీయ విషయాలను ఇచ్చిపుచ్చుకొనే రీతిలో లేము. ఇది మచ్చ కాదా?

ధర్మమనే పునాదిపై అనాడు సైన్సు, వ్యాపారం అభివృద్ధి పొందాయి. పేరు సంపాదించాం. అట్టి పునాదికి బీటలు పడటం వల్ల మనం సాధించిన ప్రగతి, డొల్లగా మారుతోంది.

ఒక రోగికి మందీయడం మానివేస్తే తిరిగి తిరగబెడుతోంది. మందిస్తూ ఉంటే తగ్గుతోంది. అట్లాగే ధర్మమనే మందును మాటిమాటికీ స్వీకరించడం వల్ల మనలో ఐకమత్యం, సత్ప్రవర్తన ఉండేవి. ఒకపూట అన్నం తినకపోతే ఇబ్బంది పడతాం కదా! అట్లాగే ఆచార విషయంలోనూ.

మనలో లోపాలను గుర్తించడం కష్టం. అంతా పోగొట్టుకున్న తరువాతనైనా లోపాలను గుర్తించవద్దా? ఇప్పుడైనా మించిపోయింది లేదు. ఏదో తుఫాన్ వస్తుందని వినడం వల్ల ఏం లాభం? దానినుండీ రక్షించు కోవడానికి తగు ఏర్పాట్లు చేసుకోవాలి. సమయాచారమనే కవచాన్ని తొడుక్కుందాం. ముందుగా శిఖాం సూత్రంచ... పుండ్రంచ... శ్లోకాన్ని గుర్తుంచుకోండి. ఎందుకోసం పతితులం కాకుండా ఉండడం కోసం పతిత పావన సీతారాం – అనే పాట గాంధీగారి వల్ల ప్రచారంలోకి వచ్చింది. ఆ రాముడే శాస్త్రప్రకారం నడిచాడు కదా. అతణ్ణి ప్రార్థించి అతని బాటలో నడుద్దాం.

## ఇరుకు దారి

ఎవరీ ఆచారాలను ఏర్పాటు చేసారో తెలియదు. రామానుజులు, మధ్వాచార్యులు, చైతన్యులు మొదలైనవారు ఆయా కాలాలలో సంప్రదాయాలను ఏర్పాటు చేసారు. ఫలానావారు ఆచారాలను, సంప్రదాయాలను ఏర్పాటు చేసారని తెలియకుండానే ఆచరిస్తున్నాం. ఇతర మతాలలో ఫలానా ఆచారం ఆ మత ప్రవర్తకుడు వచ్చినప్పటినుండి వస్తోందని చెప్పవచ్చు. కాని మన మతంలో అట్లా కాలనిర్దేశం చేయలేం.

ఆ ఆచారాలు తారు రోడ్డులవంటివి. ఎప్పుడు వాటిని నిర్మించారో చెప్పవచ్చు. మన మతం కాలిబాటవంటిది. ఎవరీ కాలిబాటను వేసారంటే చెప్పగలమా? మామూలుగా తారురోడ్డు కాలిబాటకంటె ఎక్కువస్థాయిలో ఉందని చెబుతాం. కాని కాలిబాట వల్ల ఎక్కువ ఉపయోగాలున్నాయి. తారు రోడ్డును మధ్య మధ్యలో బాగు చేయవలసి వస్తుంది. కాని కాలి బాటను వాడిన కొద్దీ గట్టి పడుతోంది. ప్రమాదాలు తారురోడ్డు మీద జరగవచ్చు. అవి కాలి బాటపై ఉండవు. తారురోడ్డు కొంతదూరం వెళ్ళి ఆగిపోతుంది. కాని కాలిబాట అనంతంగా సాగుతుంది. దానంత అందంగా ఇది లేకపోవచ్చు. ఆచారాలను పాటిస్తూ ఉంటే పరమాత్మను నిమ్మదిగా చేరుకుంటాం. కారుపై, చకచకా తారురోడ్డుమీద వెళ్లవచ్చు కదా అని ప్రశ్నిస్తే ప్రమాదాలు లేకుండా మధ్యనున్న చిన్న చిన్న దారుల గుండా మనమూ పయనించి వారు చేరుకొన్న కాలంలో మనమూ చేరవచ్చు.

## ప్రకృతి ధర్మాలను నియమించే మానసిక క్రమశిక్షణ

ఆచారాలంటే కేవలం బాహ్య నియమాలే కావు. వీటివల్ల మానసిక క్రమశిక్షణ ఏర్పడుతుంది. అది నిగ్రహింపబడిన కొద్దీ అనంత శక్తులు

వస్తాయి. బాహ్య ప్రకృతిని నియమించే స్థితి కూడా వస్తుంది. బ్రాహ్మణుడు మూడుసార్లు వేదాధ్యయనం చేస్తే ఒక్కసారైనా వర్షం పడుతుందని తమిళనాడులో సామెత ఉంది. పతివ్రత ఉన్నా వర్షం పడుతుందని కూడాఉంది. రాజు న్యాయబద్ధంగా పరిపాలిస్తే సకాలంలో వర్షాలు పడతాయని తిరుక్కురల్ చెప్పిన మాటలను హేతువాదులూ అంగీకరిస్తారు. పైవారు విరుద్ధంగా ప్రవర్తిస్తే ప్రకృతి యొక్క ప్రకోపం ఉంటుందని చెప్పాలి కదా!

రాజు న్యాయమార్గం తప్పినా, బ్రాహ్మణుడు తన ధర్మమైన వేదాధ్యయనం మానినా ఎవరు చేయవలసినది వారు చేయకపోతే మిగతా ప్రజలు వారిననుకరిస్తారని అపమార్గంలో నడుస్తారని అంటాడు వల్లువర్. రాజులు నీతిని తప్పితే గోవులు పాలీయవని తిరువళ్ళువర్ అంటాడు. ఈ మాటను హేతువాదులు అంగీకరించకపోవచ్చు.

ఈశ్వరుని ధర్మ స్వరూపం, గతి తప్పని ప్రకృతి ధర్మంలో మానవాచారంపై ఆధారపడిన మనస్సులో ఉంది. కనుక మానవుడు ప్రయత్నపూర్వకంగా మానసికంగా శుభ్రత కలిగియుండాలి. అప్పుడే అక్కడే ఈశ్వరసాన్నిధ్యం ఉంటుంది.

ఒక క్రమశిక్షణ వల్లనే సూర్యచంద్రాది గమనం, భూమ్యాకర్షణం కూడా. అది కేవలం భౌతిక శాస్త్ర నియమాలే అని అనుకోవద్దు. మనస్సు శుద్ధంగా ఉంటే ఈ ప్రకృతి కూడా తోడ్పడుతుంది. మానవ మనస్సు ఎప్పుడైతే కళ్మలమైందో ప్రకృతిలో అల్లకల్లోమని చరకసంహిత చెప్పింది. పవిత్రమైన నడవడిక కలవారెట్టి సిద్ధులు చూపించారో పురాణాలలో విపులంగా ఉంది. వర్షం పడాలని ఒక పతివ్రత అంటే వర్షం పడడం వంటివున్నాయి. మధురైలో ఒక మఠంలో జ్ఞాన సంబంధర్ ఉన్నపుడు జైనులు నిప్పంటించగా ఇతడు ఈశ్వరుని ప్రార్థిస్తే ఆ నిప్పు పాండ్యరాజును చుట్టుముట్టింది. అతడిని

దారిలోకి తీసుకొని రావడానికి కుష్ఠరోగం రూపంలో అతడి పాపం రూపాంతరం చెందింది.

చర్యకు, ప్రతిచర్య ఉంటుందని న్యూటన్ మహాశయుడు ప్రతిపాదించిన సూత్రం, మన కర్మ సిద్ధాంతంపై ఆధారపడినా కేవల బాహ్యకర్మలే కాకుండా మానసిక వ్యాపారాలకు, ప్రకృతి శక్తులకూ వర్తిస్తుంది. మన కర్మ సిద్ధాంతం కేవలం భౌతికంతోనే ఆగిపోదు. మానసికంగా తాత్వికంగా కూడా అనువర్తిస్తుంది. అతడు చెప్పిన చర్యకు ప్రతిచర్య అనే మాట మంచి చేస్తే చెడు, చెడు చేస్తే మంచి అని కాదు. ఒక బంతిని గోడకేసి కొడితే అదే శక్తితో ఎదురుగా పడుతుంది. అట్లాగే పుణ్యపాప కర్మలు కూడా. వాటి ఫలాలు తిరిగి మనిషిని చేరుతాయి.

భౌతికస్థాయిలో సూర్యునిలో జడపదార్థం ఖర్చు పెట్టబడకపోతే భూగోళం చల్లబడిపోవలసి వస్తుంది కదా. కాని సూర్యుని వేడి తగ్గకుండా ఏదో శక్తి ఉంచగల్గుతోంది. ఇదంతా ప్రపంచ జీవన కోసం ఆ ఈశ్వర శక్తియే పని చేస్తోందని శాస్త్రజ్ఞులు మథన పడుతున్నారు. ఈశ్వర శక్తి అట్లా ఉంచగల్గుతోందని ఐన్‌స్టెన్ శాస్త్రజ్ఞుడు అంగీకరించాడు. మానవ జీవనంలో క్రమశిక్షణ, క్రమపద్ధతి అనేవి ధర్మం అనే నాణానికి రెండో వైపు వంటివి. అట్లాగే మానసిక శక్తి అనుగుణంగానే ప్రకృతి మనకనుకూలంగా ఉండుట, ప్రతికూలంగా ఉండుట జరుగుతుంది.

సాధారణంగా స్తోత్రాల చివరలో వాటిని పఠించడం వల్ల ఆయా ఫలాలు వస్తాయని చివర ఉంటుంది. దానిని ఫలశ్రుతి యని అంటారు. విష్ణు సహస్రనామాలలో ధర్మానికి మూలం భగవానుడని అదే చరాచర వస్తు ప్రపంచాన్ని నడుపుతోందని, ధరించేదే ధర్మమని, నక్షత్రాలు పడిపోకుండా ఉండడానికి, భూమి పడిపోకుండా ఉండడానికి అదే కారణమని చెప్పింది. అట్లాగే సముద్రానికి కూడా.

'ద్యౌః సచంద్రార్కా నక్షత్రా ఖందిశో భూర్మహోదధిః
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః'

ఇట్లా వాసుదేవుని శక్తివలనే ప్రపంచం ధరింపబడులోందని చెప్పి మానవునకు సంబంధించిన ఇంద్రియాలు, బలం, తేజస్సు, ధైర్యం - సమస్తమూ అనగా క్షేత్రము, అందుండే క్షేత్రజ్ఞుడూ అంతా వాసుదేవ స్వరూపాలే యని చెప్పింది.

**ఇంద్రియాణి మనోబుద్ధిః సత్త్వం తేజోబలం ధృతిః**
**వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవచ**

అట్లాగే సురలు, అసురులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు అన్నీ అతని వశంలోనే ఉంటాయని చెప్పింది. ఇట్లా సమస్త ప్రపంచమూ అతని గుప్పిట్లో ఉందని అతడే మనస్సు నిచ్చాడని, దానిని అదుపులో పెట్టుకోవడానికి శాస్త్రాలను ఆచారాలను ప్రసాదించాడని చెప్పాడు. మొదటనుండీ వచ్చిన ఆచారము ఇందులో ఉంది:

**సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పతే**
**ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః**

అనగా ఆగమాలు ఆచారాన్ని గూర్చి చెబుతాయి. ఆ ఆచారం నుండే ధర్మం ప్రభవిస్తుంది. ఆ ధర్మానికి ప్రభువు అచ్యుతుడు. అనగా చ్యుతిలేనివాడు. అనగా స్థిరంగా ఉండేవాడు కనుక ధర్మం నిలకడగా, స్థిరంగా ఉండవద్దా?

ఇది చేతనా చేతనాలను సక్రమంగా ఉంచుతుంది. దీనిని ఆధునికులు గ్రహిస్తే మంచిది. అట్టి వాసుదేవుడు సదాచారమును ప్రోత్సహించుగాక.

## మతాచారాలలో భేదాలు

శిఖ, పుండ్రం సూత్రం వంటివి ఇతర మతాలలో ఉండవు. ఈ మతానికి మూలం వేదం. దానినాధారంగా చేసుకొని ధర్మశాస్త్రాలు వచ్చాయి. కనుక

వేదాలు, ఈ మతానికి ప్రాణం వంటివి. వీటి అర్థం నిర్ధారించడంలో అనేక అభిప్రాయ భేదాలున్నాయి. ద్వైతా ద్వైతాదులుగా ఈ వేదమతంలో సమస్త దేవతలు, ఒక్క పరమాత్మనే సూచిస్తున్నారని అంటారు. ఉన్నది ఒక్కడే అనడంలో భేదం లేదు. తమ ఇష్టదైవం, ఆ ఒక్కడే అంటారు.

ఇట్టి భిన్న సంప్రదాయాలలో ఒక సంప్రదాయం నుండి మరొక సంప్రదాయానికి వెడితే పతితుడౌతాడా? వేదమతం విడిచి మరొక మతాన్ని ఆశ్రయిస్తే తప్పేయని ప్రశ్నిస్తారు.

నేను మొదట చెప్పిన శిఖా శ్లోకంలో శిఖ, పుండ్రం, సూత్రం గురించే ఉంది. వాటిలో తమ సంప్రదాయాలను పాటించాలని, లేనిచో పతితుడని ఉంది. కనుక ఇక్కడ సంప్రదాయాన్ని మార్చడం గురించి లేదు. ఇక చర్చ ఏమిటి?

వేదమతంలో పుట్టినవాడు మరొక మతంలోకి వెడితే తప్పుగాని, మనలో ఒక సంప్రదాయంలో పుట్టినవాడు మరొక సంప్రదాయంలోకి వెడితే తప్పెట్లా అవుతుంది? తాత్త్విక స్థాయిలో ద్వైతాద్వైతాదులుండవచ్చు. శ్రుతి స్మృతులలో ఒక్క దేవతయే అందరికీ దేవతయని చెప్పబడలేదు. అందువల్ల భిన్న సంప్రదాయాలు వచ్చాయి. కాని అందరూ వైదిక సంస్కారాలను పాటిస్తున్నారు. ఇంట్లోనే భిన్న భిన్న దేవతలను అర్చిస్తున్నారు. అందరూ శ్రౌతస్మార్త కర్మలు, పంచ మహాయజ్ఞాలు, సంధ్యావందనాదులు చేస్తూనే ఉన్నారు. రానురాను సిద్ధాంత భేదం వచ్చి మీరు ఫలానా అని పిలువబడుతున్నారని మీరు చెప్పారు కదా! ఒకడు ద్వైతి ఇంట్లో పుట్టినా అద్వైతం పట్ల అతడు మోజు చూపించడం లేదా? ఇంట్లో శివపూజ జరుగుతూ ఉంటే విష్ణువంటే ఒకనికి ఇష్టమైతే శివపూజను మానడం తప్పవుతుందా! అటువంటి స్వేచ్ఛ పూర్వం ఉండేది కదా! వేదమతాన్ని వీడకుండా అట్టి స్వేచ్ఛను పాటిస్తే తప్పవుతుందా?

నేనంటున్నదేమంటే శంకరులు, తాము చెప్పిన సిద్ధాంతాన్ని పాటించినవారిని ప్రత్యేకంగా పరిగణించలేదని, తామొక ప్రత్యేక సంప్రదాయాన్ని స్థాపించినట్లు చెప్పలేదని అంటున్నా. వారిని అనుసరించేవారిని స్మార్తులని అంటారు. స్మృతిననుసరించేవారు స్మార్తులు. అందరూ పాటించేవి ఆ ధర్మశాస్త్రాలనే. కాని రామానుజ సంప్రదాయం వారు తాము వైష్ణవులమని; మధ్వ సంప్రదాయం వారు తాము మధ్వులమని; అనుకొంటారు. పూర్వం ఉన్న ఆచారాలను, సంస్కారాలను, అనుష్ఠాలనే శంకరులు పొడిగించారు. ఇతర ఆచార్య పురుషులు వచ్చిన తరువాత భిన్నభిన్నమైన నామాలతో వ్యవహరింపబడ్డారు. వారి ప్రత్యేకతకై కొన్ని పద్ధతులను ప్రవేశపెట్టారు. సమాశ్రయణం, ముద్రాధారణం వంటివి. శ్రౌతస్మార్త కర్మలకు తక్కువ ప్రాధాన్యం ఇచ్చి ఆగమాలకు, పురాణాలకు ప్రాధాన్యం ఇచ్చారు. నుదిటిపై పెట్టుకొనే నామం గురించి వారిలో భేదాలున్నాయని చెప్పాను కదా. నేను చెప్పిన మాటను ఆధారంగా చేసుకొని శంకరుల తరువాత వచ్చిన ఆచార్యులు తమ కులాచారాన్ని విడిచి ప్రత్యేక ఆచారాలను ప్రవేశపెట్టి స్వాతంత్ర్యం చూపినట్లుగా నేడు ఒక స్మార్తుడు వైష్ణవుడైనా, ఒక మాధ్వుడు వైష్ణవుడైనా మారినా వచ్చే తప్పేమిటని ప్రశ్నిస్తున్నారు కదూ!

మీరు చెప్పిన వాదన బాగానే ఉంది. కాని పూర్వుల ఆచారాలను పాటించండనే చెబుతున్నా. వంశంలో పరంపరగా వచ్చిన వాటినే ఆచరించండి. శాస్త్రాలను నమ్మనివారితో పనిలేదు. నమ్మకం అని ఎప్పుడైతే అన్నామో అది బుద్ధికందేది కాదని కదా అర్థం? వాదాలలో ప్రయోజనం లేదు.

ఎందుకు ఆచారాలను పాటించాలో చెబుతా. ద్వైతంనుండి అద్వైతానికి, అద్వైతంనుండి విశిష్టాద్వైతానికి సిద్ధాంతరీత్యా మారవచ్చు. అంతమాత్రంచే

కులాచారం మానవసవరం లేదు. అట్లే సిద్ధాంతాలు, తీవ్ర ఆలోచనల వల్ల గాని, అనుభవం వల్లగాని మార్చుకోవచ్చు. సిద్ధాంతం మనస్సుకి సంబంధించింది. తానెందుకు సిద్ధాంతాన్ని ప్రేమిస్తున్నాడో విశదీకరించ గలడు. కాని కులాచారాలను మానవర్తంటున్నాను.

ఆచారాలు బాహ్యమైనవి, సిద్ధాంతం అనుభూతికి చెందింది. వీటికి సంబంధం లేనట్లు కనబడినా సంబంధం ఉంది. ఇక ఆధునికులు వేదాంతమే ప్రధానము, ఆచారము కాదనే మాటలతో ఏకీభవించను.

ఇంకా ఏమన్నాను? కర్మలు తిన్నగా మోక్షానికి దారితీయవని, వీటివల్ల చిత్తశుద్ధి ఏర్పడుతుందని, తరువాత జ్ఞానం పట్టుబడుతుందని అన్నాను. ఇక్కడ జ్ఞానమంటే భక్తి సిద్ధాంతమూ వస్తుంది. ఏ సిద్ధాంతాన్ని ఆకళించుకొన్నా ముందు కావలసింది మనస్సు శుద్ధముగానుండుటయే. బాహ్యాచారాలు, కర్మకాండలు జ్ఞాన ప్రాప్తికి పరోక్షంగా సహకరిస్తాయి. ప్రత్యక్షంగా మాత్రం కావు.

అయితే భిన్నసిద్ధాంతాలున్నా పైపై ఆచారాలతో పెద్ద తేడా లేదు కదా! మనం ఆరతి ఇస్తున్నట్లుగా మరొకడు క్రొవ్వొత్తిని వెలిగిస్తాడు. మనం ఉపవాసాలున్నట్లు రంజాన్ నెలలో ఉపవాసాలున్నాయి. బౌద్ధ, జైన మందిరాలోలనూ మనగుళ్ళలో చేసేటటువంటి పూజలున్నాయి. చక్రాంకితాల ముద్రలు వేసుకోవడం వల్ల ద్వైత విశిష్టాద్వైత అనుభూతి కల్గుతోందా? అట్లాగే ఉపన్యాసాలలో అద్వైతికి ఆచారానుష్ఠానాలు అక్కరలేదని అంటారు. కాని అద్వైతాన్ని నమ్మినవారు స్నానపూజాదులను, తద్దినాలును పెట్టడాన్ని మానడం లేదు. వైష్ణవులు పూజించినట్లు శైవులూ పూజిస్తారు. ఒకరు సాలగ్రామాన్ని, మరొకరు శివలింగాన్ని పూజిస్తారు. ఒకరికి వైకుంఠ ఏకాదశి, మరొకరికి శివరాత్రి నాడు ఉపవాసాలు. కనుక క్రియా కలాపాలలో పెద్దగా తేడా లేదు. ఒకనికి నుదిటిపై చుక్క మరొకనికి నామం, ఇంకొకనికి విభూతి.

చీరలను కట్టే రీతిలో తేడాలుండవచ్చు గాని చీరను అందరూ ధరిస్తారు కదా. సన్న్యాసులైనా వారికొక గుర్తు ఉంటుంది. ఒకడు ఏకదండి, మరొకడు త్రిదండి.

అంటే సిద్ధాంతాలు భిన్నంగా ఉండవచ్చు. పైపై ఆచారాలు తిన్నగా వాటితో సంబంధం కలిగియుండవని తేలింది. అయితే ఆచారం లేకుండా కేవల సిద్ధాంతాల వల్ల జ్ఞానం కలుగదు. అన్ని ఆచారాలు మనలోని మురికిని పోగొట్టేవే. కనుక ఫలానాది చేయాలని అనడం కంటె ఫలానాది చేసినప్పుడు సరిగా చేస్తే ఆత్మజ్ఞానానికి దోహదంచేస్తుందని అనాలి. కుటుంబంలో ఒక సిద్ధాంతం పట్ల ఆదరణ భిన్నంగా ఉన్నా అతడు కులాచారాలను మాననవసరం లేదు. పూర్వైరాచరితం కుర్యాత్ లోని ఆజ్ఞలను ధిక్కరించి పతితుడు కానవసరం లేదు.

అయితే ఇంట్లో భిన్న సిద్ధాంతాలు వారుండవచ్చా? "శిఖాం సూత్రంచ.. పుండ్రంచ.." శ్లోకంలో బాహ్యాచారాలను గురించి మాత్రమే చెప్పింది. కుటుంబంలో అనాదిగా నమ్ముతున్న సిద్ధాంతాన్ని అనుసరించుండని చెప్పలేదు కదా.

పూర్వులు నమ్మిన సిద్ధాంతాన్ని నేను బాహాటంగా త్యజిస్తున్నానని చెప్పనవసరం లేదు. బాహ్యాచారాలను త్యజించనవసరం లేదు. ముందు కావలసింది చిత్తశుద్ధి. అది ఏర్పడితే నీవు నమ్మిన సిద్ధాంతం ఒంటబడు తుంది.

ఎ.వి.గోపాలచారియర్ అనే వారు వైష్ణవ సంప్రదాయం ప్రకారం నడుచుకొనేవారు. కాని ఆయనకు శంకర సిద్ధాంతంపై మక్కువ ఎక్కువ. అట్లాగే క్రీస్తును నమ్మిన పాశ్చాత్యుడు, అద్వైతవేదాంతం పట్ల మోజు చూపిస్తాడు. ఇక కొందరు నాపట్ల, శంకరుల పట్ల అమిత విశ్వాసమున్నా

అయ్యా మాకు భక్తిమార్గం అంటే ఇష్టముండదని అంటారు. వీటివల్ల నమ్మిన సిద్ధాంతానికి బాహ్యాచారాలు అడ్డుకావని తేలింది.

ఇక పెక్కు సిద్ధాంతాలు, వాటికి అనుగుణమైన పూజలు చేసేవారున్నారు. విశిష్టాద్వైతులు పరమాత్మను అంతర్యామిగా పూజిస్తూ ఆ పరమాత్మ విష్ణువే అని అంటారు. ఇక శైవ సిద్ధాంతులు, అద్వైతానికి వేరువుగా ఉన్నా పరమాత్మతో ఐకమత్యాన్ని కోరరు.

అయితే అద్వైతి, ఏ దేవతను కొలిచినా పరమాత్మ స్వరూపంగా ఆరాధించుమని అంటాడు. భేదభావంగా శివపూజ, సాలగ్రామ పూజ, శ్రీ విద్యా పూజలుంటాయి. అయితే మీరొక ప్రశ్న అడుగుతారు. మీరేమో ఏ సిద్ధాంతాన్ని నమ్మినా మీ కులాచారం మార్చవద్దని అంటున్నారు కదా. నేను విశిష్టాద్వైత కుటుంబంలో పుట్టాను. కాని అద్వైతం అన్నా, శివుడన్నా ఇష్టం. మీరు చెప్పినట్లు కులాచారం పాటించాలంటే శివుణ్ణి పూజించడం మానివేయాలా? నా కులాచారం ప్రకారం విష్ణువునే పూజించాలి కదా. ఏమిటి సమాధానం?

ఏ ఈశ్వరుడు వారిని ఒక సంప్రదాయంలో పుట్టించాడో ఆతడే అతని భిన్నమూర్తులలో ఒకదానిపట్ల విశ్వాసం ఉండేటట్లు చేసాడని చెప్పవచ్చు కదా!

అదీ తృప్తినీయడం లేదు. కలిపే ఆచరిస్తున్నాం. సంధ్యావందనం చేసేటపుడు పరమేశ్వర ప్రీత్యర్థం అంటున్నాం. అందులో 'ఈశ్వర' పదం ఇష్టంలేక వైష్ణవుడు భగవత్ ప్రీత్యర్థం అంటున్నాడు. ఒకడు శైవుల ఇంట్లో పుట్టి విష్ణువు పట్ల ప్రీతి కలిగియుంటే వైష్ణవనామం పెట్టుకోడానికి, కేశవాది నామాలను ఉచ్చరించడానికే ఇష్టపడతాడు. శివ పంచాక్షరిని జపించేవాడు విభూతినే ధరించడానికి ఇష్టపడతాడు.

అయితే ఇంతకు ముందు చెప్పిన మాటలను ఉపసంహరించుకోవాలా? అదీ పనికిరాదు.

నీవు క్షత్రియునిగా పుట్టావు కనుక క్షత్రియ కులాచారం ప్రకారం యుద్ధం చేయడం నీ విధియని కృష్ణుడనలేదా? నీ ధర్మాన్ని ఆచరిస్తూ మరణించినా మేలే అని అన్నాడు.

స్వధర్మే నిధనం శ్రేయః

నీ కులధర్మం కంటె మిగిలిన కులధర్మం ఉన్నతంగా కనబడినా నీ ధర్మాన్నే ఆచరించాలని అన్నాడు. శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ పరధర్మం భయావహమని అన్నాడు. పరధర్మో భయావహః అయితే పూర్వాచారాన్ని విడిచిపెట్టాలనే వారికి సమాధానం చెప్పాలి కదా.

10, 20 తరాలనుండి పూర్వులాచరించిన దానిని పూర్వాచారమంటున్నాం. ఇంతకుముందు వేయి సంవత్సరాల వెనుక అందరూ స్మార్తాచారాన్నే పాటించారు. క్రొత్త సంప్రదాయాలు వచ్చిన తరువాత నాల్గవ వంతు పూర్వాచారాలను మార్చారు. అట్లా పూర్వులకు పూర్వులే మార్చారు కనుక, పూర్వాచారాలను తు.చ. తప్పక పాటించలేదు కదా అని ప్రశ్నిస్తున్నారు. 'మేము పూర్వుల ఆచారాలను మార్చమంటున్నామంటే మా ఇష్టదేవతను ఆరాధించే విషయంలోనే, సిద్ధాంతాన్ని బట్టి, ఇష్ట దైవాన్ని బట్టే. మీరేమో సిద్ధాంతం వేరైనా కావచ్చు, ఆచారం మార్చవద్దంటున్నారు. మరి ఇష్టదైవం మాటేమిటి? ఇక్కడ కూడా మీరు మమ్మల్ని పూర్వాచారాన్ని పాటించమంటున్నారేమిటని' ప్రశ్నిస్తున్నారు కదూ!

వేయి సంవత్సరాల వెనుక దేవతలలో ఎక్కువ తక్కువలని చూడలేదు. అందరు దేవతలు సమానంగా చూడడానికే పంచాయతన పూజ ఏర్పడింది. అందువల్ల వేయి సంవత్సరాల వెనుకున్న సంప్రదాయాన్నే మేమూ అనుసరిస్తామని అంటున్నాము.

ఇట్లా సమన్వయం చేసి చూపిస్తా. నీ కులాచారాన్ని పాటిస్తూ శివపూజ లేదా విష్ణుపూజ చేర్చవచ్చు. నీ పూర్వులాచరించినట్లే చేయి. దానికి నీ ఇష్టదేవతను జోడించవచ్చు. వీలైతే పంచాయతన పూజ చేయి. ఏది చేసినా నీ కులాచారాన్ని గౌరవించడంలో ఏమరుపాటు వద్దు. వేయి సంవత్సరాల తరువాత కొన్ని మార్పులు చేసినవారు, నేటి సంస్కర్తలవంటి వారు కాదు. వారు పూర్వాచారాలను 99 పాళ్ళు నమ్మి కొన్ని మార్పులను మాత్రమే చేసారు. ప్రేమతో, వినయంతో, సమభావంతో అందర్నీ చేరదీసినా వర్ణాశ్రమాచారాలను తప్పని పూర్వాచార్యులు చెప్పలేదు. అయితే ఎందుకు మార్పులు చేసారంటారా? కొందరు శాస్త్రోల్లంఘన చేయడం వల్ల. దానిని అరికట్టడం కోసం కొన్ని మార్పులను చేసియుంటారు. కొందరు విష్ణువే పరమదైవమని ఎందుకన్నారంటే విష్ణువును నిందించే వారుండడం వల్లనే. అప్పయ్య దీక్షితులవారు అద్వైతానుభూతి కలవారు. ఈశ్వర, అంబ, విష్ణువులను రత్నత్రయంగా భావించి శివ మహిమను ఎందుకు పొగిడారు? ఆనాడు వీరవైష్ణవులుండడం వల్ల దానిని ఎదుర్కొనడం కోసం శివుణ్ణి ఎక్కువగానుతించారు. అట్టి సందర్భాలలో ఇతర దేవతలను నిందించారంటే మనమా పనికి పూనుకోకూడదు. నేటి సంస్కర్తలను అనుసరించేవారు తక్కువ. కాని పూర్వాచార్యులను లక్షలాది జనులు అనుసరించారు. ఒక మఱ్ఱి విత్తనం ఊడలు దిగి మహావృక్షమైనట్లు నేటికీ వారి సంప్రదాయాలు అవిచ్ఛిన్నంగా సాగుతున్నాయి. నేటి సంస్కర్తల వంటివారు కారు.

మనమే సంప్రదాయంలో పుట్టామంటే దానికి ఈశ్వరేచ్ఛయే కారణమని భావించాలి.

ఎవరైనా కులాచారంలో లేకపోయినా ఇష్టదైవాన్ని కొలిచినా సనాతన ధర్మం యొక్క మూలరూపాన్ని విస్మరించకూడదు. అనగా దేవతలలో భేదం చూడవద్దనే మూల సూత్రానికి అడ్డు రాకుండా ఉంటే చాలు. అటువంటప్పుడు

వైష్ణవుడు శివభక్తుడైనా నామం బదులు విభూతిని ధరించాలనే భావన అట్టివానికి రాదు. నుదుటిపై నామాలు ధరించినపుడు కేశవాది నామాలను ఉచ్చరించినా శివద్వేషంతో అప్పుడుండదు. విడిగా శివుణ్ణి పూజిస్తాడు. ఇంట్లో ఉన్నవారు ఆటంకం పెట్టరు. పెట్టినా అట్టివారిని వినయంతో ఒప్పించవచ్చు. మరీ వారు కాదంటే మానసికంగా శివస్తోత్రాలను పఠించవచ్చు కదా!

ముందు కులాచారం పూజించి, తరువాత ఇష్టదైవాన్ని భజించవచ్చు. వీరవైష్ణవుడై అద్వైతాచార్యుని పట్ల గౌరవం ఉంటే ముందు మీ జీయర్‌కి భిక్షవేసి అద్వైత మఠానికి చెందినవారికి తరువాత భిక్ష నీయవచ్చు.

కనుక శిఖ, సూత్రం, పుండ్రం. సమయాచార విషయంలో కులాచారాన్ని పాటించండని స్మృతి చెప్పడం వల్ల తప్పకుండా పాటించండి. స్మార్త సంప్రదాయాన్ని నిలబెట్టిన శంకరులు కూడా దేనిని రక్షించాలని ప్రశ్న వేసి కులధర్మాన్నే అని చెప్పారు. వేద ధర్మమనో, స్మార్త ధర్మమనో చెప్పలేదు కదా!

## పెద్దలు - మినహాయింపులు

కొందరు పెద్దలు కులాచారాలను అతిక్రమించిన వారుంటారు. వారిని ఆదర్శంగా సామాన్యులు గ్రహించరాదు. దివ్యానుభూతి కలిగిన అట్టివారు మన వంటివారు కదా.

రాజపుత్రవంశంలోని మీరాబాయి, నాయికా భావంతో కృష్ణుణ్ణి ఆరాధించింది. అది సంఘంలోని స్త్రీ ధర్మానికి విరుద్ధంగా కనిపిస్తుంది. పాతివ్రత్యంలో రాజపుత్ర స్త్రీలను మించిన వారు లేరు. మహమ్మదీయులు కోటను ముట్టడించినపుడు రాజపుత్ర స్త్రీలు మూకుమ్మడిగా అగ్నికి ఆహుతైపోయారు. ఆ ప్రదేశానికి చెందిన రాజపుత్ర స్త్రీ మీరాబాయి. భర్త

మాటను ధిక్కరించి పాటలు పాడుతూ ఉండేది. విషాన్ని కూడా నవ్వుతూ అమృతంలా సేవించింది. మనం అట్లా విషాన్ని మార్చగలిగితే మీరాబాయిని అనుకరించవచ్చు. ఆమె రక్షించుమని కృష్ణుణ్ణి వేడలేదు. అట్టివారిని అనుకరించగలమా?

వంజమూర్‌లో వైష్ణవునిగా పుట్టి శైవునిగా మారిన హరదత్త చారియర్ చరిత్ర కూడా ఇట్టిదే. వేలితో కాలుతున్న ఇనుపకడ్డీని పట్టుకొని శివమహిమను చాటాడు. తిరుమళిసై ఆళ్వార్ పేరు శివవాక్యర్. అతడు సిద్ధ పురుషుడై శివుని కీర్తించాడు. తరువాత విష్ణుభక్తుడై పన్నిద్దరు ఆళ్వారులలో ఒకడైనాడు. వీరందరూ సామాన్య వ్యక్తులు కారు అసాధారణ వ్యక్తులు.

కుమారిలభట్టు, బౌద్ధులతో కలిసి వారి వాదనలను వింటూ లోలోన వైదిక కర్మలను చేస్తూ ఉండేవాడు. ఒక పాండ్యరాజు జైనమతం పుచ్చుకోగా అతని భార్య మంగయార్ కరసి, రహస్యంగా విభూతిని ధరించేది. పరిస్థితుల ప్రభావం వల్ల బాహ్య ప్రపంచానికి మరొక విధంగా కనబడవలసి వచ్చింది. కాని వీరే మన మతాన్ని ఉద్ధరించారు. ఉత్తర దేశంలో బౌద్ధమతం క్షీణించడానికి కుమారిల భట్టు కారకుడు. అతడు కుమార స్వామి అవతారం. అట్లాగే సుబ్రహ్మణ్యుని అవతారంగా దక్షిణ దేశంలో జ్ఞానసంబంధర్ ఉండేవారు. దక్షిణ దేశంలో జైన మతాన్ని ఆయన అడ్డుకొన్నవాడు. పైన జెప్పిన మంగయార్ కరసి, ఇతణ్ణి మధురై రమ్మంది. అతని గొప్పదానికి ఆమె కారకురాలు. ఆమె 63 నాయనార్లలో ఒకతె. కుమారిలుడు బౌద్ధాన్ని ఎందుకవలంబించాడంటే వారి సిద్ధాంతాలను పూర్తిగా అవగాహన చేసుకొని వారిని ఓడించడానికే. ఇట్లా నటించడం తప్పని ఊకకు నిప్పంటించుకొని అందులో దగ్ధమైపోయాడు. అందే కులాచారాన్ని విడచి పెట్టాడని భావించకూడదు. అట్టి బాధాకరమైన మరణాన్ని అపేక్షించాడు.

## మతోత్సాహపరుల ధర్మం

పై మాదిరిగా మనముండగలమా? అనగా పైన నడవడి వేరు, లోపల ఆచారం పాటించుట చేయగలమా? ఇది కపటం కాదా అని ప్రశ్నిస్తారు.

వాళ్ళు స్వార్థంతో పనులు చేసారా? లోకహితం కోసం అట్లా ప్రవర్తించారు. మన మతానికి మనం కట్టుబడి కులాచారాన్ని ధిక్కరించేవారిని మాత్రం ప్రోత్సహించకూడదు. అందువల్ల అట్టివారి పనులను తప్పు పట్టనవసరం లేదు.

ఇక వేదాచారాలను మానివేసి ఇతరమతాన్ని స్వీకరిస్తే తప్పుగాని వైదికాచారాలలో ఒక ఆచారం విడిచి మరొక ఆచారాన్ని స్వీకరిస్తే పతితుడౌతాడా అని ప్రశ్న. అయితే ఒక సంప్రదాయాన్ని స్వీకరించిన మాత్రంచే నాస్తికునిగా మారడం లేదని గుర్తించండి. అయినా కులాచారాలను పాటించాలని లోగడ చెప్పాను.

మన కులాచారంలో తృప్తి లేక వైదికమతంలో ఉన్న మరొక సంప్రదాయం పట్ల మోజు చూపించినపుడు పైపైన మొదట కులాచారాన్నే పాటిస్తూ లోలోన కుమారిల భట్టు మాదిరిగా ఉండడమా? క్రొత్త సంప్రదాయం పట్ల మనకు సంపూర్ణ విశ్వాసం ఉంటే, అది సత్యమని నమ్మితే మనమూ అతని మాదిరిగా విజయాన్ని సాధించగలం. అపుడు బాహాటంగా మనం నమ్మినదానిని ఆచరించి చూపిస్తాం.

ఇక కపటం కాదా అని ప్రశ్న. ఒకటి తప్పని ఎందుకనుకోవాలి? స్వార్థం కోసం చేస్తే తప్పు. ఒకడికి ఉపకారం చేయడం కొరకు ఇంకొకరికి హాని చేయడం తప్పు. కాని వైదాంట్లో తప్పేమీ లేదు. నా ఉద్దేశం ఏమిటంటే ఎవరైతే మన మతాన్ని అంటి పెట్టుకొనియున్నారో వారు స్వేచ్ఛ పేరుతో కులాచారాన్ని వదిలి వెళ్ళేవారిని బలపరచకూడదని, వేదాచారంలో ఒక

సంప్రదాయం నుండి మరొక సంప్రదాయాన్ని మారినా వారి కులాచారాన్ని పాటించినంతవరకూ తప్పు కాదనే, ఒక మంచి దారిని వదిలి మరొక మంచి దారిలోకి వెడుతున్నారు మాత్రమే. ఇట్లా మారిన వారిని చూసి ప్రస్తుతం స్వేచ్ఛ పేరుతో వారి వారి కులాచారాన్ని విడిచివేస్తున్నారు. అపైన తప్పుడు త్రోవలు త్రొక్కుతున్నారు. ఇట్టివాడు తాను పతితుడై ఇతరులను పతితులను చేస్తున్నాడు. ఇట్టివారిని ప్రోత్సహించకూడదు.

సారాంశం – కులాచారాన్ని విడిచిపెట్టకుండా భిన్న సంప్రదాయాలపై మోజు ఉన్నా, మన భావ తీవ్రతను బట్టి భగవానుడే తీరుస్తాడు.

### ఆచార లక్షణాలు

మతాచారాలు బాహ్యంగా కనబడినా ఆచారాలకు, మతానికి సంబంధం లేదని అనకూడదు. ఆచారం, లోనున్న మనఃప్రవృత్తికి దోహదం చేస్తుంది. దినచర్య గురించి మన శాస్త్రాలలో చాలా వివరణలున్నాయి.

ఆచారాన్ని తమిళంలో ఒళుక్కం అంటారు. మన జీవితం కంటె ధర్మమార్గం గొప్పదని, ఆచారాన్ని పరిరక్షించుకోవాలనే అర్థం ఈ మాట తెలియజేస్తుంది. తిరువళ్ళువర్ ఈ మాటనే వాడాడు. ధర్మమనేది బాహ్యము, అంతరము కూడా.

లోపలి వాటికి సంబంధించినది Character అని; బాహ్యమైన ప్రవర్తన Conduct అని ఆంగ్లేయులంటారు. ఆచారం, ఒళుక్కం శబ్దాలు పై రెంటినీ సూచిస్తాయి. మన ధర్మాలు ఒక్క నీతిని గురించి చెప్పడమే కాకుండా ఇహ పరలోకాలకు చెందిన అనేక క్రియా కలాపాలు, సంస్కారాలిందులో ఇమిడి యున్నాయి.

## బాహ్యంనుండి ఆంతరానికి

ఈ శరీరంలో ఐదు కోశాలున్నాయి. ఈ శరీరం అన్నమయ కోశానికి చెందింది. జ్ఞానులు దీనిని పట్టించుకోరు. ఎట్టి శుభ్రతను పాటించకుండా తిరిగే యోగులను గురించి వింటూ ఉంటాం. అయితే శుచి శుభ్రతల గురించి ఎన్నో నియమాలు మన గ్రంథాలలో ఉన్నాయి. ఇవి పాటిస్తే జ్ఞానుల స్థితి పొందవచ్చు అని అన్నారు. ఆత్మను చేరడం లక్ష్యమైనా ఇట్టి ఆచార పరంపర దానికి దోహదం చేస్తుందన్నారు.

ఇవి ప్రత్యక్షంగా ఉపకరించకపోవచ్చు. మనం నిజమైన వేదాంతులు కావాలంటే ముందు శరీరం, కుటుంబం, సంఘం గురించి పట్టించుకోవాలి కదా! కనుక ఆచారాలను పాటించాలి. **ఆచారహీనం, న పునంతి వేదాః** అనే మాట ఉంది. ఎంత వేదం చదివినా ఆచారం లేకపోతే ఆ వేదం వానిని రక్షించదని అర్థం. పవిత్రమైన గంగాజలం కపాలంలో పోసినా, ఆవుపాలను తోలుతిత్తిలో పోసినా వ్యర్థమే కదా? ఉపన్యాసాలు, పుస్తక పఠనం – రచనల వల్ల పవిత్రుడని భ్రాంతి పడకూడదు. వీరిలో చాలామంది ఆచారాలకు గుండు సున్న చుట్టినవారే. కనుక వీరి మాటలకు విలువ ఉండదు. ఆత్మానుభవం కలవారి మాటలే జనులలో నాటుతాయి. చాలాకాలం నుండి సత్పురుషులు పాటించినది సదాచారమని, శిష్టాచారమని అంటారు. విద్వాంసులై, జీవితంలో నేర్చుకొన్నది ఆచరించినవారు శిష్టులు. ఇట్టివారి ఆచారాలను చూసి కొందరాధునికులు, ఆత్మకు వీటికి సంబంధం లేదని ఏవేవో అంటారు. జ్ఞానం వల్ల, నిజమైన భక్తివల్ల ఆచారాలతో కూడిన కర్మలవల్లనే కదా పరతత్త్వం పట్టుబడేది?

## ఆచారంలో మామూలు ధర్మాలు

సామాన్య ధర్మాలలో శౌచం నాల్గవది. మనుస్మృతి ఐదు, సామాన్య ధర్మాలను అందరికీ విధించింది. అహింస, సత్యం, అస్తేయం (దొంగతనం

చేయకుండా ఉండుట), శౌచం, ఇంద్రియ నిగ్రహములు.

శౌచ ప్రక్రియలోనే సాధారణంగా ఆచారం వస్తుంది. మిగతావన్నీ దీని పరిధిలోకే వస్తాయి.

ఆహారంలో శౌచం అంటే మాంసాహారాన్ని తినకుండా ఉండటం. అనగా చంపకపోవడం అహింసయే కదా. సత్యం కంటె మించిన ధర్మం లేదని సూక్తి. సత్యాత్ నాస్తి పరోధర్మః కనుక సత్యము కూడా ఆచారమే. ఒకడు దొంగతనం చేస్తే రాజుచేత దండింపబడతాడు. తప్పు చేసినవాడు ప్రాయశ్చిత్తం చేసుకొనకపోతే అతణ్ణి వెలివేసేవారు. నిజంగా తప్పు చేస్తేనే కారాగారవాసం. తప్పు రెండు రకాలు. ఒకటి పౌరసంబంధమైంది, రెండవది నేరసంబంధమైనది. పౌరసంబంధమైనది మోసం మొదలైన వాటితో ఉంటుంది. అసత్యం వల్ల కారాగారానికి వెడుతున్నాడు. అట్లా వెళ్ళకుండా ఉండాలంటే సత్యాన్ని పాటించాలి కదా. కనుక అది సామాన్య ధర్మమైనది. ఇతరుల ఆస్తిని తిరిగి ఇయ్యకపోవడం మొదలైనవి ఆస్తేయంలోకి వస్తాయి. కనుక ఇది మూడవ ధర్మము. నేర సంబంధమైన వాటిల్లో క్రౌర్యం, చంపుట మొదలైనవి ఉంటాయి. సంఘర్షణలు పనికిరావు కనుక అహింసయనే ఆచారం ఏర్పడింది. దొంగతనం చేయకుండా ఉండడం, అస్తేయం. స్త్రీలను అవమానించుట, వ్యభిచారం మొదలైనవి పౌర, నేర సంబంధమైన వాటిల్లోకి వస్తాయి. ఇంద్రియ నిగ్రహం ఐదవ సామాన్య ధర్మం. కనుక ఆచారంలో సత్యం, త్యాగం, లోభిత్వం లేకుండుట, అహింసాదులు శౌచ నియమంలో అదనంగా వస్తాయి. ఒక ఆచారాన్ని పాటించకపోతే ఇచ్చిన వాగ్దానాన్ని భంగం చేసినంత, వేయి అబద్ధాలు చెప్పినంత ఇతర ప్రాణులను హింసించినంత, బంగారం, ఇతరుల భార్యలను ఆపేక్షించినంత పాపాన్ని మూట కట్టుకొంటాడనే శపథాలున్నాయి. కనుక ఆచారం, శౌచంలో ప్రధానంగా వచ్చి మిగిలిన ధర్మాలను కలుపుకొంటుంది.

విద్యాభ్యాసం చేసేటపుడు బ్రహ్మచర్యమని, వివాహానంతరం గృహస్థాశ్రమంలో కొన్ని తిథులలో భార్యాభర్తలు కలవకూడదని అనేక ఆచారాలున్నాయి. ఇవన్నీ ఇంద్రియ నిగ్రహాన్ని కలిగించడానికే ఇవన్నీ మనస్సులోని చెత్తను తుడిచి వేయడానికీ, ఇంద్రియ నిగ్రహాన్ని కలిగించడానికీ కనుక అన్ని ధర్మాలూ ఆచారం పరిధిలోకి వస్తాయి.

## ధర్మాచారాల సంబంధం

దీనిని మరొక విధంగా చెప్పవచ్చు. ధర్మమనే మందుకు ఆహార నియమం ఆచారమౌతుంది. రోగం తగ్గాలంటే కేవలం మందు తీసుకొంటే సరిపోదు కదా. పథ్యమూ చేయాలి. కనుక ధర్మమనే మందు పట్టీయాలంటే బాహ్యమైన శౌచాదులనే ఆచారాలను పాటించాలి. ఈ శౌచము బాహ్యము, ఆంతరము కూడా. ఉదా: పితృతర్పణం. ఇందు స్నానం, మంత్రములు, తిలలు, యజ్ఞోపవీతాన్ని అపసవ్యంగా ధరించుట, దక్షిణంవైపు తిరిగిచేయుట వంటి ఆచారాలు పథ్యం వంటివి. వీటికి విరుద్ధంగా చేస్తే ఫలితం రాదు.

ధర్మంలో ఆచారం ఒక భాగం. ధర్మమే ఆచారం. ఆచారం నుండే ధర్మం పుట్టింది. ఆచారః ప్రభవో ధర్మః కనుక ఆచారము, ధర్మమూ కలిసే ఉంటాయి. ధర్మాన్ని ఆచరించినవారు సత్పురుషులు లేదా శిష్టులు, కనుకనే ఆచారాన్ని సదాచారమని, శిష్టాచారమని అంటారు. ఆచారం పాటించక పోవుట అనాచారం, ఆచారానికి విరుద్ధంగా ప్రవర్తించుట దురాచారం.

అన్ని ధర్మాలు ఆచారంలోకి రాగా మిగిలిన ఆరోగ్యం, వైద్యం, మనస్తత్వం, ప్రేమ, ఆధునికమైన సైన్సుకీ సంబంధించినవన్నీ కూడా ఇందులోకి వస్తాయి. ఇవన్నీ మన ఆధ్యాత్మిక ప్రగతికి దోహదం చేస్తాయి.

## దృష్ట అదృష్ట ఫలాలు

ఆచారాలవల్ల కొన్ని కనబడే ఫలాలు, కొన్ని కనబడని ఫలాలుంటాయి. ఉదా: దంతధావన చేయకపోతే దుర్గంధం, రోగం. త్రాగినవానికి మతి

తప్పులు, కుటుంబ బాధలు వంటివి పైకి కనబడేవి. ఇట్లా ఫలాలు కనిపిస్తేనే ఆచారాలను పాటిస్తామనడం సబబు కాదు.

పుణ్య పాపఫలాలు అదృష్టాలు. ఆచారాలు ఇహ పరలోకాలకు చెందినవి. ప్రొద్దునే స్నానం చేయుడం వల్ల దృష్టా దృష్ట ఫలాలు లభిస్తాయని ఒక సూక్తి:

ప్రాతః స్నానం ప్రశంసంతి దృష్టాదృష్ట ఫలంహి తత్

సూర్యోదయానికి ముందు ప్రాతఃకాలం అనగా అరుణోదయ కాలం. నఖ శిఖ పర్యంతం చన్నీటితో స్నానం చేయుడం వల్ల సోమరితనం పోవుట, ఉత్సాహం కల్గుట మనస్సు తేలికపడుట అనుభవంలో ఉన్నవే. ఈ స్నానంవల్ల నరాలబాధలు కూడా తొలగిపోతాయని నేటి సైన్సు అంటోంది.

ఈ స్నానంతోబాటు మంత్రపఠనం, నామస్మరణవల్ల మానసికంగా కూడా బలం కల్గుతుంది. ఇట్లా మనస్సు కూడా శుద్ధి పొందుట వెంటనే కనబడదు. ఈ పుణ్యం, కాలాంతరంలో కన్పిస్తుంది. పుణ్యపాప ఫలాలు మనచేతిలో లేవు. ఈశ్వరుని అధీనంలో ఉన్నాయి. అన్నిటిని కనబడకుండా చేసే మాయావి అతడు. ఆ మాయావి సత్పురుషులపై, ఋషులపై, దయను చూపిస్తాడు. కనుక కొన్ని రహస్యాలు వారికి తెలియజేస్తాడు. ఫలానా దానివల్ల అదృష్ట ఫలమని వారు చెప్పగలరు. ఈ ఫలం కనబడడం లేదని శాస్త్రీయంగా ఋజువు కనబడాలని పట్టుపట్టడం సబబు కాదు. ఆచారం అంటే యాంత్రికంగా సాగేది కాదు. అది తపశ్శర్యలతో, భక్తితో, ప్రేమతో మానసికంగా, శారీరకంగా సాగేది. లేకపోతే ఫలం రాదు.

## అన్ని పనులు ఈశ్వరునితో

శారీరకంగా ఆచారాలను పాటిస్తున్నా, మానసికంగా ఈశ్వరునితో, అతని ప్రతినిధులైన దేవతలతో సంబంధం కలిగి యుండాలి.

స్నానం చేసినపుడు కొన్ని దర్భలను, మట్టిని తీసుకొని నెత్తిపై పెట్టుకొంటారు. ఆ దర్భలు ఈశ్వర శక్తికి ప్రతీకలని దూర్వాసూక్తం చదువుతారు. గడ్డిపరకల్లా కనబడేవాటిల్లో కూడా ఈశ్వరశక్తి దాగియుంది. లక్ష్యపెట్టని మట్టిని భూదేవిగా భావించాలి. ఆవిడ నారాయణుని పత్ని. మట్టిని పెట్టుకొని మృత్తికాసూక్తం చదువుతారు. ఆ తరువాత అఘమర్షణ సూక్తం ఉంది. దీనిని స్నానం చేస్తున్నపుడు చదువుతారు. వీటిని చదువుతూ శారీరక శుద్ధితో బాటు మానసిక శుద్ధిని పొందుతున్నారు. పాపాన్ని పోగొట్టేది అఘమర్షణ సూక్తం. అది రానివారు గోవిందనామాన్ని జపించాలి. **గోవిందేతి** సదాస్నానం అని ఉంది కదా.

గోవింద నామమే పవిత్ర జలం వంటిది. అయితే గోవింద నామాన్ని ఉచ్చరిస్తే స్నానఫలం వస్తుందని, స్నానం చేయకుండా భుజించకూడదు. ఎప్పుడైనాతఈ ఆచారానుష్ఠానాలు కుదరని సంకట పరిస్థితులలోనే గోవింద నామాన్ని ఉచ్చరించి పనులు చేసుకోవాలి. అది సులభంగా ఉందని అన్ని కర్మలను విడిచి పెట్టకూడదు. ఏ ఆచారం లేకుండా భజన చేస్తూ కూర్చుంటానంటే భగవంతుడామోదిస్తాడా? అట్లా పై వాణ్ణి మోసం చేయడానికి ప్రయత్నించడం. భక్తి తీవ్రత ఉన్న వారి దారి వేరు. కేవలం నామ సంకీర్తన వల్లనే అనేక సిద్ధులను చూపించే మహాత్ములున్నారు. మిగిలిన వారందరూ ఆచారాలను తప్పక పాటించవలసిందే.

కొందరు శారీరక పరిశ్రమ చేసి సంఘానికి తోడ్పడుతున్నారు. వారికి మాత్రం తీవ్ర ఆచార నియమాలు లేవు

## ఆచారంలో శాస్త్రీయ సూక్ష్మాలు

ఆచారాలను నిన్న మొన్నటివరకూ ఆధునికులు ఆక్షేపించేవారు. ఆధునిక శాస్త్ర పరిశోధనలు వృద్ధి పొందిన కొలదీ కొన్ని ఆచారాలు చాలా

శాస్త్రీయమైనవని ఋజువు చేస్తూ ప్రాచీన భారతీయులు పెట్టిన ఆచారాలను నేడు ప్రశంసిస్తున్నారు. నాస్తికులైన రష్యా శాస్త్రజ్ఞులు హోమం, అణుధార్మిక శక్తిని తగ్గిస్తోందని ఋజువు చేసారు. ఆవు పిడకలతో, ఆవునేతితో, సమిధలతో కూడిన హోమమది. ఆ పొగ పదార్థాలను కుళ్ళకుండా చేస్తుందని ఋజువు చేసారు. అటువంటిదే మారేడు, తులసి దళాలు. గ్రహణ సమయంలో గర్భిణులు ఆ గ్రహణాలను చూడరాదని, ఆ సమయంలో ఏమీ తినకూడదనే నియమాలున్నాయి.

స్వార్థంతో విజ్ఞానం వ్యాప్తి చెందకూడదని కట్టు కథలతో పూర్వులు సరిబుచ్చారని నేడు విమర్శిస్తూ ఉంటారు. శాస్త్రీయ సత్యాలను అపరిపక్వ మనస్సులకు అందీయలేదు. *(అణుబాంబును తయారుచేయడాన్ని అందరికీ తెలియపరుస్తున్నారా? కొన్ని దేశాలకే తెలుసు. అట్టి రహస్యాలను ఇతరులకు చేరవేస్తే వారిని శిక్షిస్తున్నట్లు పత్రికలలో చదువుతున్నాంకదా)* వేయి సంవత్సరాల వెనుక భోజుడు, సమరాంగణ సూత్రంలో వ్యోమయానం గురించి విమానాలు గురించి సూచన ప్రాయంగా చెప్పాడు. నేను దీని పూర్తి విధానం చెప్పగలిగి యుండే దీనిని వివరించడం లేదని. అందరికీ తెలిస్తే మేలుకంటె కీడే ఎక్కువ జరుగుతుందని అట్లా అన్నాడు. నేడు సైన్సు ఎంత వృద్ధి పొందినా దుష్పరిణామాలను చూస్తున్నాం. నేలమీద జరగవలసిన యుద్ధాలు ప్రపంచ సంగ్రామంలో విమానాలతో జరిగి ఎంత నష్టం వచ్చిందో తెలియంది కాదు. జపాన్‌పై వేసిన అణుబాంబు ప్రభావం, ఈనాటికీ కన్పిస్తోంది కదా! మన ఆచారాలను కాలదన్ని సైన్సునే వృద్ధి చేస్తే వచ్చే అరిష్టాలు అన్నీ ఇన్నీ కావు. హృదయం వికసించకుండా కేవలం మెదడు వృద్ధి పొందితే వచ్చే ఫలాలివి. కనుక శాస్త్రీయ రహస్యాలను పూర్వులు గోప్యంగా ఉంచారు.

సైన్సు కొద్దిగా ఉన్నపుడు మన ఆచారాలను వేళాకోళం చేసారు. అది వృద్ధి పొందినకొలదీ మన ఆచారాలకు బలం వస్తోంది.

## సైన్సుకి లొంగేది కాదు

మన ఆచారాలన్నీ నేటి సైన్సుకి లొంగి తీరాలని నేనడం లేదు. వాటి ప్రమాణాలు వాటికుంటాయి. సైన్సుకి అతీతంగా నియమాలను ఏర్పాటు చేసారు ఋషులు. అది ఒక Super Science. ఋషి వాక్యం కాలాతీతం. మనం సాంఘిక నియమాలను చీటికీ మాటికీ మార్చినట్లు నేటి సైన్సుకి సరిపడడం లేదని వాటికి సవరణలు చేయడం కుదరదు (*సైన్సులో ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించి కొంత కాలానికి అది తప్పని అందులోని వారే అంటున్నారు కదా! అది మారుతూ ఉంది కదా*).

సైన్సు చెప్పిన నియమాలకు నేటి ఆచారాలు కట్టుబడాలని శాస్త్రాలను మారిస్తే ఎలా? ఉదా: పూజా మందిరాన్ని గోమయంతో అలకడానికి బదులు క్రిమిసంహారకమైన ఫినాయిల్‌తోనో, కార్బాలిక్ ఏసిడ్‌తోనో కడగాలని అనడం వంటిది. వైదిక కర్మలను కర్రపీట మీద కూర్చొని చేయాలని అది మనలోని విద్యుత్ శక్తి భూమిలోకి పోకుండా అంటే రబ్బరు కుషన్ మీద కూర్చోవచ్చుని పవిత్రం ధరించే బదులు చేతికి రబ్బరు తొడుగు తొడుక్కోవచ్చుని ఆధునికులంటే ఎలా?

పూర్వులకు విద్యుదయస్కాంత సిద్ధాంతం (Electro - Magnetic Theory) తెలుసు. విశ్వం అంతా విద్యుత్తుతో నింపబడింది. మన శరీరంలో, భావాలలో కూడా విద్యుత్తు ఉందని నేటి శాస్త్రజ్ఞులంటున్నారు. విద్యుత్తుకు ఏవి సద్వాహకాలో, ఏవి పనికిరావో తెలుసు కాబట్టి అట్టి పరికరాలను నిర్మించారు. హోమం చేసేటపుడు విద్యుత్ వాహకానికి కుదరని పీట కర్ర తెడ్డునే ఉపయోగించాలన్నారు. రాగి విగ్రహాలు, పట్టు బట్టలు మొదలైనవి సద్వాహకాలు (Good Conductors).

ఉత్తరంవైపుకి తల పెట్టుకొని పడుకోరాదనే నియమం ఏనాటిదో ఉందని తెలుసు. కొన్ని సంవత్సరాల వెనుక దీనిని పిచ్చి నమ్మకం అన్నారు. కాని మన మెదడులో విద్యుదయస్కాంత శక్తి ఎక్కువ మోతాదులో ఉంటుందని, ప్రపంచంలో ఉత్తర ధ్రువం దగ్గర ఎక్కువగా ఉంటుందని, దానికీ దీనికీ సంఘర్షణ వస్తే మన మెదడు దెబ్బతింటుందని కనుగొన్నారు కదా! ఆపైన జపధ్యానాలకు ఉత్తర దిక్కు శ్రేష్ఠమైనదే. నిద్రలో మన మెదడు అదుపులో ఉండదు కావున పిచ్చి కలలు వస్తాయని అటువైపు తిరిగి నిద్రించవద్దన్నారు. ధ్యానంలో మన మనశ్శక్తి వృద్ధి పొందుతుంది. సరిగా పట్టుకోకపోతే ఏది మనలను దెబ్బతీస్తుందో (Shock) అదే మనకు ఒక్కోసారి ఉపయోగిస్తుంది కదా. కనుక పడుకొనేటపుడు మెలకువగా నున్నపుడు మన మెదడు తేడాగా ఉంటుంది. ఆపైన మేరువునందున్న జ్ఞానుల, యోగుల అనుగ్రహం లభిస్తుంది. భాష ద్వారా కాకుండా ఇతర విధానాల ద్వారా భావప్రసారం చేయడాన్ని (టెలిపతీ) నేడు అంగీకరిస్తున్నారు.

పై శక్తి ఉందని ఋషులు కంఠోక్తిగా పేర్కొనకపోయినా నియమాలట్లా పెట్టారు. గణపతి కథ మనకు తెలిసిందే కదా. ఒక కత్తిని పిల్లవానికి ఎట్లా ఈయమో అట్లాగే కొన్ని శాస్త్ర నియమాలను సామాన్యులకు వెల్లడించరు. పురాణాలలో ఎన్నో శాస్త్ర నియమాలు, కథల రూపంలో అందింపబడ్డాయి.

దంతధావన చేయకుండా కాఫీ త్రాగడం, స్నానం వేళకు చేయకపోవడం, ఒంటినిండా బట్ట కప్పుకోవడం వంటివి నేడు తప్పని, శీతోష్ణ పరిస్థితుల కనుగుణంగా వస్త్రధారణ ఉండాలని నేడూ అంగీకరిస్తున్నారు కదా.

రోగాలు దరిచేరకుండా చేయడమే ఆచార లక్ష్యం కాదు. దానివల్ల పుణ్యం వస్తుందని, కర్మ క్షయమౌతుందని చెబుతారు. ఆరోగ్యమే ప్రధానమనుకొంటే మనిషి దానిని విడిచి పెడతాడు. ప్రజలు గుమిగూడినపుడు మధ్యలో ఉండడం వల్ల అనారోగ్యం వస్తుందంటే రథయాత్రలో పాల్గొన్న

తరువాత స్నానం చేయకూడదని మన ఆచారం చెప్పింది. మరి ఈ ఆచారానికి, నడవడికకు సంఘర్షణ రావడం లేదా? ఆచారాలు కేవలం ఆరోగ్యానికే మనం అంటే ఆలయ పుష్కరిణులు మురికిగా ఉన్నా స్నానం చేయాలని అంటున్నారు కదా. ఇట్టి సందర్భాలలో అనారోగ్యం వస్తుందని అంటున్నామా? మహాత్ములు భుజించిన తరువాత ఆ ఎంగిలి విస్తళ్ళపై దొర్లడమూ ఉంది. కనుక ఆచార లక్ష్యం, పుణ్య సంపాదనయే. ఆ పుణ్యఫలం, సైన్సుకి అందేది కాదు.

డా. కింగ్ అనే సానిటరీ కమిషనర్ ఉండేవాడు. ఆయన IMS (All India Medical Services లాంటిది) దానిలో సభ్యుడు. ఆయన మన ఆచారాలను సమర్థిస్తూ వ్రాసాడు. పురుడు మైల వచ్చిన వారింట్లో ఏమీ తినకుండా ఉండడం, స్నానం చెయ్యడం, పిండిన బట్టలు, ఉతికిన బట్టలు కట్టుకోవడం కాలుష్య నివారణకు అనే విషయాలు శాస్త్రీయములే అని ఋజువు చేసాడు. జీన్సు, వైరస్, బాక్టీరియా.. అంటే మూలకణాలు, రోగ క్రిములు, సూక్ష్మజీవులు మొదలైనవాటిని ఆధారంగా చేసుకొని వ్రాసేడు. మానసిక శాస్త్రం వృద్ధి పొందడం వల్ల తరంగాలు, ఆరా (కాంతి వలయం) మనిషికి మనిషికీ భిన్నంగా ఉంటాయని. కనుక ఇతరులను అనవసరంగా తాకరాదని దానివల్ల శారీరక అనారోగ్యమే కాక, మానసిక అనారోగ్యం వస్తుందని అంటున్నారు. అందుకనే మనవాళ్ళు, ఇతరుల మంచాలపై పరుండరాదని, ఇతరులు ధరించిన చెప్పులను, గొడుగును, బట్టలను వాడకూడదని, చివరకు వారు త్రాగిన పాత్రలను వాడరాదని ఎన్నో నియమాలుంచారు.

అట్లాగే స్త్రీలు బహిష్టలైనపుడు తాకరాదనుట నేటి సైన్సు అంగీకరించినా అట్టిది పాపమని మనం అంటాం. ఇంద్రుడికి బ్రహ్మహత్యా దోషం వచ్చిందని ఆ పాపాన్ని స్త్రీలలో ఆ మూడురోజులూ ఉంచాడని కథ ద్వారా అందించారు.

ఈ సమయంలో వారి శారీరక మానసిక తరంగాలు, చుట్టూ కాంతి వలయం వంటివి కంటికి కనబడవు.

పంచకచ్ఛలు పోసి (ధోవతి) కట్టడం మనం ఆచారం. ఒక కొంగును విడిలేసినా మన మానసిక శక్తి తప్పించుకొని పోతుందని ఒకాయన వ్రాసాడు. మహమ్మదీయులు, లుంగీని ఇరువైపులా కుట్టి వాడతారు.

అట్లాగే గంగాజలంపై పరిశోధనలు చేసారు. కలరా వచ్చి చనిపోయిన వాని శరీరాన్ని గంగలో కలిపినపుడు దాని ప్రక్కనున్న జలాన్ని పరీక్షించగా ఆ నీటిలో కలరా క్రిములు కనబడలేదని అన్నారు. ఇది మంచివార్త. అయితే రోగాలు పోగొడుతుందని మనం గంగను పూజించడం లేదు. అది పాపాన్ని పోగొడుతుందని, పుణ్యాన్నిస్తుందని, సంసార వలయాల నుండి దూరం చేస్తుందని నమ్ముతాం. ఇట్టి పుణ్యపాపాలు, మోక్షాలు సైన్సు పరిధిలోకి రావు.

స్టెన్‌లెస్ స్టీల్ అనే ఇనుప పాత్రను విరివిగా వాడుతున్నాం. వద్దని శాస్త్రాలన్నాయి. ఇనుము త్రుప్పు పడుతుంది కాని ఇది పట్టదని అంటారు. కాని శాస్త్రం ఇది పాపహేతువని చెప్పింది. అవి దుష్టశక్తులను ఆకర్షిస్తాయని అన్నాయి శాస్త్రాలు. ఈ మాట సైన్సుకి అందదు.

అట్లాగే హోమంలో వాడే ద్రవ్యాలు, రాక్షస శక్తులను పారద్రోలతాయని, దైవశక్తులకు ఆహ్వానం పలుకుతాయని మనం అంటే ఇది వాతావరణాన్ని శుభ్రం చేస్తుందని నేటివారు ఋజువు చేసారు. ఆ ద్రవ్యాల కంటె భిన్నమైనవి వాడితే హోమ ప్రయోజనం సిద్ధించదు. వారు చెప్పినవి వాడితేనే పవిత్రతతో బాటు వాతావరణ కాలుష్యాన్ని నివారించవచ్చు.

ఆచారాలు మానసిక తృప్తి నిస్తాయని కనుక శాస్త్రాచారాలను సమర్థించవచ్చని అంటారు. ఆవును గోమాతయనడం అటువంటిదని అంటారు. అది ఇచ్చే ద్రవ్యాలను బట్టే కాదు, అది పుణ్యాన్ని ప్రసాదిస్తుందని

మనం అంటాం. ఆ విషయం, మానసిక వైద్య శాస్త్రజ్ఞుల కందేది కాదు. ఆవు పాలు, పెరుగే కాదు, గోమూత్రం, గోమయం కూడా మన ఆరోగ్యానికి మంచివని ఏనాడో పూర్వులు గ్రహించారు. అట్లా పంచగవ్యాన్ని సేవిస్తే ఆరోగ్యమే కాదు, పాపాలూ పోతాయి, వాటిని మంత్రాలతో కలిపి సేవిస్తే ఇంకా మంచిది.

ఇట్లా ఏ పరికరాలు లేకుండా ఇవన్నీ ఎట్లా కనుగొన్నారని మనం ఆశ్చర్యపోతాం. ఈశ్వరానుగ్రహం వల్ల వారికట్టి మానసికశక్తి అబ్బింది. అట్టివారిని మూర్ఖులనడం మన మూర్ఖత.

## ఆత్మతృప్తికై ఆచారం

ఆవును అలంకరించడంలో మానసిక తృప్తి ఉంది. ఆలంకారిక దృక్పథమూ ఉంది. కాని పూజ చేసేటపుడు వెనుక భాగానికే చేస్తాం. కారణమేమిటని ప్రశ్నించం. వెనుక తట్టులోనే లక్ష్మి ఉంటుందని ఋషులు ఊరకే చెబుతారా? కనుక మనం నమ్మాలి. ఇక్కడ మానసిక తృప్తి అనేమాట సరిపోదు. శాస్త్రాచారాలు ఆత్మతృప్తికై ఉద్దేశింపబడ్డాయని మరిచిపోరాదు. పుణ్య సంపాదన, కంటికి కనబడేది కాదు.

మనం ఆలయానికి వెడతాం. దారిలోని ఆస్పత్రిలో బాలింతరాలైన చెల్లెలు ఉందని తెలిస్తే చూస్తాం. వచ్చినందుకు ఆమె తృప్తి పడుతుంది. ఇది మానసిక తృప్తికి చెందినది. స్నానం చేసి ఆలయానికి వెళ్ళాలి. చేయకుండా వెళ్ళకూడదు. ఆలయానికి తప్పనిసరిగా వెళ్ళవలసి వచ్చినపుడు, స్నానం చేయడానికి వీలు పడకపోతే ఆమెను చూడకుండానే వెళ్ళాలి. ఎందుకంటే పురిటిగది, ఆస్పత్రిలోని కాలుష్యాన్ని ఆలయానికి తీసుకొని వెళతామా! ఈ మాత్రం త్యాగం చేయక తప్పదు. ఇక్కడ మానవత్వానికి శాస్త్రాలు

చోటీయలేదని చెప్పకూడదు. వైద్య శాస్త్రాన్ని తప్పు పడుతున్నామా? శస్త్రచికిత్స చేసే గదిలోకి మనం ప్రవేశిస్తే ఊరుకొంటారా? రోగియొక్క ఆరోగ్యాన్ని దృష్టిలో పెట్టుకొని వద్దన్నారు. వారి మాటను గౌరవిస్తున్నాం కదా! అపుడు మానసిక తృప్తిని త్యాగం చేసినట్లే కదా! అందువల్ల మన ఆత్మక్షేమం కోసం శాస్త్రాలు కొన్ని విధులనుంచాయి. అందుకే పురుడు, మైలలలో నియమాలున్నాయి.

అయితే పురుడు, మైల, బహిష్ఠ నియమాలు మిగతా దేశాలలో ఉన్నాయా? పాశ్చాత్యులే ఆధ్యాత్మిక జ్ఞానంలో వెనుకబడి యున్నామని అంటున్నారు కదా. కనుక శ్రేయస్సు కావాలంటే, ఆత్మ జ్ఞానం కలగాలంటే శాస్త్రప్రకారం నడవాలి. మిగతా దేశాల గురించి ప్రస్తావించనేల?

ప్రపంచంలో ఈ దేశాన్ని కర్మభూమిగా పరమేశ్వరుడు నిర్దేశించాడు. ఒక ఇల్లు ఉంటే వంటకు, నిద్రకు, పూజకు విడివిడిగా గదులుండడం లేదా? దేని అవసరం దానిది. ఒక గదిలో అన్నీ చేయము కదా! అందువల్ల ఈ దేశాన్ని కర్మభూమిగా పరమేశ్వరుడు తీర్చిదిద్దాడు. కనుక అనేక ఆచారాలున్నాయి.

కొన్ని నియమాలు కఠినంగా ఉన్నా దయతోనే అందించాడు. పరలోక సుఖానికి భంగం లేని రీతిలో ఇహలోక సుఖాలనుభవించవచ్చనీ శాస్త్రాలన్నాయి. రోగాలు లేకుండా పరస్పర ఐకమత్యంతో బ్రతకడానికి అనేకాచారాలున్నాయి. ఇందులో ఉదారభావం లేదని భావించవద్దు.

## ఆచార భేదం - కురల్ తీర్పు

ఆచారాలను పరికిస్తే ఇవన్నీ బ్రాహ్మణవర్ణాన్ని ఉద్దేశించి చెప్పబడి నట్లుంటాయి. దీని లక్ష్యాన్ని అర్థం చేసుకోకుండా అంతా పక్షపాత ధోరణిలో

ఉందని విమర్శిస్తారు. అవి పక్షపాతంతోనే కూడి యుంటే మొత్తం బరువును బ్రాహ్మణుల మీదనే వేసేవారు కాదు కదా! వీరికి కావలసినంత స్వేచ్ఛను ఇచ్చేవారు కదా!

అందరూ అంగీకరించే తిరువళ్లువర్ అభిప్రాయం వినండి. "వ్యక్తిగత కులాచారాలున్నాయి. అందరికీ ఒక ఆచారం కాదు. బ్రాహ్మణులకు ఎక్కువగా ఉన్నాయి. బ్రాహ్మణ్యమని బ్రాహ్మణుల కులాచారాన్ని అంటారు. సామాన్యాచారాలు, అందరికీ ఉన్నాయని, ప్రాణం కంటె విలువైనది సత్ప్రవర్తన" అని అన్నాడు. మంచి ప్రవర్తనవల్ల సత్కులమని, దుష్ప్రవర్తన వల్ల అధమ జన్మమని అన్నాడు.

వేదాలు మరిచిపోతే మరల చదువువచ్చు. ప్రవర్తన సరిగా లేకపోతే ఇక పతనమే అన్నాడు. ద్విజత్వం పోతోందన్నాడు. వేదం చదివిన మాత్రంచే అందరూ బ్రాహ్మణులు కావచ్చని ఆధునికులన్నట్లు అనలేదు. ఆచారం పోతే బ్రాహ్మణ్యం పోతోందన్నాడు.

**ఆచారహీనం నపునంతివేదాః** అనే మాటకనుగుణంగా గ్రుడ్డును పెకలించుకొని దానివైపు చూడకుండా ఆకాశంలో పక్షులెగిరిపోయినట్లు వేదాలు, ఇతణ్ణి పుణ్య లోకంలో చేర్పించకుండా, ఇతనివైపు చూడకుండా ఎగిరిపోతాయని ధర్మశాస్త్రం అన్నట్లుగా అన్నాడు.

ఆచారం పాటిస్తే ముందుగా ఉన్నత స్థితి వస్తుందన్నాడు. తరువాత బ్రాహ్మణ ధర్మాన్ని గూర్చి చెప్పాడు. అంటే ఈనాడు చెప్పే సమత్వం గురించి చెప్పకుండా అందరికంటె బ్రాహ్మణుడు ఆచారాన్ని తు.చ తప్పక పాటించాలని విడిగా అన్నాడు.

బ్రాహ్మణుడు వేదాధ్యయనం మానివేస్తే లేదా ఇంకే తప్పు చేసినా అతడే కాదు, అతని వంశము, ప్రపంచమూ బాధపడతాయని అన్నాడు. ఇంతకుముందు వేదాలు మరిచిపోయినా కులాచారం తప్పకూడదని అన్నాడు.

వేదాలు అప్రధానమని, నడవడికయే ప్రధానమని అనలేదు. ఆచారం అప్రధానమనీ అనలేదు. రెండూ కావాలన్నాడు. ఈ రెంటిలో వేదాధ్యయనం విడిచిపెట్టడం కంటె ఆచారాన్ని పాటించకపోవడం ఎక్కువ హానికరమని అన్నాడు. అవి మరచిపోయినా ఫరవాలేదని ఆచారం పాటిస్తే చాలని అన్నాడా? అనలేదు. మరిచిపోతే తిరిగి చదవాలని అన్నాడు. వేదాలను తిరిగి చదవడానికి వీలుందని మాత్రమే అన్నాడు. మరచిపోయినది తిరిగి చదివి ఆచారాన్ని పాటించాలని అతని అభిప్రాయము.

ఒక వర్ణం గొప్పదని, మరొకటి నీచమని శాస్త్రాలలో లేదు. రకరకాల వృత్తులు రకరకాల వర్ణాలకు వృత్తి ధర్మాన్ని పాటించడం శ్రేష్ఠమని అన్నాయి. అదే ఉన్నత స్థితికి తీసుకొని వస్తుందని అతని భావన. దానివల్ల పుణ్యలోక ప్రాప్తి. దాని ఫలం వెంటనే కనబడదు. అది అదృష్టము. బ్రాహ్మణునకు ఆచారాలను పాటించడంలో ఎక్కువ బాధ్యత ఉందని సారాంశం.

## ఆచారం - వర్ణాశ్రమం

ఒకరి ఆచారాన్ని మరొకరిపై రుద్దలేదు శాస్త్రాలు. అది వారి వారి వర్ణాన్ని బట్టి ఉంటాయి. వాటిని విడిచి పెట్టడం పరిపక్వదశలోనే. ఆశ్రమ ధర్మం అతని దశను, అభివృద్ధిని బట్టి యుంటుంది. ఇవి మనిషి యొక్క ఉన్నత స్థితిని కల్గించేవే. తద్వారా సంఘానికి మేలు చేసేవే.

కష్టపడి పనిచేసేవారికి ఆచార భారంలేదు. కొంత స్వేచ్ఛ వారికుంది. కాని బ్రాహ్మణునకట్టి స్వేచ్ఛ లేదు. అతడు ఆదర్శవంతంగా బ్రతకాలి.

## ఆదర్శం - ఆచరణ

ఆదర్శవంతమైన ధర్మాలు అందరికీ అంటే ఎవ్వరూ వాటిని పాటించరని మనవాళ్ళు గుర్తించారు. భిన్నవ్యక్తులకు భిన్న ధర్మాలున్నాయి. ఇట్టి పద్ధతి, మిగతా మతాలలో కనబడదు.

ఒక చెంపమీద కొడితే మరొక చెంపను చూపించుమని ఇతర మతాలలో ఉన్నా వారే రెండు ప్రపంచ యుద్ధాలకు కారకులయ్యారు. వివిధ దేశాలను ఆక్రమించడం, అణుబాంబులను వేయడం జరిగింది కదా! కాని యుద్ధం చేయడం, క్షత్రియ ధర్మమని, అహింసను పాటించడం బ్రాహ్మణ ధర్మమని మనవాళ్ళన్నారు. ప్రేమ, అహింసలు గురించి చెప్పిన క్రీస్తు, బుద్ధుడు మనలో లేరు కదా అని వాళ్ళే ప్రశ్నిస్తారు. అసలు మనమే శాంతి కాముకులం. అహింసాయుతంగానే పోరాటం చేసి అణుబాంబుల వారిని తరిమివేసి మన దేశ స్వాతంత్ర్యం సంపాదించుకొన్నాం.

అహింస పరమధర్మమని చెప్పే బౌద్ధ మతం వ్యాపించిన దేశాలలో మనదేశంలో కన్నా మాంసాహారులే ఎక్కువగా ఉన్నారు కదా!

ఉదాహరణకు బ్రాహ్మణునకు వీలుపడే ఆచారాన్ని కాయకష్టం చేసేవారిపై రుద్దారా? ఎక్కువ తినవద్దు, మాంసాహారం మాను, ఏకాదశినాడుపవాసం ఉండుమని, రోజూ మూడు పూటలా స్నానం చేయుమని అన్నారా? అయితే మరొక ప్రశ్నవేయవచ్చు. బ్రాహ్మణుడు ఆచారాన్ని పాటిస్తే పుణ్యలోకానికి వెడతాడని అన్నారు. ఇది పక్షపాతం కదా అని ప్రశ్నిస్తున్నారు. ఆహార శుద్ధి వల్ల మనశ్శుద్ధి ఏర్పడుతోంది కనుక ఇది బ్రాహ్మణునకే ప్రాప్తిస్తుంది. కనుక ఇది పక్షపాతం కాదా! ఎరువును బట్టి పంట యుంటుంది, ఆహారాన్ని బట్టి మనస్సుంటుంది కదా! బ్రాహ్మణునకు శాకాహారాన్ని మిగిలినవారికి మాంసాహారాన్ని నియమించడం బాగుందా? అని ప్రశ్న.

మనస్సు పవిత్రంగా ఉండాలంటే సాత్వికాహారం అందరికీ ఉంది. అయితే కేవలం సత్వగుణం వల్లనే సంఘం నడవదు. రాజసిక, తామసిక లక్షణాలూ ఉండాలి. తప్పు చేసినవాణ్ణి శిక్షించవద్దా? ధర్మం కోసం యుద్ధంచేయమని గీతలో అనలేదా? ఇది రజోగుణం, సంఘం బ్రతకాలంటే పొలం దున్నాలి, పంటలు పండించాలి, కంటినిండా నిద్ర కావాలి. ఇది తమోగుణం. ఈ

పనులు లోక క్షేమం కోసం చేయాలి కనుక అట్టి రాజసిక తామసిక కృత్యాలను భగవానుడు నిందించలేదు. వారిట్టి పనులు చేసి సంఘాన్ని ఆదుకొంటున్నారు కనుక ఆ పుణ్యంవల్ల మాంసాహారాన్ని తినడం వల్ల వచ్చిన పాపం క్షీణించబడుతోంది.

ఎరువును బట్టి పంట. జీవితం కూడా పంట వంటిదే. ధర్మరక్షణకై ఒకడు కత్తి పుచ్చుకొనవలసి వస్తుంది. అది ధర్మంలో భాగమే. రక్షించడం క్షత్రియ ధర్మం కదా. **క్షతాత్** కిల త్రాయతే. క్రూరులనుండి రక్షించవద్దా! అందువల్ల అతనికి మాంసాహారం. అది అతని ఆధ్యాత్మిక ప్రగతికి ఆటంకం కాదు.

క్షత్రియులలో కూడా అహింసను పాటించి రాజర్షులైన వారున్నారు. అహింసను గురించి మాట్లాడుతూ ఉంటే బుద్ధుడు, మహావీరుడు గుర్తుకు వస్తారు. ఇద్దరూ క్షత్రియులే. వాన ప్రస్థంలో అడవులకు వెళ్ళిన రాజులూ ఉండేవారు. అపుడు వారికి శాకాహారమే.

దేశం ఆర్థికంగా బలంగా ఉండవద్దా? వ్యవసాయం, వాణిజ్యాలుండ వద్దా? సముద్రయానమూ ఉండాలి. ప్రేమకు, దయకు ముందుగానే వేదధర్మం ప్రాధాన్యం ఇచ్చినా అర్థాన్ని విస్మరించలేదు. భౌతిక సంపదలను భారతదేశం నిర్లక్ష్యం చేసిందనడం తప్పే. దానికై ఒక ప్రత్యేక వర్ణం కేటాయింపబడింది. అతడే వైశ్యుడు. విశ్, విశ్వం, వైశ్య పదాలలో ధాతువొకటే. రాజులు విదేశీయానాన్ని ప్రోత్సహించారు. అట్లా వెళ్ళినవారు శాకాహారులూ కావచ్చు, మాంసాహారులూ కావచ్చు. వీరిని ఉత్తర దేశంలో బనియాలని అంటారు. తెలుగులో కోమటి, తమిళనాడులో చెట్టియార్ అంటారు. వీరు శాకాహారులు. విదేశాలకు వెళ్ళి తిరిగివచ్చిన వైశ్యులు బ్రాహ్మణాచారమైన శాకాహారాన్ని అనుసరించారు. వారు రాజుల మాదిరిగా వానప్రస్థానికై అడవులకు వెళ్ళేవారు కాదు. ఇక నాల్గవ వర్ణంవారికి

మాంసాహారాన్ని విధించలేదు. అది వారి ఇష్టం. కాలక్రమంలో వీరూ కాయకష్టం నుండి దూరమై వర్తక వాణిజ్యాలు చేసారు. తమంతట తామే అందులో కొందరు శాకాహారాన్ని పాటించారు. ఉత్తర దేశంలో కొందరు, తంజావూరు, తిరునెల్వేలి జిల్లాలోని వెల్లాలు, పిళ్ళైలు తీవ్ర శాకాహారులే.

మిగిలినవారికి ఇష్టానుసారం ఉన్నా బ్రాహ్మణునకు మాత్రం శాకాహారమే మంత్రశక్తి రక్షణకై విధింపబడింది. భోగభాగ్యాలకై వీరు వెంపర్లాడవద్దని శాస్త్రాలు నిషేధించాయి. ఇతడు ఇతర దేశాలకు వెడితే పతితుడని అన్నారు. ఎందుకంటే అక్కడ వేదరక్షణ కుదరదు కనుక. ఆచార సాంకర్యం ఏర్పడుతుంది కనుక. వెళ్ళినవారిని వెలివేసారు కూడా.

అట్లాగే వీరిలో కర్మవిభజన, ఆశ్రమ విభజన ఉంది. చిన్నిపిల్ల వానికి ఉపవాసాలు లేవు. కడుపునిండా తినవచ్చు. వ్రతోపవాసాదులు లేవు. విద్యాభ్యాసం గురుకులవాసం విధింపబడింది. గృహస్థునకు అనేక ధర్మాలున్నాయి. దీనికి భిన్నంగా సన్న్యాసి ధర్మాలున్నాయి. ఇతడు సన్న్యాసికి భిక్షనీయాలి. అహింసను పాటించాలి. అంత మాత్రంచే క్రూరులను చంపకూడదని విధింపబడలేదు. యజ్ఞంలో హింస చేయుదానికి అనుమతినిచ్చారు.

సన్న్యాసి తప్పక అహింసను పాటించాలి. సంఘ కార్యక్రమాలలో మునిగి పోకూడదు. ఆకును కూడా త్రుంపకూడదు.

ఇట్లా ఎన్నో నియమాలతో ఈ సంఘం రక్షింపబడింది. మిగతా దేశాలలో ఇట్టి కట్టుబాట్లు లేవు. కాని ఈనాడందరూ సమానులే, ఎవరే పని చేసినా తప్పులేదని అంటున్నారు.

ఒక పవిత్రుడున్నా వర్షం పడుతుందని చెప్పాను కదా. అందరూ అట్లా ఉండగలరా? కొంతమందైనా పవిత్ర జీవనం గడపగలిగితే పరమేశ్వర కృప అందరిపై ప్రసరిస్తుంది.

ఎవరి కర్మలో వారు సిద్ధి పొందాలని గీతా సందేశం. అనగా స్వధర్మాను ష్ఠానం, పరిపక్వత, ధానంతట అదే వస్తుంది. కాని ఇతరుల ధర్మం ఎంత గొప్పదైనా వద్దని అన్నారు.

(ప్రేమ, అహింసలకే ప్రాధాన్యమిచ్చిన మతాలకంటె ఈ మతంలోనే సాధారణంగా అట్టి లక్షణాలు కన్పిస్తాయి. దయారహితులై శాస్త్ర నియమాలను మన్వాదులు చెప్పరు కదా!)

## పనుల విభజన లేకపోవడం వల్ల లోటుబాట్లు

ఏ నియమానికైనా పరిస్థితులను బట్టి కొన్ని సడలింపులుంటాయి. సత్యం చెప్పాలనే మత నియమం ఉన్నా సత్యం చెప్పడం వల్ల ఒక హాని జరుగుతుందని తెలిసినప్పుడు సత్యం చెప్పడం కంటె ప్రేమ జూపి వారికి ఎక్కువ మేలు చేయడం మంచిదన్నారు. ఒక యువతిని రౌడీలు తరుముకొని రాగా ఆమె ఒక ఇంట్లో ప్రవేశిస్తే నాకు తెలియదనే యజమాని చెప్పాలి. అన్నివేళలా సత్యం చెప్పమంటే ఆ యువతికి హాని జరగదంటేదా?

ఒక రాజ్య పరిపాలనలో కొన్నిటిని దాచవలసి వస్తుంది. కొన్నిటిని వక్రీకరించి చెప్పవలసి వస్తుంది. గాంధీ వంటివారు అట్టివానిని కూడదన్నా రాజ్యాల దౌత్య వ్యవహారాలలో పైవిధంగా ప్రవర్తించవలసి వస్తుంది. ఇది గాంధీ సిద్ధాంతాలకు విరుద్ధమైనా సరే గాంధీగారికి మత నాయకులకంటె ఉన్నతస్థానం ఇచ్చారు. కానీ ఆయన చెప్పిన విషయాలు ఎవరూ ఆచరించరు. ఇది వట్టి వంచన. విదేశీయులు చాలా సందర్భాలలో మత నియమాలను పాటించరు.

పైన చెప్పిన లౌక్యాన్ని ప్రదర్శించవచ్చని మన అర్థశాస్త్రమూ చెప్పింది. రాజులట్లా దాచడం తప్పేమీ కాదు. శాస్త్ర విరుద్ధం కాదు కూడా. మిగతా దేశాలలో అట్టి నియమాలను పూర్తిగా సడలించడం వల్ల తరచు రాజ్యాలు

మారుట, ఆందోళనలు, విప్లవాలు పుట్టుకొని వచ్చాయి. లౌక్యాన్ని ప్రదర్శించాలని చాణక్యుడంటే అతడు మోసగాడని, అధర్మానికి జంకేవాడు కాడని ముద్రవేసారు.

ఇంకా అందరికీ ఆదర్శసూత్రం చెప్పినప్పుడు కొందరు తమకనుకూలంగా వాటిని మారుస్తూ ఉంటారు. తాము మతానికి విరుద్ధం కాదని బుకాయిస్తూ ఉంటారు. మీరు మాంసాన్ని ఏ నియమంప్రకారం తింటున్నారని బౌద్ధులను హిందువులడుగగా మేము జంతువులను ప్రత్యక్షంగా చంపడం లేదని, కసాయివాడు అమ్మినదానిని తింటున్నామని అంటారు. ఇట్లా అంటే బౌద్ధ అహింసా ధర్మానికి తూట్లు పొడవటం లేదా. ఇది ఆత్మవంచన, పరవంచన కాదా?

ఇటువంటి వాటినుండి మన మతం మనలను రక్షించింది. ఎట్లా? అందరూ అన్ని ధర్మాలను పాటించాలని చెప్పదు. వారి వారి వృత్తుల కనుగుణమైన ధర్మాలను పాటించాలని అంటుంది. జాతిని బట్టీ భేదభావం చూపించదు. వర్ణాన్ని బట్టి, ఆశ్రమాన్ని బట్టి వివిధ ధర్మాలుంటాయి. ఒక వృత్తి గొప్పదని, ఒకటి నీచమని చెప్పదు. కర్మను (ధర్మం) బట్టి ఆచారాలు మారుతాయి.

## మినహాయింపులు లేకపోవుట - పర్యవసనాలు

శాస్త్ర నియమాలు సర్దుబాటుతో ఉంటాయి. సత్యం గురించి చెప్పాను. అక్కడ సత్యం భూత హితాన్ని గుర్తించింది. కనుక సత్యం యొక్క స్ఫూర్తిని గ్రహించాలి.

గాంధీగారు అహింసను చెప్పారు. ఒక ఆవుదూడ జబ్బు చేసి విపరీతంగా బాధపడుతూ ఉంటే దానిని చంపవచ్చుని ఆయన అన్నారు. గోహత్య చేయించాడని ఆయనను కొందరు నిందించారు.

ఒక ప్రాంతంలో కఱువు వచ్చింది. అన్ని ప్రాంతాల వారూ ఆహారాన్ని అందుబాటులో ఉంచాలని తమ తమ వాటాలనడిగారు. అప్పుడు గాంధీగారు, ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్‌ల సమీపంలో సముద్రం లేదు. మద్రాసువారికి మూడు సముద్రాలు దగ్గర ఉన్నాయి. అంటే వారికి చేపలు దొరుకుతాయి వాటితో ఆకలి తీర్చుకోవచ్చు కదా అని సలహా ఇచ్చారు.

పాకిస్థాన్ దండయాత్ర చేస్తే ఎదురుదాడి చేయవచ్చని గాంధీగారన్నట్లు నెహ్రూగారే చెప్పారు.

ఇట్టి సడలింపులానాటి పెద్దలే ఇచ్చారు. నియమాలను పరిస్థితుల కనుగుణంగా సవరించకపోతే ఎవరికీ ముప్పు వస్తుందని అట్లా అనుమతించారు కదా.

అందుకే ధర్మాచారాలను వారికి వారికి తగ్గట్లు పూర్వులు నియమించారని చెప్పడానికే ఇదంతా చెప్పవలసి వచ్చింది. అందరికీ అన్ని పరిస్థితులలో ఒకే నియమం ఉండదు. కొన్నింటిని ఆపద్ధర్మాలన్నారు. యాత్రా ధర్మాలనే మాట ఉంది. కనుక మంచి ఉద్దేశంతో బుద్ధుడు, గాంధీ అన్నా ఆచరణలో సాధ్యం కాలేదు. వారిని నిందిస్తున్నానని భావించకండి. వీరిద్దరూ మహాత్ములైనా వైదిక ధర్మాన్నుండి దూరమయ్యారు. వారనుకొన్నట్లు జరగలేదు. బుద్ధిమంతులై, ప్రజలపట్ల అపార ప్రేమానురాగాలు కలవారైనా, అణుమాత్రం వారిలో స్వార్థం లేకపోయినా వారి సూత్రాలు ప్రజలను ఆచరించునట్లు చేయలేకపోయాయి.

జన బాహుళ్యం లేని పార్శీలు, జైనులున్నచోట్ల ఆచరణకు వీలుపడుతుంది. అహింసలో బౌద్ధులకంటె జైనులెక్కువ పట్టుదలలో ఉంటారు. హిందూ సంఘంలో ఇది కుదరదు. అయినా వేల సంవత్సరాలనుండి ఉత్తమ గుణాలతో ఇది మనగలిగింది. ఈ ఆదర్శాలను అందరిమీద రుద్దకుండా, విధించకుండా ఏవి, ఎంతవరకూ ఆచరణ యోగ్యమైతే వాటిని కొందరికి

విధించి కొందరిని మాత్రం ఆదర్శవంతంగా బ్రతకండని చెప్పారు. ఈ కొద్దిమంది ప్రభావం, ఇతరులపై తప్పక ఉంటుంది.

## ఆచారాలలో సడలింపు

అనేకాచారాలు, ధర్మాలున్నట్లే దేశాచారాలను పూర్వులు గుర్తించారు.

ధోవతిని, చీరను కట్టడంలోనూ ప్రాంతానికి ప్రాంతానికి భేదా ఉంది. పంచెను కట్టేటపుడు పంచ కచ్చులూ ఉండాలి. కాని బెంగాలీలట్లా కట్టరు. కుచ్చెళ్ళను విడిలేస్తారు. చీరలను కట్టడంలో అయ్యర్‌లకు, అయ్యంగార్లకు తమిళనాడులోనే భేదా ఉంది. అట్లాగే మిగతా రాష్ట్రాలలో అనేకాచారాలున్నాయి.

అలాగే కులాచారాలున్నాయి. ప్రధానంగా వివాహ సమయంలో ఈ భేదం కన్పిస్తుంది. నాందీముఖం, కన్యాదానం, పాణిగ్రహణం, మాంగల్యధారణం. సప్తపది, ప్రవేశ హోమం, ఔపాసనం, అందరికీ సమానమే. ఇవి కూడా సూత్రాన్ని బట్టి కొన్ని భేదాలుంటాయి. ముందు వెనకలలో కులాచారం ప్రకారం; ఆబ్దికాలలో వంటలలో భేదాలుంటాయి.

ఇంట్లో ఆచారాలను పాటించడం కుదురుతుంది. యాత్రలలో కొన్ని ఇబ్బందులవల్ల అందు సగం పాటించాలని అన్నారు. యాత్రలకు వెళ్ళినపుడు అక్కడ ఉండిపోవడానికో, లేదా అర్చనకో వెళ్ళడం లేదు. అట్టివారికి కొన్ని సడలింపులుంటాయని శాస్త్రం చెప్పగా నేడు అన్నిటిని బాహాటంగా విసర్జించడం శోచనీయం.

కటిక ఉపవాసం కుదరకపోతే ఫలాహారాన్ని చెప్పారు. ఎక్కడైనా ఎవరి ఇంట్లోనైనా నీళ్ళు త్రాగవలసి వస్తే మజ్జిగ చుక్కవేసి త్రాగవచ్చని అన్నారు. రోగులకు, బలహీనులకు వ్రతోపవాసాలను చెప్పలేదు.

తప్పనిసరైన పరిస్థితులలో అపద్ధర్మాలను చెప్పారు. ఇది ఛాందోగ్యోపనిషత్తులో ఉంది.

## సాధ్యమైనంత వరకూ ఆచారాన్ని పాటించుట

కురుదేశంలో అతివృష్టి వల్ల తిండికి కటకటపడిన కాలమది. చాక్రాయణ ఉషస్తి అనే ఋషి, భార్యతో కలిసి వెడుతూ ఉండగా మావటీవాండ్రుండే చోటునకు వెళ్ళాడు. ఆకలి వేసి ఏనుగులకు వేసే గుగ్గిళ్ళను పెట్టమని అన్నాడు. అది ఆపద్ధర్మం. గుగ్గిళ్ళను ఋషి దంపతులకు ఇచ్చి తను త్రాగుతున్న నీళ్ళను మావటీడు కొంచెం ఇచ్చాడు. అవి వద్దు. ఎందుకంటే అది ఉచ్ఛిష్టం (ఎంగిలి) అని అన్నాడు. అయితే ఏనుగు తినగా మిగిలిన గుగ్గిళ్ళు ఎంగిలి కాదా అన్నాడు మావటీడు. నేను బ్రతకడానికి తినవలసి వచ్చింది, తినకపోతే నా ప్రాణం పోయేది, అందువల్ల తిన్నా. బ్రతికాను. నేను నీరు త్రాగకపోయినా బ్రతకగలను. నీరు త్రాగడం ధర్మవిరుద్ధమన్నాడు. ప్రాణాన్ని ఎట్లాగైనా రక్షించుకొమ్మని శాస్త్రం చెప్పిందన్నాడు ఋషి.

అట్లాగే కొన్ని ధర్మాలున్నాయి. పర్వదినాలలో తప్ప సువాసినీ స్త్రీలు తలమీద స్నానం చేయకూడదు. పసుపు నీళ్ళు చల్లుకొంటే చాలు. అట్లాగే గర్భిణి, వ్రతాలు చేయకూడదన్నారు. ఆమెను, లోనున్న శిశువునూ రక్షించాలి. బ్రహ్మచారి కడుపునిండా తినవచ్చు. ఉపవాసాలు పనికిరావని అన్నారు. ఎందుకంటే అతడికి ఆ దశలో ఎదుగుదల ఉండాలి కనుక. అట్లాగే రోగాలకు కొన్ని సడలింపులున్నాయి.

ఆపత్కాలం దాటిన వెనుక పూర్తిగా ధర్మానుష్ఠానం చేయవలసిందే. వీటిని గౌణాచారాలనిఅంటారు. అట్టి కాలాలలో ముఖ్యాచారంతోబాటు గౌణాచారమూ ఉంటుంది. ముఖ్యమైన స్నానంతోబాటు విభూతి ధారణ అట్టిది. ఒంట్లో బాగాలేకపోతే తలస్నానానికి బదులు కంఠస్నానాన్ని

విధించారు. జ్వరంతో ఉంటే కాళ్ళు కడుక్కుంటే చాలన్నారు. అది కుదురక పోతే తడిగుడ్డతో ఒంటిని తుడిచినా చాలు. జ్వరం మరీ తీవ్రంగా ఉంటే విభూతిని ధరించినా చాలు. అయితే పూర్తి ఆరోగ్యంతో ఉన్నపుడు స్నానం చేయకుండా కేవలం విభూతిని ధరిస్తే సరిపోదు.

## స్నాన భేదాలు

కేవలం నీటిలో మునగడం వారుణ స్నానం. ఒక పాత్రతో తోడుకొని పోసుకోవడం ద్వితీయ పక్షం. కంఠస్నానం చేయడం గౌణస్నానం.

విభూతిని ధరించుట ఆగ్నేయ స్నానం. అగ్నినుండే విభూతి వస్తోంది కదా. దానికి నీటిని చేర్చి ఒళ్ళంతా పూసుకోవడం భస్మోద్ధూళనం.

ఆవు గిట్టలనుండి రేగిన దుమ్మమీదపడితే అది గోరజస్నానం. కృష్ణుణ్ణి గోధూళి ధూసరిత అని నుతిస్తారు కదా. దీనినే వాయవ్యస్నానమంటారు. గాలివల్లనే దుమ్ము నాల్గువైపుల ప్రసరిస్తోంది.

ఎండ ఉన్నపుడు వానచినుకులు పడితే దేవలోకం నుండి నీరు పడుతోంది కనుక ఇది దివ్యస్నానం. ఆ చినుకులు ఒంటిమీద పడాలి. పడకుండా పరుగెత్తకూడదు.

ఆపోహిష్ఠాది మంత్రాలనుచ్ఛరిస్తూ నెత్తిపై నీళ్ళు చల్లుకొంటారు. ఇది బ్రాహ్మస్నానం. బ్రహ్మమనగా వేదం. మంత్రాలు రానివారు కేవలం భగవన్నామాన్ని ఉచ్చరించినా చాలు.

కనుక స్నానం అంతా బ్రాహ్మమే. వరుణాది దేవతలను ఒక పాత్రలో ఆవాహనం చేసి నీటిని చల్లుకొన్నా అది బ్రాహ్మమే. వారుణ స్నానం కుదరకపోతే నీటిని నెత్తిన చల్లుకొనుట గౌణస్నానం.

పైవాటిల్లో వారుణం నీటికి, ఆగ్నేయం అగ్నికి; గోధూళి వాయువునకు చెందినవి. ఇవి కాకుండా బ్రాహ్మమని, దివ్యమని పేర్కొన్నాను. పంచ

భూతాలలో పృథివిని, ఆకాశాన్ని పేర్కొనలేదు. మంత్రాలు ఆకాశంలో ఉంటాయి. ఆకాశానికి తన్మాత్ర శబ్దమే కదా. ఇక్కడ శబ్దమనగా వేదమంత్రం కనుక ఇది బ్రాహ్మస్నానమౌతుంది. దివ్యం కూడా ఆకాశానికి చెందిందే. ఆకాశం నుండే నీరు వస్తోంది. వాయవ్య స్నానంలో గోధూళి ఉంది. అది గిట్టలనుండి రేగగొట్టబడిన ధూళికదా. ఇక వారుణ స్నానంలో ముందు మట్టిని ఒంటికి పూసుకుంటాం. అంటే పృథివికి చెందిందే. ఇట్లా పంచ భూతాలకు సంబంధించిన ఐదు రకాలున్నాయి. అన్నీ ఆత్మశుద్ధికే.

## సంకల్పంలోనే ఐదు విభాగాలున్నాయి

"సంకల్పః సూక్త పఠనం, మార్జనంచాఘమర్షణం
దేవతా తర్పణంచైవ స్నానం పంచాంగ ఉచ్యతే"

ముందు సంకల్పముంటుంది. నా పాపాలకు ప్రాయశ్చిత్తంగా, పరమేశ్వర ప్రీతి కోసం ఫలానా రోజున నేనిది చేస్తున్నానని చెప్పుట సంకల్పం. వేద సూక్తాలను పఠించుట సూక్తపఠనం. ఆపోహిష్ఠ మొదలైన మంత్రాలచే నెత్తిపై నీళ్ళను చల్లుకొనుట మార్జనం. దాని తరువాతే స్నానముంటుంది. నీళ్ళల్లో నిలబడి అఘమర్షణ సూక్తాన్ని ముమ్మారు జపించాలి. సమయం తక్కువగా నున్నపుడు గాయత్రిని మూడుసార్లు జపించాలి. అదీ కుదరకపోతే ప్రణవాన్నైనా ఉచ్చరించాలి. పూర్తిగా శాస్త్ర ప్రకారం చేయలేకపోతున్నామని బాధపడినపుడు భగవానుడు క్షమిస్తాడు, అనుగ్రహిస్తాడు. స్నానం అయిన వెంటనే నీటిలో ఉండే తర్పణం. ఇందు దేవ, ఋషి, పితృతర్పణముంటుంది. అట్లా స్నానం పూర్తి అయింది.

ఇట్లా అన్ని కర్మలూ మతంతో సంబంధం ఉన్నవే. ఇంకా చాలా నియమాలున్నాయి. లోగడ ధూర్జటలను మట్టిని గురించి చెప్పాను. కేవల శరీర శుభ్రత కోసమైతే నీళ్ళు పోసుకుంటే చాలు. కాని మన స్నానవిధి

శరీర శుద్ధితో బాటు మనశ్శుద్ధి కోసమూ ఉంది. నదిలో స్నానం చేసేటపుడు ప్రవాహానికి ఎదురుగా నిలబడి చేయాలి. చెఱువులో స్నానం సూర్యునికి ఎదురుగా నిలబడి చేయాలి. గ్రహణాలలో సూర్యాస్తమయం అయిన తరువాత స్నానం చేయవలసి వస్తే తూర్పు, లేదా పడమర వైపు తిరిగి చేయాలి. ఇంట్లో ఐతే తూర్పు తిరిగే చేయాలి. పితృకర్మలకు దక్షిణం వైపు తిరిగి చేయాలి.

ఇక కూర్చునేటపుడు పద్మాసనాదుల గురించి ఆచమన విధులను గురించి ప్రాణాయామాది నియమాల గురించి అనేక నియమాలున్నాయి. మినుప గింజ మునిగేటంత నీటిని ఆచమనంలో వాడుట, అట్లాగే హోమం చేసేటపుడు వేసే నేయి పరిమాణం మొదలైనవి నెన్నిటినో చెప్పాయి శాస్త్రాలు. అభ్యసిస్తే అంతా సులువే. కారును నడిపేవాడు అందెన్ని విభాగాలున్నా అన్నిటినీ గుర్తుపెట్టుకొని నడపడం లేదా? ఆసక్తి ఉండాలి.

## శ్రద్ధావిశ్వాసాలు

శ్రద్ధావిశ్వాసాలు రెండు కన్నుల వంటివి. శ్రద్ధయనగా ప్రీతితో, జాగరూకతతో పనిచేయుట. నమ్మకంతో పనిచేయుట శ్రద్ధ. విశ్వాసంలో వెంటనే ఫలాలను ఆశించడం అంటూ ఉండదు. అదృష్ట ఫలానికై ఆచారానుష్ఠానాలున్నాయి. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం, అని గీతావచనం. అనగా శ్రద్ధావంతునకే జ్ఞానం లభిస్తుందని. శ్రద్ధతో చేసేది కాబట్టి ఆబ్దికానికి శ్రాద్ధమని పేరు. ఎందుకని ప్రశ్న వేయకుండా శ్రద్ధ ఉంటుంది. దీనికి కారణమేమిటని ప్రశ్నించకుండా ఆచారాలను పాటిస్తారు. అట్లా చేయకపోతే అనాచారమని అంటారు.

ఈనాడు శ్రద్ధావిశ్వాసాలు సన్నగిల్లుతున్నాయి. కనబడని దాని గురించి ఎట్లా నమ్మగలం? అని ప్రశ్నిస్తారు. కారణం లేకుండా, శాస్త్రీయాధారాలు

లేకుండా ఈ నియమాలను పూర్వులు పెట్టలేదు. ఎట్టి పరికరాలు లేకుండా సూక్ష్మాంశాలను కనిపెట్టారు. అది అతీంద్రియ జ్ఞానంతో చెప్పడం వల్ల. కొన్ని సైన్సుకి లొంగవు. కొన్ని ఆచారాలు ప్రత్యక్ష ఫలాన్నిస్తున్నాయి కనుక కనబడని వాటికి ఆధారాలుంటాయని నమ్మడం మనవంతు.

ఇది పుణ్యమనీ, ఇది పాపమని ఊరకే అన్నారా? సత్యంకంటె శ్రేష్ఠమైన ధర్మం లేదని సత్యాత్ నాస్తి పరోధర్మః చెప్పినవారు అసత్యాన్ని అందిస్తారా? వారు కనుగొన్నవి భగవత్ కృపవల్లనే. సహజ జ్ఞానంతో అన్నీ అందించారు.

ఆచారాలకు అర్థం లేదని ఈసడించకండి. నా దగ్గర ఆచారాల గురించి చెప్పే పుస్తకం ఉంది. (స్వామివారు పేరు చెప్పలేదు) ఇందులో చెప్పినవన్నీ ఆచరించగలమా అని సందేహం. ఇందు కొన్నింటిని ఆచరించినా ఫలం వస్తుంది.

## కొన్ని ఆచార నియమాలు

ఈ నియమాలను వింటూ ఉంటే ఆధునికులు నవ్వుతారని తెలుసు. అయినా వినిపిస్తాను.

1. నోటితో నిప్పును ఊదరాదు.
2. మగవాడు దీపం ఆర్పకూడదు.
3. ఆడవారు గుమ్మడికాయను పగులగొట్టకూడదు.

   మొదట దానికి దుమ్ము దూగర నోట్లోకి రావచ్చని; రెండవ దానికి నోటి తుంపర్లు పడి అగ్ని అపవిత్రమవుతుందని చెప్పవచ్చు.
4. క్షురకర్మ కొన్ని తిథులలోనే చేసుకోవాలి
5. తలంటు స్నానం కూడా కొన్ని తిథులలోనే చేసుకోవాలి.
6. అట్లాగే గోళ్ళను కత్తిరించుట కొన్ని రోజులలోనే.

   దీనికి కారణాలు తెలియవు.

7. జూదం ఆడవద్దు.

8. మద్యపానం వద్దు.

ఇవి అర్థమౌతున్నాయి.

9. వివాహంలో, యాత్రలో మాత్రమే భార్యాభర్తలు కలిసి భుజించవచ్చు

10. మధ్యాహ్నం పాలు త్రాగవద్దు

దీనిని వైద్యులూ అంగీకరిస్తున్నారు.

11. కొంతకాలం శుభ్రం చేయకపోయినా శాలువలు, పట్టు వస్త్రాలు, నారచీరలూ పనికి వస్తాయి - బాగా వాడిన వాటిని అమావాస్యనాడే శుభ్రం చేయాలి.

12. అతిథి. అభ్యాగతులకు పెట్టకుండా తినవద్దు.

మనం పిలిస్తే వచ్చినవాడు అతిథి, పిలవకుండా వచ్చేవాడు అభ్యాగతుడు. ఈ ఆచారం మానవత్వాన్ని సూచిస్తుంది.

13. పడుకునేటప్పుడు కాళ్ళు కడుక్కొని పొడి కాళ్ళతో పడుకోవాలి. పొద్దున్నే కానీ భోజనం తర్వాత కానీ ఎన్నిసార్లు పుక్కిలించాలనే నియమాలూ ఉన్నాయి.

14. పండ్లు తోముకొనేటపుడు దంత కాష్ఠాలను (మఱ్ఱి, తుమ్మ పుల్లలను) వాడండి. శ్రాద్ధ దివసాలలో తోమనవసరం లేదు. పుక్కిలిస్తే చాలు. దీనికి కారణం తెలియదు. అయినా కారణం చెప్పారు. పండ్లను, నాల్కను శుభ్రం చేసుకొన్న తరువాత పైత్యరసం బైటకు వస్తుంది. అది పోయినపుడు ఆకలి వేస్తుంది. ఆ ఆకలిని పోగొట్టుకోవడానికి ఏ మజ్జిగనో, గంజినో త్రాగి పోగొట్టుకోవచ్చు. కాని శ్రాద్ధ దివసాలలో శ్రాద్ధం అయ్యేవరకూ ఏమీ తినకూడదు కదా. అందువల్ల అట్టి నియమం పెట్టారు.

15. పురుడు, మైలలలో ఎన్నిరోజులూ ఇతరులను తాకకుండా ఉండాలో ఉన్నాయి. గ్రహణ సమయంలో అపవిత్రత ఉన్నా ఇపాదులవల్ల దానిని పోగొట్టుకొంటున్నాం. చేసే మంత్రానికి బలం వస్తుంది.

ఇదే పుస్తకం వివాహంలో సంకల్పం అయి శేషహోమం జరిగేటంత వరకూ అతనికి మైల వచ్చినట్లు తెలిసినా అతనికి ఆ దోషం అంటదని ఉంది.

ఈ పుస్తకంలో కొబ్బరినీళ్ళను కంచుపాత్రలో పోస్తే అది కల్లుతో సమానమని ఉంది. దీని రసాయనిక చర్యను పరిశోధకులు గుర్తిస్తారనుకుంటాను.

## ఇంకా కొన్ని నిషేధాలు

రసాయనిక చర్య అంటే గుర్తుకు వచ్చింది. కృత్రిమమైన రసాయన పదార్థాలతో (Synthetic) చేసిన వస్త్రాలను శాస్త్రకర్మలలో వాడకండి. వాటిలే వచ్చే ఫలం మన కంటికి కనబడకపోయినా వాడకండి. పటిక, పటికబెల్లం ఒకే రంగులో ఉంటాయి. రెండూ ఒకటౌతాయా? మామూలు చిక్కుడు, మాత్రమే వాడాలన్నారు. మిరపకాయలలో కారం ఉన్నా మిరియమే శ్రాద్ధాలలో వాడాలన్నారు.

(పై పుస్తకం చూస్తూ) అశుచి కాలంలో వ్రతాలు చేయకూడదని, ఆ కాలంలో ఏకాదశి వస్తే ఉపవాసం ఉండాలన్నారు.

ద్వాదశినాడు భోజనం ఎక్కువ ప్రొద్దెక్కకుండా చేస్తారు కదా. అందువల్ల మాధ్యాహ్నిక సంధ్యావందనం, వైశ్వదేవం నియమితకాలానికి ముందే ముగించాలి. కాని ద్వాదశినాడు శ్రాద్ధం వస్తే ఒంటిగంటనుండి మూడులోపుగా చేయాలి.

ఏకాదశినాడు ఉపవాసం ఉండాలన్నా ఆనాడు శ్రాద్ధకర్మ వస్తే కడుపునిండా భుజించవచ్చు. మాధ్వులు, ఏకాదశికి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు కనుక ఆనాడు చేయక మరునాడు చేస్తారు.

అట్లాగే ద్వాదశి నాడు తప్పక ఉసిరికను తినాలి. ముందు రోజు ఉపవాసం వల్ల శరీరంలో వచ్చిన మార్పులను ఇది సరిచేస్తుంది.

ఈ పుస్తకంలో బ్రాహ్మణులు నీరుల్లిని, వెల్లుల్లిని వాడవద్దని ఉంది. ఇతరులు కూడా వ్రతాదులలో వీటిని వాడరు. ఇది మంత్రపరిరక్షణం కోసం బ్రాహ్మణులకు నియమం.

రోగం వచ్చినపుడు వెల్లుల్లిని వాడవచ్చుని తగ్గిన తరువాత ప్రాయశ్చిత్తానికి పంచగవ్యాన్ని సేవించాలని దయతో చెప్పింది శాస్త్రం.

ఆకలితో ఉన్నవాడు గుమ్మం ముందు నిలబడి యుండగా అన్నం తింటే మాంసంతో సమానమని, నీళ్ళు త్రాగితే కల్లుతో సమానమని, దయాగుణంతో శాస్త్రం చెప్పింది. ఇట్లా ఎన్నో ఉన్నాయి.

మడిదడి అంటారు కదా! ఇవేమిటి? పిచ్చి ఆచారాలని ఈసడించకండి. ఫలం కనబడనంత మాత్రంచే మానవద్దు. అనేక అనాచారాల వల్ల ఎన్నో విపత్తులు సంభవిస్తున్నాయి.

ఈ ఆచారాలలో కొన్ని సున్నిత భావాలు దాగాయి. ఇతరుల కాలిని త్రొక్కినా, పుస్తకం త్రొక్కినా తప్పు చేసినట్లు భావించి కళ్ళకద్దుకొంటాం. పెద్దలు వచ్చినపుడు కాళ్ళు బారజాపుకొని యుండడాన్ని తప్పుగా భావిస్తాం. ఏదైనా మంచి పనిచేసినపుడు ఒక సుమంగళి ఎదురు వస్తే శుభమని భావిస్తాం. అట్లాగే శకునాల గురించి చెప్పినపుడు కొన్ని ఆచారాలు బాధాకరంగా ఉంటాయి. వీటికి హేతువేమీ చెప్పలేం.

## మంత్రాలతో పని ఆరంభం

ఏ పని ఆరంభం చేసినపుడైనా మంత్రంతోనో, భగవన్నామంతోనో మొదలు పెడతాం. నిద్రాహార, మైథునాలు సర్వప్రాణులకు సమానం. ఇందులో మనిషి గొప్పదనం ఏమిటి? ఏమిటి తేడా? అందువల్లనే అన్నం తినేటపుడు ప్రాణాహుతులుంటాయి. చేప నీళ్ళల్లో ఉంటోంది. కాని మనం శాస్త్ర ప్రకారంగా స్నానం చేస్తాం. ఇట్లా ఏ పని చేసినా భగవన్నామాన్ని జోడిస్తే పరమార్థానికి దోహదం చేస్తుంది.

ఎంగిలితోనున్న వాటినీ భగవానునకు అర్పిస్తున్నాం. పట్టు పురుగుల చొంగవల్లనే పట్టు లభిస్తోంది. దానిని కట్టుకొంటున్నాం. ఆ బట్టలను అర్పిస్తున్నాం. అట్లాగే తేనె. చేపలలో నున్న నీటినీ అర్పిస్తాం. అట్లాగే పాలు. దూడ కుడిచిన తరువాతనే పాలను తీసుకొంటున్నాం. ఏది చేసినా అర్పణ భావం ముఖ్యం.

## శాస్త్ర నియమాలు - విరుద్ధ ఆచారాలు

ఇంకా అనేక కులదేశాచారాలున్నాయని చెప్పాను. ఇందు శాస్త్ర నియమాలకు కొన్ని మార్పులున్నట్లు కన్పిస్తుంది. అయితే ఇష్టం వచ్చినట్లు మార్చేవారు కాదు. అయినా పూర్తి శాస్త్రానికి విరుద్ధంగా ఉంటే తరతరాలనుండి వస్తున్నా కొన్ని ఆచారాలను మార్చవచ్చు.

ఉదా: మూడు తరాలు రెండు బంధువుల కుటుంబాలకు సంబంధించిన పెద్దలు ఉన్నంతవరకూ ఆ బంధువుల మధ్య వివాహం కూడదని శాస్త్రాలన్నాయి. కాని దక్షిణ దేశంలో మేనరికం వ్యాప్తిలో ఉంది, ఇరు కుటుంబాలకు చెందిన పెద్దలు ఉన్నా చేస్తున్నారు. ఇది శాస్త్ర విరుద్ధమే. ఆరోగ్యానికీ మంచిది కాదు. మేనమామ కిచ్చి వివాహం చేయుదాన్ని పూర్తిగా

నిషేధించారు. ఇట్టి వివాహాన్ని, మేనరికాన్ని ఉత్తర దేశస్థులు చూసి నిందిస్తారు. మరొకటి, చలి ప్రాంతం కావడం వల్ల మహమ్మదీయ దండయాత్రవల్ల కొన్ని ఆచారాలని ఉత్తర దేశస్థులు ఎక్కువగా పాటించరు. అక్కడ అర్చకుడు చొక్కాను ధరించి పూజ చేయడం వంటివి. కాని వివాహ విషయంలో నియమాలను తప్పక పాటిస్తారు.

ఒక ఇల్లాలు నాకొక పాఠం చెప్పింది. కొందరు యాత్రికులు ఉత్తరదేశం నుండి మా మఠానికి వచ్చారు. ఆనాడు మౌనం నాకు. పటిక బెల్లాన్ని ప్రసాదంగా ఇచ్చాను. ఏదో సందేహిస్తూ కొందరు తీసుకొన్నారు. ఒక స్త్రీ తీసుకొనలేదు. మరొక ప్రసాదం ఇమ్మంది. కారణమేమిటని ఆలోచించాను. పూర్వం పటికబెల్లాన్ని చేసే కర్మాగారాలలో జంతువుల ఎముకలను శుద్ధి చేయడానికి వాడేవారట. అందువల్ల దీనిని ప్రసాదంగా వాడరట. 1934-36లో ఉత్తర దేశానికి నేను బయలుదేరినపుడు ఈ విషయం తెలిసింది. తరువాత కర్మాగారపు యజమానులు ఎముకలు వాడడం మానివేసారని తెలిసింది. తెలిసిన దగ్గరనుండి మరల ప్రసాదంగా ఇస్తున్నాను. కాని పై స్త్రీ వద్దని స్పష్టంగా చెప్పింది. కానీ ఆనాడు మౌనంతో ఉండడం వల్ల ఈ విషయం ఆమెతో చెప్పలేకపోయాను. ఆచారం విషయంలో మనకంటె వారు పట్టుదలతో ఉంటారని చెప్పడం కోసం ఇదంతా చెప్పా.

ఉత్తర దేశంలో బ్రహ్మచారులు కూడా పంచకచ్ఛలతో పంచని కడతారు. గురుకులవాసం అయిన తరువాత అతనికి వివాహమైనా కాకపోయినా సరే అట్లా కట్టాలని శాస్త్రాలంటున్నాయి. మన ప్రాంతంలో గురుకుల వాసాలు లేకపోయినా వేదం చదువుతున్న బ్రహ్మచారి పంచె కట్టడు. అన్నిచోట్ల పంచకచ్ఛలతో ధోవతి కట్టినా తమిళనాడు, కేరళలలో లుంగీ మాదిరిగా కట్టే ఆచారమే ఉంది.

శాస్త్రాలకు విరుద్ధంగా అపవిత్రమని కొన్నిటిని మానివేసారు. తల్లిదండ్రులు బ్రతికియుండగా యజ్ఞోపవీతాన్ని సవ్యంగానే వేసుకోవాలి. అపసవ్యం తప్పు. తండ్రి బ్రతికియున్నా, దేవ ఋషి పితృతర్పణంలో అపసవ్యంగా అర్పించాలనే నియమం ఉన్నదాంట్లో ఆ ఆచారాన్ని పాటించడం లేదు. పితృతర్పణంలో అపసవ్యంగా ఉంటుంది.

పెండ్లికాని అక్క బ్రతికియుండగా ఆమె చిన్న తమ్మునకు ఉపనయనం చేయకూడదని, ఇంట్లో ముగ్గురు బ్రహ్మచారులుండకూడదని అంటున్నారు. శాస్త్రాలు వయస్సును మించకుండా ఉపనయనం చేయాలని చెబుతూ ఉండగా పైవాటిని సాకుగా చూపిస్తున్నారు.

శ్రుతి స్మృతులకు విరుద్ధంగా ఆచరించకూడదని శాస్త్రాలంటున్నాయి.

యస్మిన్‌దేశే యదాచారః పారం పర్యక్రమాగతం

శ్రుతి స్మృత్యవిరోధేన సదాచారస్స ఉచ్యతే

కనుక సాధ్యమైనంత వరకూ శాస్త్రాన్ని పాటించాలి. శాస్త్రాలే కొన్ని సడలింపులు చేసాయి. శాస్త్రం ప్రమాణమని సాధ్యమైనంత వరకూ పాటించాలనే భావన తప్పక కలిగియుండాలి.

## ప్రశ్న వేయకుండా

వివాహంలో ఎప్పుడైతే కంకణధారణ జరిగిందో మధ్యలో ఆ దంపతులకెట్టి మైలవంటి బాధలుండవని శాస్త్రాలే చెప్పాయి. అట్లాగే యజ్ఞంలో కూడా. పవిత్ర కర్మకే అట్టిదానిని అంగీకరించింది శాస్త్రం. అట్లాగే రథోత్సవంలో అందర్నీ తగలడం వల్ల మైల పడ్డామని భావించడం కూడదని శాస్త్రమే చెప్పింది. తిరిగి వచ్చి స్నానం చేయకూడదని చెప్పింది. ఇది ఉత్తర దేశంలోనూ ఉంది. కనుక అన్ని ఆచారాలూ శుభ్రతపై ఆధారపడి లేవని

అర్థమౌతోంది కదా! మన ఆచారాలు దివ్యత్వంతో ముడివడి యున్నాయి. ఇవి జీవుణ్ణి పవిత్రం చేసేవి. బాహ్యమైన శౌచాన్ని చెప్పేవి మాత్రమే కాదు, ఆంతరమైన శౌచాన్ని చెప్పేవి కూడా. అందరూ కలిసినపుడు వాతావరణ కాలుష్యాన్ని స్నానం వల్ల పోగొట్టుకోవాలని అనడం పాశ్చాత్య సంప్రదాయం. కాని రథోత్సవ సమయాలలో అట్టి స్నానాలు పనికిరావని మన శాస్త్రాలన్నాయి.

## ఐహికమైన లాభాలకూ

సాధారణంగా ఆచారాలు బాహ్యమైన శుభ్రత, ఆరోగ్యం, సంఘంలో ఐకమత్యం, కుటుంబ క్రమశిక్షణను ఉద్దేశించినవి. శాస్త్రాన్ని పాటించడమూ సుఖానికి అని సూక్తి: శాస్త్రాయ చ సుఖాయచ. ఇంకా ఏ లాభాలు వస్తాయో చూడండి:

**ఆచారాత్ లభతేహ్యాయుః అచారాత్ ఈప్సితాః ప్రజాః**
**ఆచారాత్ ధనం అక్షయ్యం ఆచారోహంత్యలక్షణం**

అనగా ఆచారం వల్ల దీర్ఘాయుర్దాయం, ఇష్ట సంతానప్రాప్తి ఎక్కువ డబ్బు, అవలక్షణాలు పోవుట జరుగుతుంది. వారిలో ఒక తేజస్సు కన్పిస్తుంది. గౌరవాన్ని ఇతరులనుండి పొందుతారు.

ఇక్కడ డబ్బంటే ఏమిటి? దీనిని రెండు రకాలుగా అర్థం చేసుకోవాలి. ఆధ్యాత్మికంగా భక్తిజ్ఞాన వైరాగ్యాలని, అవి తరగవని అర్థం. భౌతికంగా భావించినా అతనికే లోటూ ఉండదని.

అసలు డబ్బున్నవారు భాగ్యవంతులని అర్థమా? వారు అపమార్గాలను త్రొక్కడం లేదా? కష్టాలలో చిక్కుకోవడం లేదా? కొందరు అప్పుల పాలవుతున్నారు కదా. అనేక వ్యసనాలకు లోనౌతున్నారు. నిజమైన భాగ్యం అంటే ఆదాయానికి తగిన ఖర్చుచేసి సుఖంగా ఉండడమే.

అన్నిటిలోనూ మితం ఉండాలి. హోటల్, సినిమాలకు ఖర్చు పెట్టడం అనవసరపు ఖర్చులు కదా. పాలరాతి భవనాలే అక్కర్లేదు. గోమయంతో అలికిన ఇల్లు చాలు. అన్నిచోట్లకు తిరగడం వల్ల ఆచారానుష్ఠానానికి ఇబ్బంది కూడా. వీటని పాటిస్తే ఎంతో ఆదా చేయవచ్చు. ఆచారాలను పాటిస్తూ ఏ హోటల్‌లోనో దూరితే వేళాకోళం చేయరా? ఆంగ్లేయ వేషం వల్ల ఎంత ఖర్చవుతుందో ఆలోచించారా?

## ఆచారం - కార్యాలయం

గాంధీగారు నిరాడంబరంగా బ్రిటిష్ రాజును దర్శించలేదా? ఖరీదైన బట్టలు, పట్టుబట్టలను మానితే ఎంతో ఆదా చేయవచ్చు. క్రొత్త క్రొత్త బట్టలు వచ్చాయని, వాటిని రోజూ తడపవచ్చని, ఇస్త్రీ కూడా చేయనవసరం లేదని ఎవరో నా దగ్గరకు వచ్చి చెబుతున్నారు. నేను పట్టుబట్టల్ని వద్దంటున్నాను. పోలిస్టర్ వంటి ఆధునిక వస్త్రాలు ధరించడం వల్ల గాలి లోపలికి ప్రవేశించదు. మన వాతావరణానికి అనుకూలం కాదు కూడా. వేసవిలో కండువా కప్పుకొన్నా సరిపోతోంది కదా! చొక్కాలు ధరించడం కూడా ఇటీవల వచ్చిందే. *(ప్రజాస్వామ్యంలో పై చొక్కాలు లేకుండా కార్యాలయానికి వస్తాం అంటే ప్రభుత్వం అంగీకరిస్తే బాగుండునని స్వామివారన్నారు-అనువక్త)*

మీరు ఏకాదశినాడు ఉపవాసం ఉండాలంటారు. ప్రభుత్వం ఒప్పుకొంటుందా? అమావాస్యనాడు తర్పణాలీయాలి కనుక ఆలస్యంగా వస్తామంటే అంగీకరిస్తారా? అని నన్ను ప్రశ్నిస్తారు. చేయాలని సంకల్పం ఉండాలి. తెల్లదొరల కాలంలో టి.ముత్తుస్వామి అయ్యర్ వంటివారు తు.చ. తప్పక నియమాలను పాటిస్తూ ప్రభుత్వోద్యోగం చేసారు. కనుక ఈనాటికీ ఆచారవంతులంటే గౌరవం ఉంది.

## వైదికాచారాన్ని పాటిద్దాం

ఎవరో కొందరే కాదు, అందరూ ప్రాచీనాచారాలను పాటించాలని అంటున్నా, చాలా ఆచారాలు బ్రాహ్మణుని ఉద్దేశించే ఉన్నాయి. వైదిక కర్మలు చేయించి దక్షిణ పుచ్చుకోవడం వల్ల ఆచారం, దక్షిణ కోసమే అనే భావన కల్గుతోంది. కేవలం జీవికకై ఆచారాన్ని పాటిస్తే ఎలా? అట్లా దక్షిణలను తీసుకొనేవారిని తక్కువ చేసి మాట్లాడడం లేదు. గృహస్థులు నిర్లక్ష్యంగా దక్షిణను ఇస్తూ ఉన్నా గ్రహించి పురోహితులు జీవనయాత్ర సాగిస్తున్నారు. వైదిక కర్మలను నిలబెడుతున్నారు. అయితే జీవిక కోసం ఏ పని చేసినా దాని విలువ తగ్గిపోతోంది. అట్లాగే కేవలం దక్షిణకై ఆచరించేవారికి గౌరవం దక్కలేకపోతోంది. ఆచారాలు పాటించినవారికి గౌరవం లభిస్తోంది. అందరు పురోహితులూ ఇట్లా ఉన్నారని అనడం లేదు.

కనుక ఆచారం, ఆచారం కోసమే అనుష్ఠించాలి. వైదిక కర్మలను తాననుష్ఠిస్తున్నానని తృప్తి పడాలి వైదికుడు. దక్షే లక్ష్యంగా వృత్తి సాగకూడదు. అన్ని ఆచారాలలో ఉన్న జీవుణ్ణి శుద్ధి చేయడానికే కదా! సదాచారం ఎప్పుడైతే ఉందో ఇక ఎక్కువ తక్కువలు, తృప్తి లేకపోవడం అంటూ ఉండదు.

ఈనాడు జాతీయ సమైక్యమని అంటున్నారు. ఎన్నికలలో, కాలేజీ సీట్ల కేటాయింపులలో, ఉద్యోగాలీయడంలో, జాతి వివక్షతను చూపిస్తున్నారు. వర్ణాన్ని బట్టే, ఇస్తున్నారు. ఇది జాతీయ సమైక్యం అనడం పట్టి కల్ల, భ్రాంతి. భావావేశం వల్ల ఐకమత్యం రాదు. ఆచారాలలోనున్న ఆచారానుష్ఠానం వల్లనే ధార్మికాచారాలవల్లనే, సంఘంలో క్రమశిక్షణ ఏర్పడుతుంది.

## వెంటనే చేయవలసింది

అదరూ వైదికాచార పరులైతే ఈనాడు కుదురుతుందా? వైదికాచార పరులకు నేటి అవకాశాలు కల్పించకుండా దూరంగా ఉంచడానికి బదులు,

నేటి విద్యావకాశాలు వారికీ కల్పించి కొంత సమయాన్ని ఆంగ్ల విద్యతో బాటు విద్యాభ్యాసానికి అవకాశం కల్పించండి. మంత్రాలు రానివారికి తేవారం, దివ్య ప్రబంధం, తిరువాచకం నేర్పించండి. ఇట్లా అందరి విద్యార్థులకు ఆధునిక విద్యతోబాటు మతసంబంధమైన సాహిత్యాన్ని నేర్పండి. అందరికీ సంస్కృతాన్ని నేర్పించండి. తమతో అంతమైపోతుందనుకునే పురోహితులకు ఇట్టి పద్ధతివల్ల ప్రోత్సాహమిచ్చినట్లౌతుంది.

ఇట్లా సంస్కృతంలో, దేశభాషలలోని స్తోత్రాలను, మంత్రాలను పఠింపజేస్తే జాతి బాగుపడుతుంది.

ఉద్యోగ విరమణ చేసినవారు, మరల ఉద్యోగాలకై ప్రయత్నించకుండా, భగవత్ కైంకర్యాన్నే జీవితాదర్శంగా భావించి ఎందరినో తీర్చిదిద్దగలిగితే అది వారికీ, మిగిలినవారికీ లాభాకరమే.

## నియమ నిబంధనలు - లాభం

శాస్త్రాలు చాలా నియమాలను పెట్టాయని భయపడనక్కరలేదు. ఈనాడు స్వాతంత్ర్యం వచ్చిందని మురిసిపోతూ అన్ని కట్టుబాట్లను త్రెంచివేసుకొంటున్నాం. ఆనందం కలిగినా అది మెరుపుతీగలా తాత్కాలికంగా ఉంటోంది. స్వాతంత్ర్యం, పరిశోధనలు, ఆర్థికాభివృద్ధి మొదలైనవాటివల్ల శాశ్వతానందం, తృప్తి కనబడడంలేదు.

నేటి పరిశోధనలు శాశ్వత సుఖాన్ని కల్గించగలవా? దుఃఖాన్ని పోగొట్టగలవా? పాపక్షయాన్ని కల్గించగలవా? పూర్వులు తృప్తితో సుఖమయ జీవితం గడపలేదా?

కట్టెల మోపు కట్టాం. ఇంకొక త్రాడు వేసి గట్టిగా బిగిస్తే దీనిని ముడి వేయకపోయినా మొదటి తాడు వదులౌతోంది కదా! అట్లా ముడివేయబడ్డాం సంసారంతో రెండవత్రాడు ఆచారమనే త్రాటితో బిగిస్తే, మొదటితాడు

ముడితో కూడా విడిపడుతోంది కదా. చిట్టచివరి స్థితిలో ముడి లేదు, త్రాడూ లేదు. బంధాలు లేని స్థితి. ఏ ఆచారమైనా మనసును నియమించడానికే. చివరకు దంతధావనం కూడా మనస్సును నియమించడానికే.

ఇక ఆచారం, లోభిత్వానికి దారి తీస్తుంది. ఇష్టం వచ్చిన ప్రతిదానిని అనుభవించకుండా ఉండడానికి, కోరికలను తగ్గించడానికి దోహదం చేస్తుంది. సాదాసీదా జీవనాన్ని గడపవచ్చు. అట్టి స్థితిలో పరమేశ్వర ధ్యానం పట్టుబడుతుంది.

## ఆచారాలపై పుస్తకాలు

రెండు మూడు తరాలనుండి ఆచారాలు క్షీణించాయి. వేము పాటించాలని అనుకున్నా ఇంట్లో చెప్పేవారు లేరని కూడా అంటారు. అయినా మీకు శ్రద్ధ ఉంటే ఏ పురోహితులనో అడుగవచ్చు. పుస్తకాలున్నాయి. ఒక మాటు వైద్యనాథదీక్షితీయాన్ని చూడండి. లేదా సోమదేవుని గ్రంథం చూడండి. *(ధర్మ సింధువు నిర్ణయ సింధువు వంటి గ్రంథాలను చూడవచ్చు-అనువక్త)*

వైదికాచారాలను గురించి తిరుక్కురల్, నన్నేరి, అరనేరిచారం వంటి గ్రంథాలు ఏనాడో పేర్కొన్నాయి. తమిళంలో నీతివెంబ అనే గ్రంథం ధర్మశాస్త్రాల సారాంశంతో ఉంటుంది. ఆచారకోవై అనే తమిళ గ్రంథంలో ఎట్లా దినచర్య ఉండాలో వివరంగా ఉంది.

## ఆనాటి ఉన్నతస్థితి - నేటి పతన స్థితి

ఆనాటి వారు ఉన్నతంగా బ్రతికారు. కారణం, శాస్త్రాచారాలను పాటించడం వల్లనే. మనము మొదలు పెట్టినపుడు కష్టంగా ఉండవచ్చు. మనలను కష్టపెట్టడానికి అవి పుట్టలేదు. సుఖ సంతోషాలతో బ్రతకడానికే. సూర్యోదయానికి ముందు లేవడం – కాలకృత్యాలు – స్నానం –

సంధ్యావందనం - గాయత్రీజపం - మధ్యాహ్న సంధ్యావందనాదులు - సాయం స్నానం - సంధ్యావందనం - దేవాలయదర్శనం - సత్కథా శ్రవణం, మొత్తం జీవితం అంతా అట్లా సాగిపోతే ఎంతో తృప్తి, ఆనందం కల్గుతాయి.

వ్యక్తులకు ముందు శుభ్రత, తద్వారా ఆరోగ్యకరమైన సంఘమే ప్రాచీనుల లక్ష్యం. నేడు ఆచారాలు మూర్ఖమని ఈసడిస్తున్నాం. రాబోయే తరానికి ఆదర్శవంతంగా ఉండవలసిన మనమే పతితులమైతే ఏ ఆదర్శాన్ని అందించగలం? ఆలోచించండి. రోగికి చివర ప్రాణవాయువు నిచ్చి బ్రతికిస్తారు. అట్లాగే పతనావస్థకు విరుగుడు, సదాచారాన్ని ఆరంభించి చూడండి.

## పెద్దలు పాటించిన ఆచారాలు - శాస్త్రాల పుట్టుక

అయితే పుస్తకాలను చూసి మొదలు పెట్టాలా? ఆ పుస్తకాలు వ్రాసినవారు, వారి పూర్వులు పాటించిన నియమాలను తెలుసుకొని, శాస్త్రాలను చదివితే తెలియదు. పూర్వీకులు ఎలా వాటిని పాటించారో తెలుసుకోవాలి. మనువు, ఆపస్తంబుడు, అశ్వలాయనుడు మొదలైన స్మృతికర్తలు మేము క్రొత్తగా నియమనిబంధలను పెట్టామని అనలేదు.

ఈ ఆచారం ఎప్పుడు మొదలైంది? పంచకచ్ఛలు పోసి బట్ట కట్టుకోవాలనే ఆచారానికి ఆది ఎక్కడ? నుదిటిపై తిలకాన్ని ధరించాలని ఎవరు ముందన్నారు? ఆచమనం చేయాలని ఏదైనా సభలో తీర్మానించారా? కనుక అనాదినుండి అట్టి ఆచారాలు పరంపరగా వస్తున్నాయి. ఏది సంఘానికి మంచిదో అవి పూర్వులకు తెలుసు.

పూర్వులొక క్షుణ్ణమార్గం వేసారు. దానిపై అనాది నుండి నడుస్తున్నారు. ఎవరు కాలిబాటను వేసారంటే చెప్పగలమా? ఎందరో నడిచారు. ఈ జీవన విధానం పుస్తకాల వల్ల ఏర్పడింది కాదని గుర్తించండి.

మిగతా వారికి ఒక కర్త అంటూ ఉన్నాడు. ఎవరైనా రోడ్డును బాగు చేసారని అంటున్నారే కాని, కాలిబాటను బాగుచేసారని ఎవ్వరూ అనరు కదా. నడిచే కొద్దీ పాడయ్యేది తారురోడ్డు. అందువల్లనే ఒకని ద్వారా ఏర్పడిన గ్రీకు, హిబ్రూ, కన్ఫ్యూషియస్ మతాలు కనుమరుగైపోయాయి. కాని మన మతం బ్రతికే ఉంది. ఈ మార్గంలో నడిస్తే వేగంగా గమ్యాన్ని చేరుకోలేక పోవచ్చు. నెమ్మదిగా మనమూ చేరుకుంటాం.

ఈ కాలిబాట కనీసం, ఐదువేల సంవత్సరాలనుండి వస్తోందని ఆధునిక పరిశోధకులంటున్నారు. దీనిమీద నడవకపోతే గడ్డి మొలుస్తుంది. కనుక అనుసరిద్దాం.

# ఆహార నియమాలు

## ఆచారం - మనం తినే ఆహారం

ఒక రాజుకీ ఒక గొప్ప గురువు ఉండేవాడు. ఆయన అప్పుడప్పుడు వచ్చి అనేక విషయాలు చెబుతూ ఉండేవాడు. ఒక దినం బాగా ప్రొద్దు పోయింది. ఈ పూట, ఇక్కడే భుజించండని రాజు చెప్పగా అతడు ఆరగించి విశ్రాంతి తీసుకున్నాడు.

ఆ గదిలో ఒక ముత్యాలహారం వ్రేలాడుతోంది. దానిని దొంగిలించాలని ఇతనికి బుద్ధి పుట్టింది. ఆ హారం చాలా విలువైనది. గురువే ఈ పని చేస్తాడని రాజు భావించలేదు. ఆస్థానం అంతా గాలించారు. హారం కనబడలేదు. ఒకరోజు గడిచింది. కాని గురువునకు ఆ రాత్రి నిద్ర పట్టలేదు. మనస్సు పీకుతోంది. విరేచనాలు పట్టుకొన్నాయి. మర్నాటి ఉదయానికి శరీరం క్షీణించినా మనస్సు తేటగానే ఉంది.

గురువు ముత్యాలహారంతో మధ్యాహ్న సమయంలో రాజమందిరానికి వెళ్ళాడు. నేనొక సన్యాసిని, నాకీ పాడుబుద్ధి పుట్టింది. శిష్యుడిచ్చిన సత్కారాలు తీసుకొని కూడా దొంగతనం చేయాలనే బుద్ధి పుట్టింది. నన్ను శిక్షించవలసిందిగా రాజుతో అన్నాడు.

ఎవరో మీ శిష్యుడు దొంగతనం చేయగా అతణ్ణి రక్షించడం కోసం మీరీ మాట అంటున్నట్లు కన్పిస్తోంది. మీరు దొంగతనం చేసారంటే నేను నమ్మను అన్నాడు రాజు.

కాదు, నేనే చేసానన్నాడు గురువు. కాని శిక్ష విధించేటపుడు, ఎవరు, ఏ పరిస్థితులలో చేసారని శిక్ష వేయాలి కదా! ఒకమాటు తప్పు చేయగా, అతడు పశ్చాత్తాపపడితే అతణ్ణి శిక్షించరు కదా. దీనికుపాయం మీరే చెప్పండని రాజు అన్నాడు.

గురువు బాగా ఆలోచించి "నిన్న ఇక్కడ భుజించాను. నాకీ పాడుబుద్ధి అపుడు పుట్టింది. తిన్న అన్నం జీర్ణం కాక విరేచనాల రూపంతో కుళ్ళు కొట్టుకొని పోయింది. ఆపైన మనస్సు తేలికపడింది. ఆహారం నా కడుపులో ఉన్నంతవరకూ నాకీ పాడు బుద్ధి పుట్టింది. కనుక వండించిన అన్నంలో దోషమేదైనా ఉందేమో పరిశీలించండి" అని అన్నాడు.

వంట సామాగ్రియే కాదు, వంట చేసేవాడూ మానసికంగా, శారీరకంగా పవిత్రంగా ఉండకపోతే ఇతని దోషాలు అన్నంలో ప్రవేశిస్తాయి.

బియ్యం ఎక్కడినుండి వచ్చాయని ఆరా తీసారు. వెనుక ఓ దొంగ, బియ్యపు బస్తాలను దొంగిలించగా అతణ్ణి శిక్షించారు. అయితే వాటి యజమాని ఎందుచేతో ఆ బస్తాలు తీసుకొని వెళ్ళలేదు. అట్టి సందర్భంలో అవి రాజుకే చెందుతాయని సామాన్ల గదిలో ఉంచి ఆ బియ్యాన్ని నిన్ననే వండాం అన్నారు సేవకులు.

రాజధర్మం ప్రకారం రాజు అట్టివాటిని గ్రహించవచ్చుగాని అటువంటి అన్నదోషం ఉన్నందుకు గురువు స్వీకరించ కూడదు. నేరం చేసే మనస్తత్వం లేకపోయినా నేరం చేసాడు. భగవానుడు కరుణించి విరేచనాలు రూపంలో ఆహారసారం, రక్తంలో చేరకుండానే బయటకు పంపించాడు.

అందుకే రాజాన్నాన్ని తినవద్దని శాస్త్రాలంటున్నాయి. సూక్ష్మక్రిములవల్ల రోగాలెట్లా వ్యాపిస్తాయో దుష్టభావాల వల్ల కూడా ఆహారం కలుషితమై పోతుంది.

నేనిది పరీక్షించకుండా అన్నం పెట్టినందుకు నన్నే శిక్షించండని రాజన్నాడు. గురువు క్షమించక తప్పలేదు.

## ఆహారానికి సంబంధించినవి

సూక్ష్మక్రిములు సోకి రోగంతో ఉన్నవానితో సంపర్కం ఏర్పడితే, తెలియకపోయినా ఆ రోగం మనకు సంక్రమిస్తోంది కదా! మైక్రోస్కోపు

ద్వారానే సూక్ష్మక్రిమిని గుర్తించగలం. కంటికి కన్పిస్తోందా? అతీంద్రియశక్తి కలవారు అట్టి మైక్రోస్కోప్ వంటివారు.

అసలు ఆహారవస్తువులే శుభ్రంగా ఉండాలి. ఉల్లివంటివి వాడకూడదు. ఈ కథలో దోషులెవరు? ముందుగా సామాను గదిలో వస్తువులకు, సేవకులకు సంబంధం ఉంది. రాజు, అన్నం పెట్టాడు. తరువాత దొంగ సొమ్ము ప్రస్తావన వచ్చింది. అసలు ధాన్యం పండించేవారివరకూ వెళ్ళవద్దు. నదీమూలం ఋషిమూలం తెలియదన్నారు కదా. అట్లా డబ్బిచ్చి కొంటున్నాం కనుక పంటదోషాన్ని ఎంచవద్దు. ఇక వండేవాడు, వడ్డించేవాడు పవిత్రంగా ఉంటే చాలు. ఆనాటి బ్రాహ్మణుడు భిక్షమెత్తుకొని జీవించేవాడు కావున అతనికి అర్పింపబడేది, గౌరవంతో. ప్రేమతో మిళితమై యుండేది. కనుక వారికి అన్న దోషం అంటదు. రాజునకు చెందిన ద్రవ్యంలో సత్పురుష ద్రవ్యం, అసత్పురుష ద్రవ్యం అనే తేడా ఉండదా? కాని ఈ కాలంలో సత్పురుషులు కొందరే ఉంటున్నారు. సాధ్యమైనంత వరకు దొంగ వస్తువుల్ని, నల్లబజారులో అమ్మే వస్తువుల్ని కొనకుండా ఉండగలిగితే పవిత్రత సిద్ధించినట్లే. అయితే పూర్వకాలంలో సాధారణంగా మంచి జీవితం గడిపేవారే ఎక్కువమంది ఉండేవారు కనుక వండేవాడు, వడ్డించేవాడు పవిత్రంగా ఉంటే సరిపోతుందని భావించేవారు.

## త్రిగుణాలు

తినే ఆహారం, శరీరానికే కాకుండా మనస్సుకూ బలాన్ని చేకూర్చాలి. అనగా సత్వగుణాన్ని వృద్ధి చేయాలి. అనగా కోపం, వెఱ్ఱి కోరికలు లేకపోవుట, ప్రశాంత చిత్తత, అంతమాత్రంచే స్తబ్ధుగా ఉండకపోవుట, పనిచేయడానికి తగినంత శక్తి అనేవి. రజోగుణం వల్ల ఆందోళన కలిగియుండడం, కోరికలకు దాసుడగుట, కోపతాపాలు మొదలైనవి వస్తాయి. తమో గుణం వల్ల

సోమరితనం, బుద్ధిమాంద్యం కల్గుతాయి. రజోగుణంలో భావావేశానికి లోనై అడ్డదిడ్డంగా పనులు చేయడం ఉండగా, దానికి విరుద్ధంగా అసలు పనిచేయకుండా ఉండడం తమోగుణ లక్షణం. సత్వగుణంలో సరితూగునట్లు చేసే లక్షణముంది.

సత్వగుణాన్ని మించిందీ ఉంది. ఇందులో ఆలోచన, క్రియ అదుపులో ఉంటాయి. అది భావాతీతస్థితి. తమస్సులో మనస్సు స్తబ్దంగా ఉంటుంది. నిద్ర కూడా వస్తుంది. అయితే సమాధిలోనూ మనస్సు పనిచేయదు. ఏమిటి తేడా? నిద్రబోయేవానికి ఏమీ తెలియదు. సమాధిలో నిద్రబోతున్నట్లుగా ఉంటాడు గాని అన్నీ తెలుస్తాయి. ఉన్నదంతా తానే అనే ఎఱుక ఉంటుంది. మనమనుకునే అహంకారంతో కూడిన నేను, ఉండదు. పూర్ణాహంకారంతో ఉంటాడు. అతడు రజోగుణం కలిగినవానికి కంటె లోకానికి క్షేమం కోరుతాడు. మనమొకదానియందు తగులుకొని చేస్తాం. అతడు అట్టి భావన లేకుండా పనులు చేస్తాడు. ఈ మూడూ దాటితే గుణాతీత స్థితి. అది సత్యస్థితి. వీటి గురించి సాంఖ్యశాస్త్రంలో, గీతలో చెప్పబడింది. నిస్త్రైగుణ్యోభవ. గుణత్రయవిభాగం అనే అధ్యాయం ఉంది, గీతలో దైవాసుర సంపద్విభాగయోగంలో దైవగుణాలనగా సత్వం, గుణాతీత లక్షణమని; అసుర గుణాలనగా రజస్తమోగుణాలని చెప్పబడింది. తరువాత శ్రద్ధాత్రయ విభాగయోగంలో మూడు రకాలైన శ్రద్ధ చెప్పబడింది. ఇది మూడు గుణాలను బట్టి యుంటుందని చెప్పబడింది. యజ్ఞాలు, తపస్సు, ధ్యానం మొదలైన సత్వగుణం వల్ల వచ్చిన శ్రద్ధయని అట్లే మిగిలిన వాటి గురించి ఉంది

## ఆహారము - గుణాలు

మంచి ఆహారమంటే పరిశుభ్రంగా, పోషకాహారపు విలువలతో వడ్డించిందనే అర్థం కాదు. ఇక్కడ సాత్త్వికాహారమే. సత్వగుణాన్ని వృద్ధి చేసేదే.

వండిన, వడ్డించిన వ్యక్తి ప్రేమపై ఈ సాత్త్వికాహారం ఆధారపడి యుంటుంది. తల్లికి, భార్యకు ఇది చెల్లుతుంది. వండేటపుడు ఏదో ఆలోచిస్తూనో ఎవర్నో తిడుతూనో చేస్తే ఫలం ఎట్లా ఉంటుంది? పై రాజు సన్యాసి కథ వల్ల శ్రద్ధ అవసరమని తేలింది కదా.

వంట మొదలు పెట్టిన దగ్గరనుండీ భగవన్నామాన్ని ఉచ్చరిస్తూ ఉంటారు. తినేవారు గోవింద అంటూ తినాలని అపుడు ఏ దోషమైనా పోతుందని అంటారు.

నామజపం యాంత్రికంగా సాగకూడదు. భక్తితో సాగాలి.

అయితే ఇంట్లో వంట చేసినా తప్పు పడుతున్నారేమిటి? అని సందేహిస్తున్నారు కదా.

వండే హోటల్, హాస్టల్‌లో శుభ్రతను పాటించవచ్చు. అయినా వండే వారిలో మనస్సు స్వచ్ఛంగా ఉంటుందని చెప్పలేం. ఆచారాలు సున్నా పనివాళ్ళు కేవలం డబ్బుకోసమే పనిచేస్తారు.

ఇంట్లో పాత్రను గోమయంతో శుభ్రం చేస్తారు. అన్నం తినేటపుడు మంత్రజలాన్ని ప్రోక్షిస్తారు. దేవతా నివేదన ఉంటుంది. ప్రాణాహుతులను అర్పిస్తారు. కేవలం నాల్క తృప్తికోసం తినాలంటే ఏ ఆచారమూ అక్కర్లేదు. ఇక మనకు, జంతువులకు తేడా ఏమిటి?

ఇంట్లో నియమాలు సాగినట్లు హోటల్‌లో సాగదు కదా.

సత్వగుణాన్ని వృద్ధి చేసే చాలా శాకాహారాలున్నాయి. రుచిని కల్గించాలి. శరీరాన్ని పోషించేవి ఉన్నాయి. మామూలు రోజులలో పాలు, మజ్జిగ, పండ్లు వంటివి ఆకలిని తీర్చడమే కాదు, మనస్సుకు ప్రశాంతతను తీసుకొస్తాయి.

కేవలం అన్నమయ కోశంతోనే ఆగిపోకుండా ఆనందమయకోశం వరకూ ప్రయాణం సాగించాలి. ఇది ఒక కోశం కనుక దీనినీ నిర్లక్ష్యం చేయకూడదు.

అన్నాన్ని నిందించవద్దని తైత్తిరీయ ఉపనిషత్తు చెప్తోంది. అన్నం న నింద్యాత్ అన్నాన్ని వృద్ధి చేయమంటోంది. అన్నం బహుకుర్వీత. అంత మాత్రంచే అన్నీ తినండని, ఎవరిచ్చినా, ఎక్కడైనా, ఎప్పుడైనా తినండని కాదు. రోజుకొకసారి తినేవాడు యోగి, రెండుసార్లు తినేవాడు భోగి. ఇంకా చాలాసార్లు తినేవాడు రోగి అనే మాట ఉంది కదా.

ఈ స్వతంత్రదేశంలో ప్రాధాన్యం. రాశికి; వాసికి కాదు. ఇది తిండికి కూడా సంక్రమించింది.

కనుక తల్లి, లేదా భార్య నామ జపం చేస్తూ ప్రేమతో వండాలి. గోవింద అంటూ తినాలి. అయితే వారిని నామజపం చేస్తూ వండండని నిర్బంధించగలమా అని ప్రశ్నిస్తున్నారు కదూ! అయితే ఎవరికి వారు వండుకోవడం శ్రేష్ఠం. అదే స్వయంపాకం.

## వస్తువుల పవిత్రత

గీతలో వివిధ గుణాలు వృద్ధి చేసే ఆహారం గురించి చెప్పబడింది:

**ఆయుః సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః**

**రస్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః**

అనగా ఆయుర్దాయాన్ని, ఉత్సాహాన్ని, శక్తిని, ఆరోగ్యాన్ని, సంతోషాన్ని వృద్ధి చేసే రసవంతములైనవి, నేతితో కూడిన పుష్టికరాలైన మనోహరాలైన తినదగిన వస్తువులు సాత్వికాహారమనబడుతుంది.

ఇక రాజసికాహారం:

**కట్వామ్ల లవణ అత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః**

**ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకమయ ప్రదాః**

తా: మిక్కిలి చేదు, పులుపు, ఉప్పు, వేడి, కారాలతో ఎండిన, మంట కలిగించేవైన ఆహారాలు దుఃఖాన్ని, శోకాన్ని, రోగాన్ని కల్గిస్తాయి. ఇవి

రాజసప్రవృత్తి కలవారికి ఇష్టంగా ఉంటాయి (కటువనగా కారము, తిక్తమనగా చేదు).

షడ్రుచులలో ఒక్క తీపిని మినహాయిస్తే మిగిలిన ఐదు రసాలు, రాజసమైనవిగా లెక్కింపబడడం విని ఆశ్చర్య పోతాం. మనం ఉప్పు, చింతపండు లేకుండా తినగలమా అంటారు కూడా. అంటే పైవి అధికంగా తీసుకోవద్దని గీతాకారుని సలహా. మితంగా స్వీకరించవచ్చు. జ్ఞాన వైరాగ్యాలు పట్టుబడినవాడు పూర్తిగా ఉప్పును, చింతపండును, కారాన్ని త్యజించవచ్చు. దేంట్లోనూ అతి పనికిరాదు. ఎక్కువగా తినకూడదు, కడుపు మాడ్చనూ కూడదు. అట్లాగనే నిద్రావిషయం లోనూ. అట్టివాడు యోగియని గీతావచనం (6-16, 17).

రాజసికాహారంలో తీపి లేదు, సాత్వికాహారంలోనూ తీపి ప్రత్యేకంగా పేర్కొనబడలేదు. మధుర పదార్థం అంటే నోరూరుతుంది. అవి తింటే సత్వగుణం వస్తుందని భ్రాంతి పడవద్దు. ఎక్కువగా తీపి, మధుమేహరోగానికీ దారి తీయవచ్చు. రాజసికాహారంలో తీపిని ఎందుకు పేర్కొనలేదు? తీపి పదార్థాలను పండుగలలో తింటాం. అందువల్ల వీటినే పేర్కొన్నాడని భావించవచ్చు. మిగిలిన వాటిని ఎక్కువగా తిన్నట్లు తీపి పదార్థాలను ఎక్కువగా తినలేం. వేడిగుణం ఉన్న పదార్థం ఆవేశాలకు, నరాల దౌర్బల్యానికి దారితీస్తుంది. అయితే మరీ చల్లగానున్నవి తమోగుణాన్ని వృద్ధి చేస్తాయి.

**యాతయామం గతరసం పూతి పర్యుషితంచయత్**

**ఉచ్ఛిష్టమపిచ అమేధ్యం భోజనం తామసప్రియం**

తా: వండిన చాలాసేపటికి తినే ఆహారం, రసం లేక శుష్కించినది, పాసిపోయి చెడు వాసన వచ్చేది, చద్దిభోజనం, ఇతరులు తినగా మిగిలినది, నిషిద్ధమైన ఆహారాలు తామస ప్రకృతి కలవారికిష్టం. (అమేధ్యమనగా

భగవంతునకు నివేదన చేయనట్టిది, అపవిత్రమైనదని అనగా కొందరు మాంసమని అన్నారు. అపవిత్రమనగా యజ్ఞానికి పనికిరానిదని).

యామమనగా మూడు గంటలకాలం. ఈ కాలానికి మించినది యాతయామం. ఇక సోడాలు, బిస్కత్తులు, ఐస్‌క్రీమ్‌లు నివేదనకు పనికిరావనే కదా. అయితే పులిహోర వంటి రాజసికాహారాన్ని నివేదిస్తారు. అంతకంటె తక్కువయైన తామసికాహారం నివేదనకు పనికిరాదు.

## నియమాలలో ప్రత్యేకతలు

చద్ది అన్నం, తామసికాహారమన్నాం. కాని కష్టపడి పనిచేసేవారికి అది మినహాయింపు. ఎనిమిది సంవత్సరాల లోపుగానున్నవారికి, 80 సంవత్సరాలు దాటినవారికీ ఎక్కువ ఆహార నియమాలు లేవు. ఆ నియమాల సడలింపు కోరికలను బట్టి యుంటుంది. చివరి రోజులలో ఈ నియమాలేమిటని ముసలివారిని కొంత ఉదారభావంతో ఇతరులు చూస్తారు.

అంటే అందరికీ అన్ని నియమాలు వర్తించవని, కొన్ని సడలింపులు కొందరికి ఉన్నాయని తెలుస్తోంది. ఇవి వర్ణాశ్రమాలను బట్టి ఉంటాయి. బ్రాహ్మణులకున్న నియమాలు ఇతరులకు లేవు. మద్యం, మాంసభోజనం క్షత్రియులు మొదలైనవారికి ఉన్నాయి. కష్టపడి పనిచేసేవారిని ఎక్కువ నియమాలు పెట్టవద్దని అట్లా ఉన్నాయి. మాంసాన్ని కూడా వ్రతాదులలో, పితృకార్యాలలో బ్రాహ్మణేతరులూ వాడరు. వయస్సు మీద పడినకొద్దీ ఇంచుమించు అందరూ శాకాహారానికి మొగ్గు చూపిస్తారు.

## ఆదర్శం - నిజజీవితంలో

ఆదర్శాన్ని విస్మరించకుండా నిత్యజీవితంలో ఉన్నవారు రానురాను, ఆదర్శానికి చేరువౌతారు.

కులాచారాన్ని బట్టి ఈ ఆహార నియమాలను పాటిస్తారు. మాంసం తిననివారు, రెండు తరాలనుండి మాలో లేదని అంటారు. అంతకు ముందున్నవారు మాంసాహారులనే కదా!

ఎక్కువగా ఆదర్శాన్ని గురించి మాట్లాడినా ఆచరణలో అట్టిది కనబడకూడదు కూడా. గాంధీగారు, అహింసపై ఎక్కువ మక్కువ చూపారు. చాలామంది పాటించారానాడు. కానీ నేడు హింస చెలరేగిపోతోంది. శాకాహారం బ్రాహ్మణులలో ఉన్నా మాంసాహారంపై మోజు చూపిస్తున్నారు.

బౌద్ధం, అహింసనే ప్రధానంగా చేసుకొన్నా చీనా, జపాన్ దేశాలలో అది ప్రాకినపుడు, మనవారు కూడా తినని కప్పలను, పాములను వారు తినడం మొదలు పెట్టారు. మాంస విక్రయ కేంద్రాలలో జరిగే హింసలో నూరవవంతైనా లేని యజ్ఞంలోని హింసను చూసి బుద్ధుడు గగ్గోలు పెడితే ఈనాడా మతం వారు చేసే హింస చెలరేగిపోతోంది. ఈనాడు యజ్ఞాలు చేయకపోయినా బ్రాహ్మణులు శాకాహారులుగానే ఉన్నారు.

మన మతంలో బ్రాహ్మణులు తప్ప మిగిలినవారికి మాంసభోజనం నిషిద్ధం కాదు. కేవలం సన్న్యాసులే శాకాహారులు మనలో. కాని బౌద్ధమతంలో భిక్షువులు కూడా మాంసాహారులే. ఇది ఈనాడే కాదు. 1300 సంవత్సరాల వెనుక మహేంద్రవర్మ వ్రాసిన మత్తవిలాస ప్రహసనంలో వీరి నడవడికని వేళాకోళం చేసాడు. దానిలో ఒక కాపాలికుని భిక్షాపాత్ర కనబడలేదు. అరెరె! అందు వండిన మాంసం ఉంది. దీనిని ఏ కుక్కయినా తినాలి, లేదా బౌద్ధ భిక్షువైనా తస్కరించి యుండాలి అని ఉంది. ఆ ప్రహసనంలో బుద్ధ భిక్షువు సంతోషంతో "ఏం భిక్ష పెట్టారయ్యా. ధనదాసుడనే వర్తకుడు పెట్టిన చేపలకూర, మాంసం ఎంత రుచిగా ఉందో" అని లొట్టలు వేసుకుంటాడు.

ఆనాడు కాంచీపురంలో చాలామంది బౌద్ధ భిక్షువులు ఉండేకాలంలో ఆ రాజు అట్లా వ్రాసాడు. పై మాటలు ఆనాటి సాంఘికాచారాలను ప్రతిబింబించడం లేదా?

మన మతంలో బౌద్ధంలో ఉన్న తీవ్ర అహింసా మార్గం లేదు. సన్యాసి మాత్రమే వీటికి దూరంగా ఉండాలని ఉంది. కనుక అహింసను నెత్తిన పెట్టుకొన్న ఆ మతంలో హింస చెలరేగింది కదా! ఇది ఏమిటయ్యా అని అడిగితే జంతువులను చంపవద్దని బుద్ధుడన్నాడు గాని, చంపిన వాటి మాంసాన్ని తినవద్దని అనలేదు కదా అని అతి తెలివితో సమాధానం చెబుతారు.

అటువంటి వారిని దృష్టిలో పెట్టుకొని తిరువళ్లువర్ తన కురల్‌లో ఒక మాట అన్నాడు

"వధ్యశాల లేకపోతే మాంసం అమ్మేవాడే ఉండడు. వీళ్ళు తినడం వల్లనే ఆ మాంసం కొట్టు ఉంది. తినేవాడు లేకపోతే కొట్టు పెట్టవలసిన అవసరం ఉండదు కదా" అని తిరువళ్ళువర్ మాటలలోని తాత్పర్యం. అంటే చంపేవానికే కాదు, తినేవానికీ పాపం చుట్టుకొంటోంది.

ఇట్టి చేష్టలవల్లనే బౌద్ధమతం, ఇతర దేశాలలో అడుగుపెట్టింది. జంతువులను చంపకపోయినా మాంసం తింటున్నారు కనుక మహమ్మదీయులు, ఆ దేశాలు వెళ్ళి కసాయి శాలలు పెట్టి డబ్బు చేసుకొన్నారు. మహమ్మదీయుల సంపాదనను విని, కొంతమంది ఆదేశాలలో వడ్డీవ్యాపారం చేసి బాగా గడించారు. మహమ్మదీయులు వడ్డీ పుచ్చుకోవడం ఖురాన్‌లో నేరం. కనుక వీళ్ళు ఆ వ్యాపారం చేసారు.

బుద్ధుడు, అశోకుడు నడయాడిన ఉత్తరదేశం, బీహారులలో వారి కాలంలోనే మాంసాహార భోజనం ఉండేది. చాలాకాలం వరదలతో బాధపడి కూరలు దొరకని బెంగాల్ వంటి ప్రాంతాలలో తప్పనిసరై అన్ని జాతులవారూ చేపలు తినడానికి అలవాటు పడ్డారు అక్కడున్న బ్రాహ్మణులు. మిగతా జంతువుల మాంసాన్ని తినకపోయినా చేపలను తింటారు. కొంతమంది.

శిష్టాచార బెంగాలీ బ్రాహ్మణులు శాకాహారాన్నే తీసుకుంటారు. ప్రక్కనున్న బీహారులో మాత్రం కాదు. అట్లా అని బెంగాల్ బ్రాహ్మణులు చేపలు తినడాన్ని సమర్థిస్తున్నానని భావించవద్దు. మన అంగీకారం అవసరం లేకపోయినా ఆచారమట్లా వచ్చింది. మిగతా ప్రాంతాలలో తినేవాడు తింటాడు, లేనివాడు లేదు. నిర్బంధం లేదు. హింస పనికిరాదన్న బౌద్ధమతం, హింస చేయడానికి వెనుకాడలేదు.

అందుకే తాము మాంసం తినకుండా మిగతా వారికి ఆదర్శంగా నిలిచారు బ్రాహ్మణులు. ఇతని వృత్తి అధ్యాపనం. పాఠాలు చెప్పడమే కాదు, నడవడికచే ఇతరులకు అన్ని విషయాలలో పాఠాలు చెప్పే స్థితి అది. ఇట్టి త్యాగాన్ని గుర్తించకుండా వీరికేవో సదుపాయాలను కల్పించారనడం సబబుగా ఉందా? వేదరక్షణ చేయాలి కనుక ఇతనికి ఎక్కువ నియమాలున్నాయి. మిగిలినవారికి కొన్ని సడలింపులున్నాయి.

## శైవాహారం

శాకాహారాన్ని శైవాహారంగా వ్యవహరించారు. శైవులలో బ్రాహ్మణేతరులు కూడా శాకాహారులే. వారు మనస్సును పవిత్రంగా ఉంచని కాయగూరలను కూడా తినరు. వారు మూడు కాయలను విసర్జిస్తారు. కాయ అంటే శరీరం. అంటే ఇక్కడ స్థూల సూక్ష్మకారణ శరీరాలని అర్థం కాదు. కాయం పదం చివరనున్న వాటిని త్యజిస్తారు. వెంగాయం (వంకాయ), ఉల్లికాయం (చిన్నుల్లి), పెరుంకాయం(ఇంగువ), ఇవి మాంసం తరగతిలో రాకపోయినా రజస్తమోగుణాలను వృద్ధి చేస్తాయి కనుక వీటిని వారు ఆహారంలో వాడరు. కాయం, అనే మాటకు మాంసం అని తమిళంలో శ్లేషార్థం వస్తుంది.

చిత్రమేమంటే దక్షిణ దేశంలో శైవం శాకాహారానికి పర్యాయపదంగా ఉండగా, ఉత్తరదేశంలో వైష్ణవం అట్టిది. దక్షిణ దేశంలో శివుణ్ణి, అమ్మవారిని

సౌమ్యరూపంలో అర్చిస్తాం. ఉత్తర దేశంలో వీరిని కాలభైరవ, కాళి, దుర్గా ఉగ్రరూపాలలో ఆరాధిస్తారు. వల్లభ, రామానంద, చైతన్యుల ప్రభావం ఆ ప్రాంతాలలో ఉంది. వీరు కేవలం రామానుజ మతానికి చెందకపోయినా దానికి దగ్గరగా ఉంటారు. విష్ణుపూజను వ్యాప్తి చేస్తారు. ఉత్తరదేశంలో జైనులు వీరి ప్రభావానికి లోనై తిరిగి హిందూమతంలో ప్రవేశించి వైష్ణవులయ్యారు. చాలా సంఖ్యలలో వారందరు మొదటినుంచి శాకాహారులు. అందువల్ల శాకాహారం అక్కడ వైష్ణవాహారం అయింది.

దక్షిణ దేశంలో జ్ఞాన సంబంధర్ వల్ల జైనులు శైవులై శాకాహారులయ్యారు. కనుక ఇక్కడ అది పర్యాయపదమైంది.

ఉత్తర దేశంలో వల్లభాచార్యుల కాలంలో చాలామంది జైనులు, హిందూమతంలోకి రాగా రామానుజుల ప్రభావంచే జైనరాజే వైష్ణవాన్ని పుచ్చుకొన్నాడు. వల్లభ సిద్ధాంతాన్ని పుష్టిమార్గం అంటారు. వైశ్యులు వీరి మార్గాన్ని అవలంబించగా వీరిని పుష్టిమార్గ బనియాలంటారు. వాణిజ్య పదంనుండి బనియా పదం పుట్టింది. వారు కేసర రంగు వంటి నామాన్ని ధరిస్తారు. తులసిమాలను ధరిస్తారు. గాంధీవారిలోని వారే. జైనసిద్ధాంతం ఒంటబట్టడం వల్ల పూర్తి అహింసావాదులుగా వాళ్ళు ఉన్నారు. మాంసం తిని బలిసినవానికి దయ ఉంటుందా?" అని తిరువళ్ళువర్ ప్రశ్నించాడు. మనిషిలో దయలేకపోతే ఈశ్వరుడెట్లా వానిపట్ల దయ చూపిస్తాడని ప్రశ్నించాడు. దయ, ప్రేమల గురించి చెబుతూ "మాంసాహారాన్ని తినడం విరుద్ధ ప్రవర్తనగా లేదా? అందరూ భగవత్ సంతానమైతే అతని సంతానంలోని పశు, పక్షులను చంపడం భ్రాతృహత్య కాదా? కనుక మాంసాహారాన్ని ప్రోత్సహించేవారు, విశ్వ సౌభ్రాతృత్వం గురించి మాట్లాడితే ఎలా?" అని అన్నాడు.

## కాయకూరలు తినేవారిలో హింసలేదా?

జంతువులలో ప్రాణమున్నట్లే చెట్లలోనూ, ప్రాణం ఉందని, వాటికీ సుఖః దుఖాదులుంటాయని జగదీశ చంద్రబోస్ ఋజువు చేసాడు కదా! కనుక కూరలను తరిగినా హింస కాదా అని ప్రశ్నిస్తారు.

బోస్ కనుగొనడానికి ముందే మొక్కలకూ, చెట్లకూ ప్రాణ, సుఃఖదుఖాదు లున్నట్లు వేదశాస్త్రాలు చెప్పాయి. ఈశ్వర సృష్టిలో మంచీ, చెడూ ఉంది. అది ఈశ్వర నియతి. పెద్దపులి, సింహం, ఇతర జంతువులను తినడం సహజం. మానవునకే వివక్షణ జ్ఞానాన్ని ప్రసాదించాడు. ఈ జగన్నాటకంలో అంతా మిశ్రితంగా ఉంటుంది కనుక చెడును పరిహరించి మంచిని స్వీకరించవలసి వస్తుంది. బ్రతకడానికి కొంత తినవలసి వస్తుంది. లేకపోతే మనుగడ ఉండదు. సాధ్యమైనంత వరకు ఇతర ప్రాణులను బాధించకుండా తినవలసి వస్తుంది. శాకాహారంలో తక్కువగా ప్రాణి హింస ఉంటుంది.

నేలమీద పడడానికి సిద్ధంగా ఉన్న ధాన్యాన్ని, గింజల్ని వాడుతున్నాం. పండిన పండ్లనే గ్రహిస్తున్నాం. మనం కూరగాయలను కోసినా పూర్తిగా మొక్కల్ని నాశనం చేయడం లేదు. మనం వాటిని త్రుంపినా వాటికి ఎక్కువ బాధ ఉండదు. మనం గోళ్ళను కత్తిరించుకొన్నట్లుంటుంది. కోయకపోతే వాటంతట అవే నశిస్తాయి కూడా. మనం బ్రతకాలి కనుక తక్కువ హింసనే చూపిస్తున్నాం.

పూర్తి అహింసను సన్యాసులు పాటిస్తారు. కనుక వారు ఆకులను కూడా త్రుంపరు. కూరలను కోయరు. నేలమీద పడినవాటిని గ్రహిస్తారు. అందుకే **జీర్ణపర్ణాశినః క్వచిత్.** ఏ పండును సన్యాసి తిన్నా అందున్న గింజలను పూర్తిగా తీసి తినాలి. అందలి ఏ విత్తనాన్ని తినకూడదు. అంటే పరల మొలకెత్తకుండా చేయకూడదన్నమాట. అదే సరియైన ఫలాహారం. కాని

ఈ పేరుతో దోసెలు, ఇడ్లీలు వంటివాటిని తిని ఫలాహారమంటున్నాం. పై ఫలాహారమే సత్త్వాన్ని, శాంతాన్ని ప్రసాదిస్తుంది. కామం అదుపులో ఉంటుంది. ప్రత్యేకంగా కుటుంబ నియంత్రణ పద్ధతుల్ని పాటించనవసరం లేదు.

మాంసాహారం వల్ల సత్త్వగుణం వృద్ధి పొందదు. శరీరానికి పుష్టి ఏర్పడవచ్చు. ధ్యానాదులకు ఉపయోగపడదు. కాని శాకాహారం అట్లా కాదు. శాకాహారంలో కొన్ని నిషేధాలు ఉన్నా ఆధ్యాత్మికాభివృద్ధికి అది మాంసాహారం కంటె చాలా రెట్లు నయం.

గింజలను లాగినపుడు, మేకను కోసినపుడున్న బాధకు తేడా ఉండదా? అన్ని జంతువుల మాంసాన్ని అందరూ తినరు. చీనాలో నున్న మాంసాహారం పట్ల పూర్తి ద్వేషంతో మన దేశం వారుంటారు. ఇక కొందరు కోడిగ్రుడ్లను తింటాము గాని మాంసాహారాన్ని తినమని అంటారు. కాని శాకాహార విషయంలో ఇట్టి ద్వేషభావాలుండవు.

అసలు గుఱ్ఱపు మాంసాన్నే తినరు. యుద్ధ సమయంలో ఆహారపు కొరత ఏర్పడి దానినీ తినడం మొదలుపెట్టారు జర్మనీవారు. దానిని విని మిగతా దేశస్థులు వీరిని అసహ్యించుకున్నారు.

అట్లాగే శాకాహారులు కూడా మాంసాహారులను ద్వేషించవచ్చు కదా. మాంసాహారులు బ్రాహ్మణులను పప్పు బాపనయ్యలని వేళాకోళం చేస్తారు. కండలు పట్టియున్నట్లు కనబడకపోయినా సత్తువలేని వారుగా బ్రాహ్మణులుండరు. కాని పాశ్చాత్యులు శాకాహారులని చూసి జాలి పడుతూ మా దేశంలో కావలసినంత మాంసాహారం ఉందని అంటారు. మరొక దురభిప్రాయం కూడా ఉంది. చాలామంది శాకాహారులు భారతదేశంలో ఉండడం వల్లనే విదేశీయులకు లొంగి పోయారని. మాంసాహారులతో మనం ఇట్లా అనవచ్చు. "కొన్ని మాంసాలను తినేవారినే మీరు అసహ్యించు

కుంటున్నారు. మీరందరూ కలిసి ఆడవులలో నరమాంస భక్షకుల్ని ద్వేషిస్తున్నారు కదా! వారికంటె అధికులమని మీరు భావించినపుడు మీకంటే మేము అధికులమని అనకూడదా? అందరు భారతీయులూ మాంసాహారానికి అలవడితే ఆహారపు కొరత ఉండదని అంటున్నారు. కాని అటువంటిది మీ దేశంలో ఏర్పడలేదా" అని మనం వారిని అడుగవచ్చు.

పళ్ళు కుళ్ళిపోతేనే చెడువాసన వస్తుంది. కాని మాంసాహారాన్ని వండినపుడే వస్తోంది కదా. ఇక అది కుళ్ళిన మాంసమైతే ఇంకా చెడువాసన వస్తుంది. మరొకటి, క్యాబేజీ, బీట్‌రూట్ వంటి ఇంగ్లీషు కూరలను వండినా చెడువాసన వస్తుంది కనుక శిష్టులు వాటిని వాడరు. ఆబ్దికాలలో అసలు పెట్టరు.

## శాకాహార విశిష్టత

మాంసాహారపు వాసన ముక్కుకే గిట్టదు. ఇది జీర్ణశక్తికి అనువు కాదని, 1957లో చెన్నైలో జరిగిన ప్రపంచ శాకాహారుల సమ్మేళనం తీర్మానించింది. మనకున్న బుద్ధి వాటికి లేకపోయినా శాకాహారం తినే జంతువులు మాంసాహారాన్ని వాసన కూడా చూడవు. మేక, లేడి, ఏనుగు ఎన్నడైనా వాటిని తింటాయా? ఇక వివేచన కలిగిన మానవుడేది తినాలో ఏది తినకూడదో విచారించవద్దా? ఇక కుక్క, పిల్లి, కాకి మొదలైనవి రెంటినీ తింటాయి. మనలో రెండు ఆహారాలను తినేవారున్నట్లుగా మనం కూడా కుక్క మొదలైన వాటి స్థాయికి దిగజారుదామా?

అయితే మన జీర్ణావయవాలు మాంసాహారాన్ని జీర్ణం చేసుకోవడానికి అస్సలు పనికిరావా అంటే అదీ కాదు. అట్లా అయితే మాంసాహారులే ఉండేవారు కాదు. బ్రాహ్మణేతరులకు నిషేధం లేదు. అయితే ఏది సత్త్వగుణాన్ని వృద్ధి చేస్తుందో ఏది కాదో అనే వివేచన కలిగి యుండాలి.

ఇది బలాన్నిస్తుంది. బలం గూర్చి చెప్పేటపుడు సింహబలం, వ్యాఘ్రబలం అనకుండా ఏనుగుబలం అంటున్నాం. ఏనుగు మాంసం తింటోందా? అందుకే భర్తృహరి శుష్కైఃతృణైః వనగజా బలినో భవంతి అన్నాడు. అంటే ఏనుగులు ఎండిపోయిన గడ్డి తిని బలంగా ఉన్నాయని అన్నాడు. శుష్కించినది యనగా ఎండిపోయినది. ఒకణ్ణి శుష్క హృదయుడని అంటాం. ఏనుగెంత బలంగా ఉన్నా శాంతియుతంగా ఉంటుంది. పెద్దపులి మాదిరిగా కోపంతో ఉండదు. కేరళ, బర్మాలలో ఏనుగులు పెద్ద పెద్ద దూలాలను మోస్తాయి. అందువలనే శాకాహారం వల్ల బలం, బుద్ధి, ఇతరులకు సాయం చేయాలనే ప్రవృత్తి మనలో ఏర్పడతాయి.

సర్పాః పిబంతి పవనం నచ దుర్బలాస్తే
శుష్కైః తృణైః వనగజాః బలినో భవంతి
కందైః ఫలైః మునివరాః క్షపయంతి కాలం
సంతోష ఏవ పురుషస్యపరం నిధానం

తా: పాముకి గాలే ఆహారం. అయినా బలహీనంగా ఉండదు. అడవిలో ఏనుగు ఎండుగడ్డి తింటోంది. అయినా బలంగానే ఉంది. ఋషులు కందమూల ఫలాలను తింటున్నారు. వాళ్ళు చిరంజీవులు గానే ఉన్నారు. కనుక మానవుని ఆరోగ్యం తృప్తితో ఉండడం వల్లనే. తినే ఆహారం వల్ల కాదు.

నేను చిన్నపుడు కోడి రామమూర్తిగారిని చూసా. ఆయన తెలుగువాడు, సర్కస్ కంపెనీని నడుపుతూ ఉండేవాడు. పెద్దకారును త్రాళ్ళతో లాగేవాడు. చేతితో కార్లను గెంటేవాడు. నేను కుంభకోణంలో ఉండగా వచ్చి తన ప్రదర్శన చూడండని అన్నాడు. ఇది మా మఠ సంప్రదాయం కాదన్నాను. మా మఠం దగ్గరే ప్రదర్శన ఏర్పాటు చేసి చూపించాడు. ఆశ్చర్యపోయాను. ఇతడు శాకాహారి యని తెలిసుకొన్నాను. కపియైన ఆంజనేయుడు శాకాహారి కదా!

కొన్ని వ్యాధులకు మాంసాహారాన్ని తినవచ్చని వైద్యులనినా జీర్ణకోశ వ్యాధులకు, మధుమేహం వంటి రోగాలున్నవారికి పనికి రాదని అంటున్నారు. ఎందుకంటే అట్టివారికి మందులిచ్చినా పనిచేయవు.

ఇక సింహం, పెద్దపులి శాకాహారాన్ని తినే జంతువుల్ని తింటాయి గాని మాంసాహారం తినే జంతువులను తినవు. కనుక మాంసం తినేవి కూడా మాంసం తినని జంతువులనే చంపి బలాన్ని పుంజుకొంటున్నాయని తెలిసింది కదా!

ఇట్లా శాకాహారాన్ని అనేకవిధాల సమర్థించవచ్చు. అయినా రుచికోసం, శారీరక బలం కోసం, మాంసాహారాన్ని తినడం అనాదిగా ఉంది. ఇంకొక కారణం చెబుతున్నారు. పూర్వకాలంలో సంచార జాతులుండేవి. ఆరునెలలు ఒకచోట ఉంటేనే కాని వేసిన పంట చేతికి రాదు. కనుక విల్లంబులు ధరించి జంతువులను వేటాడి తినేవారు. కాలక్రమంలో వ్యవసాయం అభివృద్ధి చేసినా పూర్వపు అలవాట్లను మార్చుకోలేక మాంసాన్ని తినేవారని అంటారు. ఈ సిద్ధాంతం సరియైనదో కాదో చెప్పలేను. ఉన్న పరిస్థితులను అర్థం చేసుకొని కొందరికిది పనికి వస్తుందని, కొందరికది కూడదని శాస్త్ర నియమాలేర్పడ్డాయి. అంటే తినేవారు, శాశ్వతంగా తినందని చెప్పడం శాస్త్రకారులు అభిప్రాయం కాదు. కాలక్రమంలో మానవచ్చని వారి అభిప్రాయం.

## ప్రాచీనాచారాలు - కలిలో అభ్యాసాలు

పూర్వకాలంలో బ్రాహ్మణులూ, మాంసాహారులే అని కొన్ని ప్రమాణాలు, చూపుతున్నారు, అయితే మాంసాన్ని సూచించే పదాలు కొన్ని ధాన్యపు గింజల పేర్లని; మాంసానికి వాటికీ సంబంధం లేదని కల్యాణ కల్పతరు పత్రికవారు ఖండిస్తున్నారు. అశ్వమేధయాగంలో అశ్వాపశుపాలను అర్పించే పదాలు కొన్ని ఓషధుల పేర్లని వాదిస్తున్నారు.

పోనీ అందరూ మాంసాహారులనే అంగీకరిద్దాం. ఆ శాస్త్రాలలోనే మిగతా యుగాలలోని ఆచారాలు కలిలో పనికిరావని ఉంది కదా! అందువల్ల బ్రాహ్మణులు, సన్యాసులు మాంసాన్ని తినకూడదని నిషేధించారని ఎందుకు అనుకోకూడదు? శాస్త్ర నియమాలను, కలియుగ నిషేధాలను పాటించాలి కదా!

శంకరులు, తమ భాష్యంలో పూర్వులకూ నేటివారికీ బలంలో తేడా ఉందని వ్రాసారు. బృహదారణ్యక ఉపనిషత్ వ్యాఖ్యానంలో "అహం బ్రహ్మాస్మి" అనే అనుభవాన్ని దేవతలు పొందారని, వామదేవుడు వంటి ఋషులు "నేనే మనువును, నేనే అతని సంతానాన్ని" అనడం వంటివి వున్నాయని వ్రాసారు. "వారే కాదు, ఈనాడు కూడా అట్టి అనుభూతిని పొందిన మహాత్ము లున్నారు. అట్టివారు నేడు కూడా దేవతలకేమీ తక్కువకాదు" అని శంకరులు వ్రాయగా వారి కాలంలోనూ ముందు తరాలలోనూ అట్టి వారుంటారని అర్థం. అంటే శారీరకంగా నేటి యుగంలో ఉన్నవారు బలహీనులుగా ఉండవచ్చు గాని మానసికంగా కాదని అర్థం. అంటే మహావీర్య వంతుడైన (మహావీర్యవాన్) వామదేవుడూ శారీరకంగా బలహీనులైన నేటివారూ అట్టి అనుభూతిని పొందవచ్చని అర్థం. పూర్వకాలంలో నున్న వామదేవుని వంటి వారిని మహావీర్యులని చెబుతూ అల్పవీర్యులైన నేటివారూ అర్హులే అన్నారు. ఇక మరొకటి. బలవంతుడు విందుభోజనాన్ని బాగా తినగలడు గాని బలహీనుడు తిని జీర్ణం చేసుకోగలడా? అట్లాగే పూర్వయుగానికి చెందిన ఋషులు మాంసాన్ని తిన్నా వారిలో అది రజోగుణాన్ని, తమోగుణాన్ని కల్గించలేదు. అట్టి శక్తి లేదు కనుక ఈనాటివారు మాంసాన్ని తినకూడదని భావించండి. పూర్వ యుగాలలో వేయి, లేక పదివేల సంవత్సరాలు జీవించేవారు. ఇతర లోకాలకు వెళ్ళగలిగిన శక్తి ఉండేది. మానసిక శక్తితో ఎన్నో ఘనకార్యాలు చేసినట్లు పురాణాలంటున్నాయి. అట్టి శక్తి మనకూ ఉంటే మనమూ తినే జీర్ణం చేసుకోగలం.

ఒక ఉదాహరణ. ఒక అడవి సమీపంలో నది, ఒక చెఱువూ ఉన్నాయి. అడవి అంటుకొని అన్నీ బూడిదయైపోయి గాలివల్ల అది నదిలోనూ చెఱువులోనూ కలిసిపోయింది. మట్టి, చెత్తా చెదారం వల్ల కొంతకాలానికి, చెఱువు పూడిపోయింది. కాని నదిలో పడిన చెత్తాచెదారం ప్రవాహం వల్ల సముద్రంలో కలిసాయి. చెఱువు పూడిపోవలసి వచ్చింది. కాని నదిలోని చెత్త ప్రవాహంలో కలిసిపోయింది. అల్లాగే కొన్ని దోషాలు తమ తపశ్శక్తి ద్వారా దగ్ధం చేసికొన్నారు పూర్వులు. బలహీనులమైన మనం వాటిని ఆచరిస్తే ఎలా? మనం శాస్త్ర నియమాలను కట్టుబడాలి కదా. కనుక అహింసవైపే అందరమూ మళ్ళడం మంచిది.

## క్రమక్రమంగా అభ్యుదయం

మాంసాహారం పూర్వులు తిన్నారు కదా అని నేటి బ్రాహ్మణులు తినకూడదు. ఇక బ్రాహ్మణేతరులు తమ కులాచారాన్ని వెంటనే మాననవసరం లేదు కూడా. క్రమక్రమంగా వారూ మానుకోవడం మంచిది. అయితే నిర్బంధం మాత్రం పనికిరాదు. వెంటనే మానివేస్తే కొన్ని చిక్కులున్నాయి కూడా. మాంసం తినేవారు వారు కూడా వ్రతాలలో ఉపవాసాదులలో, పర్వదినాలలో, జన్మదినం నాడూ మాంసాహారం మానివేయాలి. అంతిమ లక్ష్యం మాత్రం అహింసయే. ఆచరణ క్రమక్రమంగా చేయాలి.

## నేడు శాకాహార ఆవశ్యకత

పూర్వకాలంలో శాస్త్రాలపట్ల భక్తి విశ్వాసాలుండేవి. తప్పు చేస్తున్నామనే భీతి ఉండేది. ఇంద్రియ నిగ్రహాన్ని పాటిస్తూ ఉండేవారు. ఆనాడు ప్రజలను రెచ్చగొట్టే చలనచిత్రాలు, నవలలు, నాటకాలు, ఈనాడున్నంత లేవు. ఇంద్రియాల తృప్తికోసం ఈనాడేదైనా చేస్తున్నాం. కాయకష్టం చేసేవారు,

మద్యమాంసాలను మితంగా సేవించేవారు. ఈనాటి వాతావరణం పూర్తిగా భిన్నంగా ఉంది.

కార్యాలయాల్లో నివసించే ప్రదేశాలల్లో అందరూ కలిసి మెలిసి ఇప్పుడు తిరగవలసి ఉంది. నిన్న మొన్నటివరకు బ్రాహ్మణాచారాలనే మిగిలినవారు పాటిస్తూ ఉండేవారు. చిత్రమేమంటే ఈనాటి బ్రాహ్మణులు బ్రాహ్మణేతరుల అలవాట్లను ఆచరిస్తున్నారు. వీళ్ళు మద్యమాంసాలకు అలవాటు పడుతున్నారు. ఈ విచ్చలవిడి తనం దేనికి దారి తీస్తుందో? మన దేశపు పరువు ఏంకాను? ఈనాటికీ హిందువంటే శాకాహారిగానే మిగతా దేశస్థులు పరిగణిస్తున్నారు.

హిందూ పదం మన శాస్త్రాలలో లేదు. సంస్కృత ధాతువుననుసరించి హింసకు దూరంగా ఉండేవాడని అర్థం. **హింసాయాం దూయతే యః సహిందు రిత్య భిధీయతే.** హింసను చూసి బాధపడే వాడనే అర్థం వస్తుంది కదా! ఈ నిర్వచనం చాలా చమత్కారంగా ఉన్నా ఇదీ మనకు గర్వకారణం కదా! దీనిని నిలబెట్టుకొందాం.

## మద్య నిషేధం

పడని ఆహారం వల్ల శరీరం పాడైపోతుంది గాని మద్యపానం వల్ల ఇల్లు, ఒళ్ళు గుల్లైపోతుంది. మనస్సుపై దీని ప్రభావం అంతా ఇంతా కాదు. కనుకనే తినేవాటికీ త్రాగేవాటికీ మనస్సుకూ గట్టి సంబంధం ఉంది. అందువల్లనే మద్యపాన నిషేధానికి మా మఠం పూర్తి మద్దతునిస్తోంది.

ఆలయాలను, వేదశాస్త్రాలను నమ్మేవారు నియమాలను ఉల్లంఘిస్తే ఎలా? త్రాగండని శాస్త్రాలు చెప్పాయా? తప్పని మా మఠం కరపత్రాలను పంచి పెట్టింది. మద్యపానాన్ని సాంఘిక, ఆర్థిక, కుటుంబ సమస్యగా గాంధీయులు భావిస్తే వాటికి మతాన్ని జోడించింది మా మఠం. మా విజ్ఞప్తిని

పాటిస్తున్నామని మాకు వ్రాసి పంపండని అన్నాం. అట్టివారికి ప్రసాదాలను మా మఠం పంపిస్తోంది. త్రాగుడు మానుతామని ప్రతిజ్ఞ చేయిస్తున్నాం.

## పొగ పీల్చడం - దుశ్చర్య

ఇట్టి అలవాటును మానండని వైద్యులూ అంటున్నారు. అనాచారమని ధర్మశాస్త్రాలూ అన్నాయి. పొగత్రాగే వారికే కాకుండా దానిని ప్రక్కనున్న వారు పీల్చినా ప్రమాదమని అంటున్నారు కదా! నేను చెడిపోతే మీకేమిటని అనవచ్చు. కాని ఇతరులకు హాని చేసే అధికారం నీకేముంది? వీటి నిషేధంపై ఉధృతంగా ప్రచారం ఎందుకు జరగడం లేదు? అంటే మద్యపానాన్ని నిషేధించే వారు కూడా పొగత్రాగే అలవాటున్నవారు కనుకనే విస్తృత ప్రచారం జరగడం లేదనుకొంటాను. పొగ త్రాగడాన్ని విలాసంగా భావిస్తున్నారు. ఆహార నియమాలను పాటించినా పొగ త్రాగితే ప్రయోజనం లేదు. సాత్త్వికాహార నియమాలలో దీనినీ చేర్చాలి.

## కాఫీ మొదలైనవి

మానసికంగా పనిచేసే వారికి విసుగుదల, మొదలైనవి వస్తే వాటిని పోగొట్టుకోవడం కోసం మాదక ద్రవ్యాలకు అలవాటు పడుతూ ఉంటారు. బానిసలైపోతారు. ఏది వద్దంటామో అదే కావాలంటుంది మనస్సు. మద్యం, పొగాకు, గంజాయి మొదలైనవి అట్టివి.

అంత తీవ్రత కాఫీ, టీలకు లేకపోయినా వీటికీ అలవాటు పడితే ఇవీ మనల్ని ఆవహిస్తాయి. ఇవి మత్తునీయకపోయినా, ఉత్తేజకరమైనవాటిగా పరిగణిస్తాం. కాలక్రమంలో నరాల దౌర్బల్యం ప్రాప్తిస్తుంది. కాఫీలో నున్న కెఫైన్‌ని విషమంటున్నారు కదా!

టీ కొంత నయం. అట్లా అంటున్నానంటే స్వామివారు తీసుకోవడానికి అనుమతినిచ్చారని భావించకండి. దీనినీ క్రమక్రమంగా మానండి.

వీటిని పాలతో కలిపి త్రాగుతున్నాం. శుద్ధమైన పాలే పోషకం. పగలు మజ్జిగ త్రాగవచ్చు. గంజితో కలిపి త్రాగవచ్చు. ఇది చాలా పుష్టికరం.

ఎంత బీదకుటుంబమైనా కాఫీ, టీలకు అలవాటు పడి మూడు నాలుగు సార్లు త్రాగుతూ ఉంటే ఎలా?

దండ కమండలువులు లేని ఆధునిక సన్న్యాసులు కూడా కాఫీ, టీలు త్రాగకుండా ఉండలేకపోతున్నారు. లేచీ లేవగానే కాఫీ తయారు చేసుకోవడం ఒక స్వయంపాక నియమమై పోయింది. ఇట్టి పద్ధతి బాగాలేదు.

ఇక బిస్కత్తులు మొదలైవాటిని చాలా అందమైన అట్టలు వేసి అమ్ముతున్నారు. కొన్నిటిలో ఏముందోగాని కేక్‌లు వంటివాటిల్లో ఏదో ఉంది. (ఆ ఏదో అంటే కోడిగ్రుడ్ల సొన-అనువక్త). దీనిని మాంసాహారం కాదని దబాయిస్తు న్నారు. వారి వాదన ప్రకారం అందు ప్రాణం ఉండదన్నా అదీ హాని చేస్తుంది. తిరుమల నాయకుని దగ్గర ముఖ్యమంత్రిగా పనిచేసిన నీలకంఠ దీక్షితులు మంత్రి పదవిని విడిచిపెట్టి, కప్ప కూత వినబడని ప్రాంతంలో కొంత నేలనిస్తే తాను బ్రతుకుతానని అన్నాడు. అంటే అహింసా నియమాన్ని ఎంతగా పాటించాడో గమనించారా? ఏదో అనారోగ్యంతో బాధపడేవారు వీటిని తీసుకొన్నా ఆరోగ్యం కుదుటబడిన తరువాత పంచగవ్యప్రాశన చేసి ప్రాయశ్చిత్తం చేసుకోవడం ఉత్తమం. గంజి త్రాగడమే అనాదిగా నున్న ఆచారం.

## పాలతో చేసినవి

ఇక కొందరి ఆక్షేపణ - రక్తం మాదిరిగానే పాలూ రావడం లేదా? కనుక పాలకు సంబంధించినవన్నీ మాంసాహారంగానే పరిగణించాలని

తీవ్రవాదం చేసే వారుంటారు. ఇవన్నీ సాత్వికాహారాలనీ వాటిని గ్రహించవచ్చనీ శాస్త్రాలంటున్నాయి. వేటిని విడిచిపెట్టాలి? ఏదైనా మన మనస్సుకి హాని కలిగించినా, జంతువుల్ని బాధించినా, వాటిని విడిచిపెట్టాలి. పాలు పితకడం వల్ల ఆవుని బాధపెట్టడం లేదు. తన దూడ త్రాగిన మిగిలిన పాలుండేది ఆవుకని, అట్టిది మనకుద్దేశింపబడిందని, సృష్టిలో ఈ నియమం విశిష్టమైనదని లోగడ చెప్పాను. అన్ని పాలను దూడ త్రాగివేస్తే దానికి హాని కూడా. అశ్వమాత, గజమాత అని పిలవడం లేదు. గోమాత అని అంటున్నాం. తల్లిపాలు త్రాగితే మాంసాహారమౌతుందా? దూడ త్రాగగా పాలు పిండితే అది క్రూరకృత్యం కాదు. ఇక రెండవది మన మనస్సునకు ఏమీ చేటు రావడవం లేదు. మూడు రకాలైన ఆహారాన్ని చెప్పిన కృష్ణుడు నవనీతచోరుడే కదా! క్షీరాభిషేకం తప్పైతే శాస్త్రాలిట్లా విధిస్తాయా?

కావలసిన వాళ్ళకు ఈ పాలు చేరడం లేదు. బీదపిల్లలకు, బలహీనులకు, రోగగ్రస్తులకు చేరవలసిన పాలు, కాఫీ టీలకై వాడుతున్నాం. చెందవలసిన వారికి చెందకపోవడమే అనే పాపం ఇట్లా త్రాగేవారికి చెందుతోంది.

## తాంబూల చర్వణం

ఇక కొందరు తాంబూలానికి దాసులైపోతున్నారు. ఇది నాలుక రుచిని పోగొడుతుంది. జీర్ణాశయానికీ మంచిది కాదు. వేసుకోవడం పెద్ద మనిషి తరహాకు చెందదు. ఆచారమూ కాదు. *(గృహస్థులు మితంగా స్వీకరించవచ్చని ఆయుర్వేద గ్రంథాలంటున్నాయి)* తాంబూలం నములుతూ, తుంపర్లు ఇతరులమీద పడుతూ ఉండడం, ఇష్టం వచ్చినచోట ఉమ్మివేయడం బాగుందా?

సుమంగళీ స్త్రీలు తాంబూలం నమలడం తప్పుకాదు. తాంబూలం ఈయడం తప్పు కాదు. ఆచారం కూడా. ఇది సౌభాగ్యానికి చిహ్నం. తగు

విధంగా సేవిస్తే జీర్ణాశయానికి మంచిది. రక్తాన్ని శుద్ధి చేస్తుంది. అయినా దానిని సాత్వికాహారంగా మాత్రం పరిగణించరు. అందుకే బ్రహ్మచారులకు, సన్న్యాసులకు, విధవలకు నిషిద్ధం. రజోగుణాన్ని ప్రేరేపిస్తుంది కనుక గృహస్థులకు ఉద్దేశింపబడింది. అనుమతినిచ్చారు కదా యని అదేపనిగా సేవించకూడదు. ఏ అలవాటుకైనా దాసులం కాకూడదు.

మధుర పదార్థాలు, నేయి సాత్వికమైనవియైనా మితిమీరితే వెగటు పుట్టిస్తాయి. అందువల్ల మితంగానే తీసుకొంటాం.

## శాంతికి భంగం తీసుకొని రాకూడదు

సత్త్వగుణం వృద్ధియైన కొలదీ ప్రపంచంలో క్రౌర్యం తగ్గుతుంది. హత్యలు చేసినవాళ్ళను చూడండి. ఏ ఒక్కడో అందు శాకాహారియై యుంటాడు. మిగతావారందరూ మాంసాహారులే.

ఆహారాన్ని బట్టి మనస్సుంటుంది. కనుక ఆహార నియమాలను పూర్వులేర్పాటు చేసారు. ఎందరో మహాత్ముల ఆశ్రమాలలో పరస్పర వైరభావం కనబడదు. ప్రేమభావం తొణికిసలాడుతుంది. కారణం అహింసా నియమమే. ఒక ఆడసింహం ఏనుగు పిల్లకు పాలనీయడం, పిల్లి ఎలుకను ప్రేమతో చూడడం, నెమలి పామును రక్షించడం వంటి వర్ణనలు ఆశ్రమాల గురించి ఉంటాయి. *(రమణాశ్రమం చూసినవారట్లా అనడం లేదా)* దీనికంతటికీ శాకాహార ప్రభావమే! శాకాహారంలో కూడా వెల్లుల్లి, నీరుల్లి, మునగ, ముల్లంగి పనికిరావు. ఇవి తామసిక ఆహారానికి చెందినవి.

## ఆహార పరిమాణం

సాత్త్వికాహారం తిన్నా ఒక మితం ఉండాలి. ఒకపూట భోజనం, మరొక పూట ఫలాహారం అత్యుత్తమం. రెండు పూటలా భుజించి మధ్యలో

అల్పాహారం తీసుకొన్నా మితంగానే ఉండాలి. ధర్మశాస్త్రాలు, ఆయుర్వేదం కడుపు పట్టేంత క్రుక్కకూడదని అన్నాయి. అన్నానికి సగం, నాల్గవంతు మంచినీళ్ళకు, మిగలిన నాల్గవవంతు ఖాళీగా ఉండాలని అన్నాయి. కులాచారం ప్రకారం అమావాస్య వంటి పర్వదినాలలో ఒక పూట భోజనం, మరొక పూట ఫలాహారంతో సరిపుచ్చాలి. ఆదివారాలలో సూర్యాస్తమయం తరువాత తినకూడదు. అనగా సంధ్యాకాలానికి ముందే ఫలాహారం. 15 రోజులకొకసారి ఉపవాసం. అనగా ఏకాదశినాడు దీనిని గురించి మరల వివరిస్తా.

ఆకలియే ఒక రోగం వంటిది. రోగాలకు మందులను తగు మోతాదులో వాడడం లేదా? అట్లాగే ఆకలియనే రోగానికి మితమైన ఆహారమనే మందు ఉండాలి కదా! దానినే క్షుద్ వ్యాధి శ్చ చికిత్స్యతాం అన్నారు శంకరులు. తమ సోపాన పంచకంలో. అనగా రుచికోసం తినకు; స్వాద్వన్నం న తు యాచ్యతాం; రుచికర ఆహారం కోసం తపించిపోవద్దు; విధివశాత్ ప్రాప్తేన సంతుష్యతాం; ప్రాప్తమైన దానితో తృప్తి చెందు అని మార్గాన్ని చూపించారు. అట్లా ఉంటే రోగాలు రావు.

## కాలానుగుణంగా

ఋతువులను, కాలాన్ని బట్టి కొన్ని సాత్త్విక పదార్థాలను కొన్ని వేళలలో తినకూడదు. పెరుగు సాత్త్వికమైనా రాత్రి పనికిరాదు. మజ్జిగ పోసుకోవచ్చు. మధ్యాహ్నానంతరం పాలు త్రాగకూడదు. (రాత్రి త్రాగవచ్చు)

ఉలవలు, బెండ, గుమ్మడి మొదలైనవాటిని మిగతా రోజులలో తిన్నా, శ్రాద్ధంతో పనికిరాదు. (బెండను వాడడం కొన్ని ప్రాంతాలలో ఉంది). పొడుగుపాటి కాకరను వాడవచ్చుగాని పొట్టివి వాడకూడదని ఒక నియమం. ఇక చాతుర్మాస్యంలో ఏఏ కూరలు వాడాలో చెప్పే నియమాలూ ఉన్నాయి.

## చాతుర్మాస్యంలో

పంచాంగంలో సౌరమానమని, చాంద్రమానమని ఉంటాయి. సూర్యగతిని బట్టి సౌరమానం. ఇది తమిళనాడులో ఉంది. సూర్యుడు మేష, వృషభరాసులు మొదలైనవాటిలో ఉన్నపుడు చైత్రం, వైశాఖం మొదలైన మాసాలు వస్తాయి. సూర్యుడు మేషంలో ప్రవేశిస్తే, తమిళులకు క్రొత్త సంవత్సరం వస్తుంది. ఇక చాంద్రమాసం, చంద్రుని బట్టి యుంటుంది. ఇందు పాడ్యమి నుండి అమావాస్య వరకూ ఒక మాసం. ఫాల్గుణ అమవాస్య తరువాత వచ్చే పాడ్యమినుండి చైత్రం వస్తుంది. ఈ పాడ్యమిని ఆంధ్రులు, కర్ణాటకులు యుగాదిగా పాటిస్తారు. ఇక తమిళనాడు మాదిరిగా కేరళ ప్రాంతీయులు సంవత్సరాదిని జరుపుకుంటారు. క్రొత్త సంవత్సరాన్ని వీరు 'విషు' అంటారు. మొదటి నెలను చైత్రం అనడానికి బదులుగా మేడం అంటారు. వైశాఖిని ఎడవన్ అంటారు. కనుక రాశిని బట్టి వీరికి మాసనామం ఉంటుంది. పున్నమినాడు ఏ నక్షత్రం ఉంటే ఆ పేరుతో ఆ మాసాన్ని పిలుస్తారు. ఉదా: చిత్రా నక్షత్రంతో కూడియున్న దానిని చైత్రం. తమిళులు సౌరమానం పాటించినా చైత్ర, వైశాఖాలంటారు.

చాంద్రమానం ప్రకారం చైత్రమాసంలో అమావాస్య ముగిసిన తరువాత వైశాఖం మొదలౌతుంది. నక్షత్రాలు 27 కనుక చాంద్రమానంలో నెలకు 30 రోజులుండవు. అసలు సంవత్సరానికి 365/ 1/4 రోజులు. ఈ చాంద్రమానాన్ని సంవత్సరకాలంలో సర్దడానికి ప్రతి మూడు సంవత్సరాలకు అధిక మాసాన్ని చేరుస్తారు. ఈ అధిక మాసంలో ఏ శుభకార్యాలూ చేయరు.

చాతుర్మాస్యాన్ని గురించి చెప్పవలసి వచ్చినపుడు ఈ మాసాల గురించి చెప్పాను., తమిళుల 'అణి' పూర్తికాగా చంద్రమానంలోని ఆషాఢం

మొదలౌతుంది. ఆషాఢ శుక్ల ఏకాదశినాడు భగవానుడైన క్షీరాబ్ధినాథుడు శయనిస్తాడు. అట్లా శ్రావణం, భాద్రపదం, అశ్వయుజం, కార్తిక శుక్ల దశమి వరకూ నిద్రిస్తాడు. ఏకాదశినాడు మేల్కొంటాడు. దీనిని చాతుర్మాస్యం అంటారు. (ఆషాఢ పూర్ణిమను వ్యాసపూర్ణిమ లేదా గురుపూర్ణిమ అని అంటారు. వ్యాస పూర్ణిమ నాడే చాతుర్మాస్యం మొదలౌతుందని సాధారణంగా భావిస్తారు. సరిగ్గా చెప్పాలంటే పూర్ణిమ ముందున్న ద్వాదశినుండే మొదలవుతుంది.)

ఈ చాతుర్మాస్యంలో గోకులాష్టమి, వినాయక చవితి, నవరాత్రి, దీపావళి, మహాషష్ఠి, మొదలైన పండుగలుంటాయి. అయినా వివాహాలు, ఉపనయనాలు, కుంభాభిషేకాలూ జరిపినా అవి ఫలవంతం కావు. పండుగలను జరుపుకొన్నా దేవాలయ కార్యక్రమాలకు పనికిరావు. ఈ నాలుగు నెలలందరూ చాతుర్మాస్యాన్ని పాటించాలి. ఈ వ్రతంలో ఆహార నియమాలు హెచ్చు.

మిగతా మాసాలలో కొన్నింటికి పట్టింపు లేకపోయినా ఇక్కడ నియమాలున్నాయి. శ్రావణ మాసంలో కాయకూరలు నిషిద్ధం. సాంబారులో కూడా కూరలు వాడకూడదు. భాద్రపద మాసంలో పెరుగు, మజ్జిగ పనికిరావు. ఆశ్వయుజంలో పాలు పనికిరావు. కార్తికంలో నేయి, ఉలవలు వంటివి పనికిరావు.

మనలో మాధ్వులీ నియమాలను చాలా వరకూ పాటిస్తారు. ఈ చాతుర్మాస్యంలో శ్రాద్ధం వస్తే ఆ మాసంలో కూడని వాటిని ఆబ్దికాలలో వాడరు కూడా. మిగతావాళ్ళకు పట్టింపులేదు. సన్న్యాసులమైన మేము వీటిని తప్పక పాటిస్తాం. అయితే ఈ రోజులలో శాస్త్రీయ సన్న్యాసం తక్కువమందిలో ఉంది.

## ఉప్పు లేకుండా

ఉప్పు చేర్చకపోతే అది అలవణం. ఉప్పు లేనిది రుచికరంగా ఉండకపోయినా కొన్ని రోజులలో అలవణంగానే ఉండాలి. ఉప్పు ఉద్రేకాన్ని కల్గిస్తుంది. ఎవరైనా తప్పుచేస్తే సిగ్గుపడవద్దా? ఉప్పు తినడం లేదా అని మందలిస్తాం. ఆధ్యాత్మికమార్గంలో పయనించేవారికి సిగ్గుపడుట, గర్వం మొదలైనవి ఉండకూడదు. వైద్యులొకందుకు ఉప్పును వాడవద్దంటే శాస్త్రాలు మరొకందుకు వద్దన్నాయి. వరుణ జపం చేసేటపుడు ఉప్పు వాడితే వారి జపం ఫలించదు. వారప్పుడు ఉప్పు తినడం మానివేస్తే వర్షం పడుతుంది. సుబ్రహ్మణ్యునకు సంబంధించిన మంగళ వారాలు, షష్ఠినాడు అలవణంగానే భుజించాలి.

## అన్నరసంలోని దివ్యరసం

లోగడ స్వయంపాకం గురించి చెప్పాను. అంటే ఎవరికి వారే వంట చేసుకోవడం. వంట చేస్తూ నామాన్ని, స్తోత్రాలను, జపాన్ని చేయడం వల్ల ఈ దివ్యరసం, అన్నరసంలో ప్రవేశిస్తుంది.

భోజనం చేసేటపుడు గోవిందనామాన్ని మానసికంగా చేస్తూ ఉండాలి. ఎందుకంటే మౌనంగా భుజించాలని అన్నారు కనుక. మౌనేన భోక్తవ్యం. అపుడు పరమేశ్వరుడు జఠరాగ్ని రూపంలో ఉండి మనకు శారీరక బలాన్ని, మానసిక పవిత్రతలను ప్రసాదిస్తాడు. గీతలో:

అహంవైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం

అని ఉంది.

ఆహారం నాలుగు రకాలుగా ఉంటుంది. మెత్తనైన వండిన అన్నాన్ని తినడం ఖాద్యం. వేయించినవి తినడం శోష్యం. పంచామృతం వంటివి

నాకదగినవి కనుక లేహ్యం. త్రాగదగినవి పేయం. వీటన్నింటిని కడుపులోనున్న జఠరాగ్ని పచనం చేస్తుంది. పంచప్రాణాల సాయం వల్ల అన్నరసం, పై వైశ్వానర శక్తి వల్ల శరీరం అంతటా వ్యాపిస్తుంది. పీల్చేగాలి ప్రాణవాయువు. క్రిందకు విడిచి పెట్టేది అపానం. ఇదే శ్లోకంలోని ప్రాణాపానం.

ముందుగా ప్రాణాహుతులను తీసుకొనేటపుడు ప్రాణాయ స్వాహా అని ఉచ్చరిస్తారు. ముందుగా గాయత్రీ మంత్రంచే ప్రోక్షిస్తారు. నీటితో విస్తరి చుట్టూ త్రిప్పుతారు. యజ్ఞంలో హవిస్సు నర్పిస్తూ ఉన్నట్లుగా భోజన ప్రక్రియ కూడా యజ్ఞ భావనతో ఉంటుంది. లోనున్న జఠరాగ్నికి ప్రాణాహుతులను అర్పిస్తారు.

ఈశ్వరునకు నివేదిస్తారు. అన్నమే బ్రహ్మమని, వైశ్వానరుడు అతడే అని, ఆహుతి చేసినవాడు ఆయనే అని, తినేవాడూ ఆయనే యని, లక్ష్యమూ బ్రహ్మమనే గీతా శ్లోకం ఉంది కదా

బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ

బ్రహ్మణాహుతం, బ్రహ్మైవ తేన గంతవ్యం

తనంతట తాను వంట చేసుకొంటే ఎక్కువ పదార్థాలను చేసుకోడు. కనుక ఎక్కువగా తిననవసరం ఉండదు. నామం చేస్తూ ఈశ్వరునికే నివేదిస్తాడు కనుక తామసిక, రాజసిక ఆహారాలను వండడు. శాకాహారం వండడం అలవాటైపోతుంది. దానివల్ల పుణ్యమూ వస్తుంది, ఖర్చు కూడా తగ్గుతుంది.

ఇతరులు వండినపుడు మనం, రుచిపై దృష్టి పెడతాం. విమర్శిస్తూ ఉంటాం. ఈ పద్ధతి తినే వారికీ, వడ్డించేవారికీ ఇబ్బందే. స్వయంపాకంలో ఈ ఇబ్బంది లేదు కదా!

## మనతో భుజించువారు

మనతో తినేవారి మంచి చెడు లక్షణాలు సూక్ష్మంగా మనలో ప్రవేశిస్తాయి చాలా పవిత్రవంతులుండగా వారిని పంక్తి పావనులని అంటారు. అనగా పంక్తిలోని వారిని పవిత్రం చేస్తారని. అట్లాగే విరుద్ధంగా పంక్తి దూషకులూ ఉంటారు.

ఒక పంక్తిలో ఒకడు శాకాహారాన్ని, మరొకడు మాంసాహారాన్ని తింటూ ఉంటే ఆ శాకాహారి, మాంసాహారాన్ని కోరడం సహజం. మనం ఉల్లివంటివి తింటూ ఉంటే ప్రక్కనున్న సన్యాసికి కూడా తినాలని బుద్ధి పుట్టదా? కనుక ఏక పంక్తి భోజనాలను ప్రోత్సహించే వారు, జాతి విచక్షణ పనికిరాదని అనేవారూ దీనిని ఆలోచించండి.

సహపంక్తిలో ఇట్టి చిక్కులు వస్తాయి కనుక ఒకమూల మాంసాహారాన్ని మరొక మూల శాకాహారాన్ని వాడుతూ ఉండడం, సమత్వం అనే పేరుతో ఇద్దరూ కలిసి తినడం వంటివి వింటూ ఉంటే నవ్వు వస్తుంది. ఈ సందర్భంలో ఒకటి గుర్తుకు వస్తోంది. ప్రపంచ యుద్ధం చేయడానికి ముందు అన్ని దేశాల ప్రతినిధులు కూర్చున్నారు. విందు జరుపుకొన్నారు. మరునాడు కత్తులు దూసుకున్నారు. ప్రపంచ వినాశమే జరిగింది. నేడు పంక్తి భోజనం వల్ల ఐకమత్యం వస్తుందని చెబుతూ కొంత తృప్తిని పొందుతున్నారు. ఇక పరస్పర ద్వేషాలు, యుద్ధాలు తప్పడం లేదు. వీరిలో మానసిక ఐకమత్యం ఉందా? కలిసి టీపార్టీలు, విందు భోజనాలు అందరూ చేస్తూ ఉంటారు. నిజమైన ప్రేమ భావం ఉందా? ఇవి పెరిగినకొద్దీ ఆధ్యాత్మిక దారిద్ర్యం రావడం ఖాయం.

కనుక కలిసి తినడం వల్ల రాదు. కలిసి మెలిసి సేవ చేయడం వల్ల ఐకమత్యం వస్తుంది. ఈ సంఘసేవలో కూడా రాజకీయాలు ప్రవేశించడం

వల్ల సజావుగా సాగడం లేదు. ఆచారాలను సమత్వం పేరుతో మంట కలుపుతున్నారు.

తన వంట తానే వండుకోవడం మేలు. ఏకాంతంగా తినడం ఇంకా మంచిది.

మాంసాహారానికి అలవాటు పడిన దేశాలవారే శాకాహారాన్ని ప్రోత్సహిస్తూ ఉంటే అనాదిగా ఎక్కువమంది శాకాహారులు కలిగిన మన దేశం మాంసాహారానికి మొగ్గు చూపిస్తే ఎట్లా? ఇది గాంధీ సిద్ధాంతానికి తూట్లు పొడవడం కాదా? కలిసి తినడం వల్ల ఇంకా జంతుహింస ప్రబలడం లేదా?

## వేద విద్యనూ ప్రోత్సహిస్తుంది

స్వయంపాకం వల్ల వేదవిద్య కూడా వృద్ధి చెందుతుంది. దానికీ దీనికీ ఏమిటి సంబంధం అని ఆశ్చర్యపోతున్నారా? ఉత్తరదేశయాత్రలో ఒరిస్సా, బెంగాలు, ఉత్తరప్రదేశ్ వంటి ప్రాంతాలను చూసాను. అక్కడ వేదపాఠశాలలు లేవుగాని సంస్కృత పాఠశాలలున్నాయి. తమిళనాడులో 30, 40 పాఠశాలలున్నాయో లేవో? అక్కడ పాఠశాలల్లో వందలకొద్దీ విద్యార్థులున్నారు. వీటిని 'టోల్' అంటారు. అప్పటి గవర్నర్, శ్రీ విష్ణు రామ్ మేధీగారు రెండు వందల పాఠశాలలున్నాయని అన్నారు. మన ప్రాంతంలో ఆర్థికమైన వనరులున్నాయి. అక్కడ ఆ సదుపాయం కూడా లేదు. అయినా నడపబడుతున్నాయి.

ఎట్లా నడపగలుగుతున్నారని ప్రశ్నించాను. పిల్లలుండగా డబ్బుతో నిమిత్తం ఏమిటని వారన్నారు. కనీసం అన్నం పెడుతూ ఉంటే పిల్లలు వస్తారు కదాయని అన్నారు. అన్నానికి డబ్బెందుకని అంటూ ఇక్కడున్న వర్తకులు పిల్లలు సంస్కృతం నేర్చుకుంటున్నారని తెలుసుకుని తగినంత

నేతిని గోధుమపిండిని పంపిస్తూ ఉంటారని చెప్పారు. పిల్లలు తమ రొట్టెల్ని తామే తయారు చేసుకుంటారని అన్నారు. ఒక్కోసారి నేయి లేకపోతే పుల్కాలు తయారుచేసి కొంటారట. ఇక పెనం కూడా అక్కర్లేదట. గోధుమ ఉండల్ని నిప్పులో వేస్తే అవే కాలుతాయి. కాస్త పప్పు వండుతారు, దానితో నంజుకుని తింటారుట. వర్తకులీ పిండిని ఈయడానికి వెనుకాడరని నాతో అన్నారు.

ఇక్కడ మనం పాఠశాల ఏర్పాటు చేస్తే చాలా సరంజామా కావాలి. వండేవాడు, పదార్థాలు, జమాఖర్చులు, పర్యవేక్షకుడు, విద్యార్థులకు ఉపకారపు వేతనాలు, అధ్యాపకులకు డబ్బు - ఒకటేమిటి, చాలా హడావిడిగా ఉంటుంది.

వీటివల్ల మన పాఠశాలలు క్షీణించాయని తెలుసుకున్నాను.

బ్రహ్మచారి, చాలా పదార్థాలను తినవసరం లేదు. నీవే వండుకో అంటే సాత్త్విక పదార్థాలను మితంగా వండుకుంటాడు, చదువుమీద దృష్టిని పెడతాడు. అనుష్ఠానానికి ఇబ్బంది ఉండదు. కావలసినంత మూలధనం అక్కరలేదు. ఉత్తరదేశస్థుల పద్ధతిని అనుసరించడం మంచిది.

## భిక్ష - స్వయం పాకం

పిల్లలు స్వయంపాకం చేసుకోవాలని అనడం, భిక్షాచర్యకు విరుద్ధం కాదా అని ప్రశ్నిస్తారు. ప్రస్తుత పరిస్థితులు భిక్షాచర్యకు అనుకూలంగా లేవు. దీనిని నిర్బంధించను. ఎక్కడో వీలుపడుతుంది. అందరికీ కుదరదు.

ఒక గృహస్థ బ్రాహ్మణుడు ఇతరులకు పాఠం చెబుతూ దక్షిణగా డబ్బు లేదా పచ్చికూరగాయలను, బియ్యాన్ని గాని తీసుకుంటాడు గాని వండినదానిని కాదు. కాని సన్న్యాసులకు, బ్రహ్మచారులకు వండిన అన్నమే భిక్ష.

**యతిశ్చ బ్రహ్మచారీచ పక్వాన్నస్వామినౌ ఉభౌ**

అంతమాత్రంచే సన్న్యాసి మాదిరిగా పక్వాన్నమే బ్రహ్మచారి కూడా

భిక్షారూపంలో స్వీకరించాలని లేదు. సన్యాసికి వంట పూర్తిగా నిషిద్ధం. ఆశ్రమ స్వీకారంతో అన్ని అగ్నికర్మలు అనగా ఔపాసనం, అగ్ని హోత్రం ఉండవు.

బ్రహ్మచారికి భిక్షా చర్య నెందుకు చెప్పారు? ఇతనిలో వినయం, వృద్ధి కావాలి. ఇంటింటికి వెళ్ళి మధుకర వృత్తితో అన్నాన్ని స్వీకరించాలి. ఇతనికి అగ్నితో సంబంధమైన సమిధాధానం ఉంటుంది. ఇట్టి అగ్నిసంపర్కం సన్యాసికి లేదు. కనుక ప్రధానంగా సన్యాసికే భిక్ష. అట్టి భిక్షే బ్రహ్మచారికి కొంతకాలం లభిస్తే మంచిదే. కాని కాలం అనుకూలంగా లేదు. కొంతకాలం స్వయంపాకం చేసుకోవడం మంచిదని నా అభిప్రాయం.

## ఉత్తరదేశంలో ఉత్కృష్ట ఆచారాలు

దక్షిణ ప్రాంతంలో ఆచారం ఎక్కువని ఉత్తర దేశంలో తక్కువనే అభిప్రాయం కలిగి యుంటాం. సరిగా చూస్తే వారిలో కొన్ని మంచి ఆచారాలున్నాయి. వారు మిర్చి, చింతపండు, ఇంగువలను ఎక్కువగా వాడరు.

మేము బెంగాల్ వెళ్ళినపుడు మా మత పరివారానికి చాలా ఏర్పాట్లు చేసారు. వంట సామాగ్రిని అందించారు. అయితే అందులో చింతపండు లేదు. వాళ్ళకేమో గోధుమపిండి, పప్పు ఉంటే సరిపోతుంది. మనమాదిరిగా రసం, సాంబార్లు, ఉండవు. కనుక వారికి చింతపండు అవసరం లేదు.

చింతపండు కావాలని అడుగగా మూడు నాలుగు మైళ్ళు చింతచెట్టు దగ్గరకే వెళ్ళి పండిన కాయలను తెచ్చారు. ఈ కాస్త, ఏం సరిపోతుందని మావాళ్ళన్నారు. మీరు అన్నం తింటారా? చింతపండు తింటారా? అని వాళ్ళు అడిగారు.

ఇక రాజస్థాన్, గుజరాత్, సౌరాష్ట్ర, కచ్, మధ్య ప్రదేశ్‌లలో బెంగాల్‌లో మాదిరిగా చేపలను తినరు. చాలామంది శాకాహారులే. డెహ్రాడూన్‌లో ఒక

బ్రాహ్మణుడు తెల్లదొరను బండిలో కూర్చోబెట్టుకుని తీసుకొని వెళ్ళినా మధ్యలో మంచినీళ్లను కూడా త్రాగడు. చివరకు స్నానం చేసి తన వంటను తానే వండుకుంటాడు.

ఉత్తర దేశంలో పరిచారికలు కూడా యజమాని యొక్క ఇంట్లో అన్నం తినరు. తప్పేమిటని మనం అనుకుంటాం. యజమాని ఎంతో ఉన్నతుడు కావచ్చు. అయినా వారింట్లో వీరు తినరు. స్వయంపాక నియమాన్ని వారు పాటించినట్లే కదా!

ఉత్తరదేశంలో బంధువుల ఇళ్ళల్లో కూడా ఒక్క వివాహం రోజునే కలిసి భుజిస్తారు.

ఇట్లా పవిత్రంగా ఉంటారు. సమత్వం పేరుతో ఎవరు, ఎక్కడ వండినా ఫరవాలేదనే భావనను వ్యాపింపచేస్తున్నారు. కాని వారి నియమాలను గుర్తించండి. సహపంక్తి భోజనాలను ప్రోత్సహిస్తూ మిగతా సందర్భాలలో జాతి వివక్షతను ఇక్కడ చూపిస్తున్నారు.

స్వయంపాక నియమాన్ని ఆచరిస్తే ఎక్కువజాతి, తక్కువ జాతి అనే ప్రశ్న ఉదయించదు కదా!

దక్షిణ ప్రాంతంలో పవిత్రంగా ఉన్నవారు పెట్టిన భోజనాన్ని స్వీకరించడం ఉంది. కాని ఉత్తర దేశంలో అదేమీ లేదు. పండితుడైనా, పామరుడైనా ఎవరి వంటను వారే వండుకొంటారు. స్వయంపాకంవల్ల ఎవరి పవిత్రత, ఎవరి అపవిత్రతలు వారికే దక్కుతాయి. ఇతరులవి వారికి సంక్రమించవు.

ఈ అలవాటు వల్ల సోమరితనమూ తగ్గుతుంది. ఎక్కువ పదార్థాలను వాడుకోవాలనే తపన తగ్గుతుంది. వండేవాని ప్రభావం, తినేవానిపై ఉంటుందా అంటే అది కంటికి కనబడేది కాదు.

## విద్యావిధానంలో వంటలు

ప్రాథమిక విద్యాదశనుండి వంట నేర్పాలంటున్నాను. ఇంతవరకు మతరహిత రాజ్యంతో మతానికి సబంధించిన సూత్రాలను చెప్పాలన్నాను. ఇప్పుడు వంట గురించి చెప్పండంటున్నాను. ఆహారాన్ని బట్టి మనస్సు ఉంటుంది కనుక మతబోధకంటె ఇది మనస్సును శుద్ధి చేస్తుంది కనుక నేర్పాలంటున్నాను.

ఉపనిషత్తులలోని బ్రహ్మజ్ఞానం పట్టుబడదు కనుక మన మతం వంటింటికి సంబంధించినదైంది.

నారదుడు సనత్కుమారునకు దగ్గరకు వెళ్ళి ఆత్మోపదేశం చేయమని అడిగితే అ ఉపదేశం ఆహార శుద్ధౌ సత్వశుద్ధిః తో అరంభమౌతుంది. శుద్ధమైన ఆహారాన్ని గ్రహించు, దానివల్ల త్రిగుణాలూ శుద్ధిని పొందుతాయని అన్నాడు. ఎప్పుడైతే చిత్తశుద్ధి ఏర్పడిందో క్రమక్రమంగా ఈశ్వరస్మరణం, మోక్షమూ ప్రాప్తిస్తాయి.

అందువల్ల నేనూ దీనితోనే మొదలు పెట్టండని అంటున్నాను. దీనిని రాజకీయవేత్తలూ సమర్థిస్తున్నారు. పిల్లలందరూ కలిసి భుజించాలని వారంటున్నారు. దీనివల్ల సల్లక్షణాలు వస్తాయని నమ్మకం లేదు. నేనేమంటానంటే ఎవరి వారే వంట చేసుకొని తినాలంటాను. ఇది పవిత్రతకు దారితీస్తుంది. వయోజన విద్యలోనూ దీనిని చేర్చాలి.

విద్యా ప్రణాళిక గురించి మాట్లాడుతూ ఎవరి పని వారు చేసుకొనేటట్లు చేయాలంటున్నారు కదా! ఈ పనిలో అట్టిది లేదా? సంఘ సంస్కరణ అంటున్నారు కదా! సంఘంలో వ్యక్తులుండరా? వ్యక్తులు బాగుపడితే సంఘం బాగుపడదా? కనుక స్వయం పాకమూ ఉండాలి.

వయస్సు మీరినవారికి వంట వచ్చి యుండాలని శాస్త్రాలు పరోక్షంగా సూచిస్తున్నాయి.

50 సంవత్సరాలు నిండిన తరువాత పెళ్ళి చేసుకోకూడదని: **పంచాశత్ వత్సరాత్ ఊర్ధ్వం న కుర్యాత్ పాణి పీడనం** మొదటి భార్య పోతే వండేవాళ్ళు లేరని వివాహం చేసుకుంటున్నారు. వంట వస్తే వానప్రస్థం స్వీకరించవలసిన దశలో మళ్ళీ పెళ్ళాడటం యొక్క అవసరం ఉంటుందా? కొందరు అవివాహితులుంటారు. తల్లి బ్రతికియున్నంత వరకూ వండి పెడుతుంది. పోతే హోటల్ కూడు పడకపోతే ఏం చేయాలి? వంట నేర్చుకుని యుంటే ఆ బాధ తప్పుతుంది కదా! ఒకవేళ కేవలం తిండికే వివాహం చేసుకోవాలి కదా!

ఈనాడు విదేశాలకు వెళ్ళినట్లుగా ఆనాడు లేదు కనుక గ్రామాలలోనే ఉండడం వల్ల వారికి స్వయంపాకం తప్పనిసరైంది. అనేక రోగాలకు కారణమయ్యే హోటల్ తిండ్ తినవసరం ఉండేది కాదు.

## వంటలో సంస్కరణలు

అనేక పదార్థాలు వండుకొని నానా హైరానా పడడానికి బదులు తేలికైన ఆహారాన్ని వండుకొని చూడండి. పూరీలు, పాలతో కడుపు నిండుతుంది. పూరీలు నిలవ వుంటాయి కూడా. ప్రయాణాలలో వీటినో, సత్తుపిండినో తీసుకొని వెడుతూ ఉంటారు. సత్తువనిస్తుంది కనుక ఇది సత్తుపిండి. దీనికి మజ్జిగ లేదా పాలను చేరుస్తారు. కొద్దిగా తిన్నా కడుపు నిండుతుంది.

కుక్కర్ పెట్టి నానారకాలు వండాలని ప్రయత్నించకండి. జిహ్వాచాపల్యానికి లోను కావద్దు.

గీతలో స్నిగ్ధం ఉంది కదా యవి నేతితో ముంచిన పదార్థాలనిఅర్థం తీసుకోకండి. కేవలం ఎండిన పదార్థాలను తినరాదు. పాలలోనో మజ్జిగలోనో ముంచినవి, లేదా నేతిని రాసిన పదార్థాలని అర్థం. మధురం అని అంటే కేవలం తీపి పదార్థాలనే కాదు, వరిలో, గోధుమలో సహజమైన మాధుర్యం

ఉంది. చింతపండు మిర్చి కలపడం వల్ల పదార్థాలకు సహజ మాధుర్యం పోతుంది. కనుక అవి లేకుండా తీసుకోవాలి.

## ఆతిథ్యమెట్లా?

ఎవరికి వారు వండుకొంటే ఆతిథ్యమెట్లా? అని సందేహం. అతిథులకు పదార్థాలనిచ్చి వండుకోండని చెప్పినా అతిథి సత్కారమే. స్వయంపాకం చేసుకొనేవారు, మరొక ఇంటికి వెళ్ళినపుడు పదార్థాలను తీసుకొని వండుకోవడం లేదా? ఇట్లా యాత్రికులకు ఇయ్యడాన్ని ఉత్తరదేశంలో సదావృత్తి అని అంటారు. అట్టివారు మా మఠంలోనూ భుజించరు. పదార్థాలను వారికిస్తాం. వారు వండుకొంటారు.

అతిథులకు పాలో, మజ్జిగో ఇయ్యవచ్చు. దొంగకు పాలు, అన్నం పెడితే మరల దొంగతనం చేయడని పూర్వం ఒక సామెత ఉండేది. పాలు మంచి గుణాలను కల్గిస్తుంది.

## నివేదనం

వండినదానిని భగవానునుకు నివేదిస్తే అన్నదోషం పోతుంది. ఆంధ్రదేశంలో పెద్దవిందు జరిగినా ముందు నివేదన చేసే ఆచారముంది.

దేవతామూర్తి కనబడకపోతే సూర్యునకే నివేదన చేయండి. ఆయన ప్రత్యక్ష దైవం కదా!

## స్వయం పాకం - లాభాలు

దీనివల్ల ముందు, మనస్సు పవిత్రమౌతుంది. రెండవది శారీరక ఆరోగ్యం. మూడవది ఖర్చు తక్కువ. నాల్గవది జాతివైరం లేకపోవుట. ఐదవది భార్య పోయినా ౬0 సంవత్సరాలు దాటిన తరువాత తిండికై మరల వివాహం

చేసుకోనవసరం ఉండదు. ఆరవది, మంత్ర జపాదులు చేస్తూ చేయవచ్చు. ఏడవది, జంతు హింసను నివారించవచ్చు. ఎనిమిదవది సాత్వికాహారం మహిమను ఇతరులకు చూపవచ్చు. ఇట్లా శాంతికి దోహదం చేస్తుంది. మన ఇంద్రియ నిగ్రహాన్ని పరమేశ్వరుడు మెచ్చుకొంటాడు. ఎవరికెన్ని పనులున్నా ఆదివారం నాడైనా చేసి చూడండి.

## ఆహారం - ఇంద్రియాలు

ఒక్క నాలుకకే ఆహారం కాదు. అన్ని ఇంద్రియాలకూ, తగిన ఆహారముంది. మంచి దృశ్యాలను చూడడం వల్ల కంటికి ఆహారమిచ్చినట్లే. పాటల వల్ల చెవులకు; ఇట్లా ఏది అనుభవించినా అదంతా ఆహారమే. అయితే ప్రతి భోగ్య వస్తువూ పవిత్రంగా ఉండాలి. ప్రతిదీ ఈశ్వర సాక్షాత్కానికి దోహదం చేయాలి.

అయితే అన్నింటిలో ఆహార విషయంలో నీరు ప్రధానమైనది. ఎక్కువగా తిన్నా అనర్థమే. తక్కువగా తింటే బండి నడవదు. మితంగా గ్రహించాలి. లేనిచో ధ్యానానికి ఆటంకం కల్గుతుంది. అన్నగత ప్రాణమనే మాట ఉంది కదా.

రోజూ నాకు ఆహారమిమ్ము "Give us this day our daily bread" అని బైబిల్ అంటూ కేవలం మనిషి తినడం వల్లనే బ్రతకడనీ అంది. "Man shall not live by bread alone" అనగా భక్తి, జ్ఞానములనే ఉత్తమ గుణాలవల్లే అతని నిజమైన మనుగడ ఉంటుందని చెప్పింది. ఆహార శుద్ధివల్ల మనశ్శుద్ధి కల్గుతుందని మన శాస్త్రాలంటున్నాయి.

బలం కోసమే అన్నమని కాక జ్ఞాన వైరాగ్యాలు కోసం ఇమ్మని శంకరులు అమ్మవారిని ప్రార్థించారు.

అన్నపూర్ణే! సదాపూర్ణే! శంకర ప్రాణవల్లభే
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం దేహి చ పార్వతి

## ఉపవాసం

ఏకాదశ్యాంతు కర్తవ్యం సర్వేషాం భోజన ద్వయం అనేమాట ఉంది. ఏకాదశి నాడు రెండు పూటలా భోజనమని చటుక్కున అనుకుంటాం.

రెండుసార్లు తినడమేమిటని ఆశ్చర్యపోలారు కదూ! కాని భో=హే! జన=జనుల్లారా ద్వయం=రెండు పనులను తప్పక చేయాలని అర్థం. ఈ రెండూ ఏమిటో తరువాత ఉంది:

శుద్ధోపవాస: ప్రథమః సత్కథా శ్రవణం తథా

అనగా ముందు ఉపవాసం, రెండవది మంచి కథలను వినడం అని

## ఉపవాసం ఆవశ్యకత

శుద్ధోపవాసం అంటే దగ్గరగా ఉండుట. అనగా భగవానుని దగ్గరగా. ఏమీ తినకపోతే అతనికి చేరువగా ఉండగలం. కడుపు ఖాళీగా ఉంటే ప్రాణాయామానికి వీలు. గాలిని బంధించిన కొలదీ మనస్సు చెల్లాచెదురు కాదు. అందువల్లనే ప్రతి ఏకాదశికి ఉపవాసం.

ఈ శరీరంపైనే ఎప్పుడూ ధ్యాస పెట్టియుంచుతాం గాని ఆత్మపై కాదు. ఉపవాసం ఉంటే శరీరాన్ని బాధపెట్టినట్టే. అంటే ఆనాడు శరీరానికి ఎక్కువ ప్రాధాన్యం ఈయడం లేదు.

అట్లా ఉపవాసానికి అలవాటు పడమని పిచ్చాపాటీ కబుర్లకంటె మౌనానికి ప్రాధాన్యం ఈయండని అన్ని పనులు ఈశ్వరునితో సంబంధం ఉండాలని అన్నారు.

యంత్రాలకు విశ్రాంతినిస్తున్నాం. మధ్యమధ్యలో వాటిని ఆపుతున్నాం. అట్లాగే పొట్టకూ విశ్రాంతి నీయాలి.

వారానికి మనకొక రోజు విశ్రాంతి. నిరంతరం వాడే పనిముట్టు పాడైపోతుంది. అట్లాగే మన శరీరమూ కూడా. లంఘనం పరమౌషధం అనే మాట ఉంది కదా. లంఘన పదానికి అసలర్థం దుముకుట అన్నది జీర్ణమైన తరువాతనే తినాలని అన్నాడు తిరువళ్లువర్. అప్పుడు రోగాల దరి చేరవన్నాడు.

ఆరోగ్యానికి ఆహారం ఎంత ముఖ్యమో అనారోగ్యంలో విసర్జించడమూ ముఖ్యమే. జ్వరం వచ్చినపుడు అన్నం తినండని ఏ వైద్యుడూ అనడు కదా! గంజి త్రాగండని మరొకటి చెబుతాడు.

అంతరాత్మ శుద్ధికోసం చాలాసార్లు గాంధీగారు ఉపవాసం చేసేవారని మీకు తెలుసు. అట్టి సందర్భాలలో మనస్సు నిర్మలంగా ఉండేదని అనేవారు.

అందరూ ఉపవాసం ఒక్కరోజైనా ఉంటే ఆహారపు కొరత కూడా ఉండదు.

శ్రద్ధ, విశ్వాసాలుంటే ఉపవాసం ఉండడం ఏమంత కష్టమైన పనికాదు.

**వ్రతోపవాస నియమైః క్లేశితః సుఖమశ్నుతే**

**ఇక్షుక్లేశాత్ యథానందం తథాప్రాప్నోతి తతః సుఖం**

తా: చెఱకు గడను పిండి రసాన్ని పొందుతున్నట్లు శరీరాన్ని కష్టపెట్టడం వల్లనే సుఖాన్ని పొందవచ్చు.

వ్యాపారస్థుడు కష్టపడి సంపాదిస్తున్నాడు. ఆనాటి ధ్యాన సుఖాన్ని మీరూ అనుభవించవచ్చు. ధ్యానామృతాన్ని త్రాగండి. నామ సంకీర్తనాదులచే శ్రవణేంద్రియానికి అమృతాన్ని అందించండి. కనుక ఏకాదశినాడు శుద్ధోపవాసాన్ని పాటించండి.

## ఉపవాసం - ఉపనిషత్తులలో

బృహదారణ్యక ఉపనిషత్తులో (4-4-22) ఉపవాస వ్రతాన్ని గూర్చి చెప్పబడింది. ఆత్మసాక్షాత్కారానికి బ్రాహ్మణుడు, అధ్యయనం, యజ్ఞం, దానం, తపస్సు ఉపవాసాన్ని పాటించాలని ఉంది. ఈ ఉపవాసాన్ని అనాశకేన= ఆహారం తీసుకొనకుండా అనే పదంతో సూచించాడు. ఏమీ తినకుండా, ఉపవాసాన్ని పాటించడం వల్ల ఆత్మను చేరుకోవటానికి ప్రయత్నిస్తారని అర్థం.

## మితముగా నుండుట సరియైనది

ఏమీ తినకుండా అనే పదానికి శంకరులు పూర్తిగా ఆహారాన్ని మానివేయడం కాదని, మానివేసినంత మాత్రంచే ఆత్మ జ్ఞానం పట్టుబడదని కనుక ఇక్కడ 'అశనం' అనగా భోగములని అర్థం చెప్పాలని శంకరులన్నారు. కామం ద్వారా అనుభవించే భోగాలను త్యజించాలని వ్రాసారు.

ఇట్టి కామం పోవాలంటే ఉపవాసమనే వ్రతం దోహదపడుతుంది. వారు పూజ, ఆలయాలు, పండుగలు, వ్రతాల తాత్పర్యాన్ని విశదీకరించారు. ఈనాడు ఏకాదశీ వ్రతాన్ని ఆచరిస్తున్నామంటే ఆఘనత వారికి దక్కుతుంది. అటువంటివారు ఏకాదశీ వ్రతాన్ని వద్దనరు కదా. వారు "పురాణానాం ఆలయం" కదా! అనగా పురాణాలకు నిలయం కదా! ఆ పురాణాలు ఏకాదశీ వ్రతాన్ని కొనియాడాయి కదా!

ఏకాదశినాడు భోజనం చేయకపోవడం గొప్పదే. అంతమాత్రంచే ఫలం సిద్ధించదు. మరణానంతము ఉపవాసం ఉంటానంటే అర్థం లేనిమాట. అపుడు ప్రకృతి ఊరుకొంటుందా? అపుడు మనస్సును నియమించగలమా? కనుక పై ముఖ్యార్థం చెప్పి అందించారు. కృష్ణుడు కూడా కేవలం శరీరాన్ని బాధ పెట్టడాన్ని సమర్థించలేదు.

**యో గేఽస్తి నైవాత్యశతో నచైకాంతం అనశ్నతః (6-16)**
**యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు**
**యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా(6-17)**

అనగా మిక్కిలి తినేవారికి అసలే తిననివానికి యోగం పనికిరాదని అన్నాడు.

పరిమితమైన ఆహారపు విలువలున్నవానికి జపతపాది కర్మల పట్ల తగిన ప్రయత్నం చేసేవానికి పరిమితమైన నిద్ర, మెలకువలు కలవానికి ఈ యోగం దుఃఖాన్ని పోగొడుతుంది.

చాలా రోజులు ఉపవాసం ఉండడాన్ని శాస్త్రాలు అంగీకరించలేదు. అట్లా మనశ్శుద్ధి ఏర్పడదు. పిచ్చి పడుతుంది కూడా. స్మరణశక్తి పోతుంది. ఏకాగ్రత కుదరదు. అప్పుడప్పుడుండేవానికి మనస్సు శుద్ధి పొందుతుంది. అందుకే ఏకాదశినాడు ఉపవాసం ఉండాలన్నారు.

అతి పనికి రాదని అందరూ అన్నారు. కేవల యజ్ఞోపవీతధారణం వల్ల బ్రాహ్మణుడు సదాచారంలో ఉన్నట్లు పరిగణిస్తామా? అంత మాత్రంచే ఉపనయన సంస్కారం వద్దంటున్నామా? కనుక వాటిలోని పరమార్థాన్ని గ్రహించాలి. యజ్ఞోపవీత ధారణం మంచిదే. అంతకంటే మంచిది సత్ప్రవర్తనం. అదే అర్థంలో నూరు యజ్ఞాలు చేయడం కంటె ఒక్క ప్రాణిని హింసించకుండా ఉండడం మేలని తిరుక్కురల్‌లో ఉంది. కనుక ఒకదానిని ప్రశంసిస్తున్నప్పుడు మిగిలినదానిని తక్కువచేసి చెబుతాం. అగ్నిని విడిచినంత మాత్రంచే సన్యాసి కాదు, కర్మలు మానవేసినంత మాత్రంచే సన్యాసి కాదనే మాటల పరమార్థాన్ని గ్రహించండి.

**న సన్యాసీ చ యోగీ చ నిరగ్నిః నచ అక్రియః (6-1)**

అగ్ని హోత్రాది కర్మలు, పూజలు, సంఘసేవ వంటివి సన్యాసి చేయకూడదనే నియమాలు. అయితే పైవాటిని విడిచిపెట్టినంత మాత్రంచే

సన్యాసి అవుతాడా? దానికి సమాధానంగా కర్మఫలాన్ని కోరకుండా చేయవలసిన కర్మను ఎవడు చేస్తున్నాడో అతడే సన్యాసియని అతడే యోగియని కూడా చెప్పాడు:

**అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతి యః**

ఇట్లా చెప్పడం వల్ల నేను సన్యాసాశ్రమంలో అగ్నిని విడిచిపెట్టి ఉన్నానంటూ స్వార్థం కోసం పనులు చేసినవాడు సన్యాసి కాదని సారాంశం. తాను కర్తననే భావాన్ని విడిచిన వాడే సన్యాసి. దైవవశాత్తు కర్మ అతని నెత్తిన బడినా కర్మఫలాలను ఏమాత్రం ఆశించకుండా ఉంటాడన్నమాట.

'అనాశకేన' – అనినపుడు ఎట్లాగూ ఉపవాసం వస్తుంది. అంతకంటె ఇంద్రియ సుఖాలను, కోరికలను విడిచిపెట్టడం ముఖ్యమని సారాంశం. అంటే సాత్త్వికాహారాన్ని తినుట, కొన్ని రోజులలో ఉపవాసముండుట చేయవలసినవే.

## ఇంట్లో వ్రతాలు, పండుగలు, ఏకాదశి

కార్తిక వ్రతం, షష్ఠివ్రతం, శ్రావణ వ్రతం, ఋషి పంచమి మొదలైనవి ఎన్నో వ్రతాలున్నాయి.

మిగిలిన వ్రతాలలో పూజానంతరం ఫలాహారం ఉంటుంది. ఏకాదశినాడు కటిక ఉపవాసమే.

ఇక శైవ వ్రతాలు వైష్ణవులు, వైష్ణవ వ్రతాలు శైవులూ చేయరు. కాని ఏకాదశి, అందరికీ సమానమే.

పద్మపురాణంలో ఒక కథ ఉంది. విష్ణువు నిద్రిస్తూ ఉండగా ఒక అసురుడు క్రూరకృత్యాలు చేస్తూ ఉండేవాడు. అతణ్ణి సంహరించడానికి విష్ణు శరీరం నుండి ఒక శక్తి పుట్టింది. దానికి ఏకాదశియని పేరు పెట్టాడు విష్ణువు.

అప్పటినుండి ఏకాదశి వ్రతం వచ్చింది. అమృత మంథన సమయానికి ఈ ఏకాదశి సంబంధం ఉందని వైష్ణవులనగా, శివుడు గరళం త్రాగిన రోజు ఈనాడు కనుక ఆ రోజున ఏమీ తినకూడదనే నియమం పుట్టిందని శైవులంటారు. ఇది తిథి యొక్క గొప్పదనం.

ఇక ఆదివారాలు, అమావాస్య, పూర్ణిమ రోజులలో పగలు తిని రాత్రి ఏమీ తినకూడదు. ప్రతి అష్టమి, చవితి రోజులలో పగలు భుజించకుండా రాత్రి తినాలి. రామనవమి, గోకులాష్టమి, శివరాత్రులందు కూడా ఉపవాసాలుండాలన్నారు. కాని ఆచరణలో శివరాత్రినాడే ఉపవాసం ఉంటారు. మిగతావాటిల్లో పూజానంతరం తింటారు. (కృష్ణ జయంతి, రాత్రి గడుపుతారు కనుక ఫలాహారాన్ని తీసుకొంటారు)

## గురువారాలలో ఉపవాసము ఉండడమూ ఉంది

దక్షిణ దేశంలో శనివారాలుంటారు. ఆనాడు రాత్రి ఏమీ తినరు. వేంకటేశ్వరుని ఉద్దేశించి యుంటుంది. ధర్మశాస్త్రంలో లేకపోయినా.

అట్లాగే సోమవారాలలో జైనులు, స్మార్తులూ ఉపవాసం పాటిస్తారు. ఉత్తరదేశంలో శైవవైష్ణవ భేదం లేకుండా అందరూ సోమవారం వ్రతాన్ని పాటిస్తారు. అందువల్లనేమో ప్రతి సోమవారం ఉపవాసం ఉండి ఆహారాన్ని పొదుపు చేయండని లాల్ బహదూర్ శాస్త్రి అనేవారు. ఇది మంచి సలహా.

చాంద్రాయణమని మరొకటి ఉంది. దీనిని కృచ్ఛ్రమంటారు. ఇది చేయలేనివాడు వేలకొద్దీ గాయత్రిని చేయాలన్నారు. అదీ కుదరకపోతే గోదానం చేయాలన్నారు. దానికిచ్చే దక్షిణ బాగా తగ్గి మొక్కుబడిగా చాలా తక్కువ దక్షిణనిస్తున్నారు.

చాంద్రాయణంలో చంద్రుడి కళలు బట్టి తీసుకునే ఆహారం తగ్గిస్తూ తరువాత పెంచుతూ పోవాలి. ఇందులో పూర్ణిమనాడు 15 ముద్దలు,

రానురాను ఒక్కొక్క ముద్దను తగ్గించడం అమావాస్యనాడు ఉపవాసం తరువాత పున్నమిదాకా ఒక్కోముద్ద పెంచడం చేయాలి.

## ఏకాదశి ఔన్నత్యం

వ్రతోపవాసాలలో ఏకాదశిని మించినది లేదు.

న గాయత్ర్యాః పరం మంత్రం, న మాతుః పర దైవతం

నకాశ్యాః పరమం తీర్థం నచ ఏకాదశ్యాః సమం వ్రతం

అనగా గాయత్రిని మించిన మంత్రం, తల్లిని మించిన దైవం, కాశిని మించిన క్షేత్రం, ఏకాదశి కంటె ఉత్తమమైన వ్రతం లేదని అర్థం. ఇక ఏ వయస్సు వారుపాటించాలి?

అష్టవర్షాధికః మర్త్యః అపూర్ణాశీతి వత్సరః

ఏకాదశ్యాం ఉపవసేత్ పక్షయోరుభయోరపి

అనగా ఎనిమిదవ ఏడు దాటినప్పటినుండి 80 సం॥ల వయస్సు వచ్చేవరకు నెలలో వచ్చే రెండు పక్షాలలో వచ్చే ఏకాదశిని పాటించాలి. అనగా ఉపవాసం ఉండాలి. ఇందులో సంప్రదాయం గాని, జాతిగాని పేర్కొనబడలేదు. స్త్రీలని, పురుషులని లేదు. దయతో 8 సంవత్సరాలు లోపు వద్దని 80 దాటిన తర్వాత వద్దనీ అన్నారు. అంతమాత్రంచే వారసలే పనికిరారని చెప్పలేదు. ఓపిక ఉంటే వారూ చేయవచ్చు. లేకపోతే మానవచ్చు. బిడ్డలకు ఆనాడు తల్లులు పాలీయరని భారతంలో చెప్పబడింది. అయినా వారి నమ్మకం వల్ల పిల్లలు బాగానే ఉండేవారు. కాని ధర్మశాస్త్రం అలాంటి తీవ్రమైన నియమాలు విధించలేదు.

భగవంతుడు కరుణిస్తాడని పూర్తి నమ్మకం ఉంటే అటువంటి నియమాలతో చేయాలి. అది లేనపుడు కేవలం కృశించడం వల్ల ప్రయోజనం

లేదు. ఇందులో ఒక పూట ఫలాహారం చేయవచ్చు. (ఇడ్లీలు, దోసెలు వంటివి కావు) అదీ చేయకపోతే ఒక పూట భుజించి మరొక పూట ఫలాహారం చేయవచ్చు.

అసలు, ఏకాదశిలో నీరు కూడా త్రాగకూడదు. (జ్యేష్ఠ మాసంలో వచ్చేదానికి నిర్జలైకాదశియని పేరు) కుదరనపుడు పాలు మొదలైనవి ద్రవపదార్థాలను గ్రహించాలి. అదీ కుదరకపోతే ఒక పూట ఉప్మా వంటిది, రెండవపూట పాలు గ్రహించవచ్చు.

ఇంతకంటె వెసులుబాటుకై ప్రయత్నించకండి. అసలు వండిన పదార్థాన్ని ఏకాదశినాడు తింటే వారికి ప్రాయశ్చిత్తం లేదన్నారు. రోగగ్రస్తులు, బలహీనులు గంజి వార్చని అన్నం, ఉప్పు, మిర్చి వంటివి లేకుండా గ్రహించవచ్చు. ఏకాదశినాడు మిగిలినవారు తింటే చెప్పలేని మాటలతో దానిని నిందించారు.

## ఉపవాసం - పనిభారంలో

ఏకాదశినాడు సెలవు కుదరకపోతే ఎట్లా పని చేయడం? దీనిని రెండు విధాల పరిష్కరించవచ్చు. అందరూ ఆనాడుపవాసం ఉంటే ఆ రోజు సెలవు దినంగా ప్రకటించండని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేయండి. రెండవదేమనగా ఒక రోజు తిననంత మాత్రంచే శక్తి ఏమీ తగ్గిపోదు. ఈ రోజు అన్నం తినలేదు, ఎట్లా అనే బాధను ముందు తొలగించుకోవాలి. లేకపోతే లేనిపోని నీరసం ముంచుకువస్తుంది. ఆ భావన లేకపోతే చాలా ఉత్సాహంగా ఉంటుంది. ఎక్కువ పని చేయవచ్చు కూడా. మనం నడిపించేటట్లుగా నడిచే లక్షణం శరీరంలోనే ఉంది.

అన్ని ఏకాదశులట్లా కుదరకపోయినా ఆ రోజు ఫలాహారం చేసి ఉండవచ్చు. సంవత్సరంలో ఒక్క ఏకాదశినాడైనా పూర్తిగా ఆహారాన్ని

విసర్జించండి. కనీసం వైకుంఠ ఏకాదశినాడైనా. భీమునికి ఆకలి ఎక్కువ. అన్ని ఏకాదశులలోనూ ఉపవాసం ఉండలేనని ఒక ఏకాదశినాడు ఉపవాసం ఉంటే అన్నిటి ఫలితం రావాలని వ్యాసుని దగ్గర వరం పొందాడట. అయితే అతని పేరున ఉన్న భీమ ఏకాదశి, వైకుంఠ ఏకాదశి ఒకటి కావు.

రెండు మూడు తరాలనుండి ఈ చక్కని ఆచారం దేవారి పోతోంది. ఎక్కడో ఏ ముసలి మధ్వ స్త్రీలు ఒకరిద్దరు ఉపవాసం ఉండడం వల్లనే దేశం సుభిక్షంగా ఉంది.

## మధ్వులలో నియమపాలన

అందరికంటె మాధ్వులు ఏకాదశిని తప్పక పాటిస్తారు. కర్మలలో మంత్రాలకే ప్రాధాన్యం. ఇక పితృకర్మ దేవకర్మలలో పితృకర్మకే ప్రాధాన్యం. తరువాతనే దేవకర్మ శ్రాద్ధంలో వేదమంత్రాలుంటాయి, ఆ పైన పితృకర్మ కూడా. అయితే ఉపవాసంలో వేదమంత్రాలకు తావులేదు. నామజపం, భజనలే ఉంటాయి. ఇవి పురాణాలకు చెందినవి. ధర్మశాస్త్రంలో ఉపవాసం చెప్పబడినా ఇది స్మార్త కర్మ కాదు. స్మృతులననుసరించి స్మార్తకర్మలు కదా. ఇది దేవారాధనకు చెందింది. శ్రాద్ధంలో ఉన్నట్లు పితృదేవతల ఆరాధన వంటిది కాదు.

శ్రాద్ధం వైదికమైనది. భోక్తలు తినిన తరువాత శేషాన్ని తప్పక తినాలి. దీనిని పితృశేషమంటారు. తీసుకోకపోతే దోషం కూడా.

అయితే శ్రాద్ధం ఏకాదశినాడు వస్తే ఏం చేయాలి? ఆనాడు శ్రాద్ధం పెట్టి పితృశేషాన్ని స్మార్తులు, వైష్ణవులూ గ్రహిస్తారు. కాని మాధ్వులు ఆనాడు చేయకుండా ఉపవాసముంటారు. వారికి ఏకాదశీవ్రతమే ముఖ్యం. ద్వాదశినాడు పితృకర్మను చేస్తారు. పురాణాలలో ద్వాదశిపారణ వెంటనే చేయాలి కనుక శ్రాద్ధాన్ని అపరాహ్ణకాలంలో పెట్టబడడానికి బదులు ప్రొద్దున్నే పెడతారు.

ఏదైనా మైల, పురుడు వంటివి వచ్చినా ఏకాదశిని పాటించాలని అన్ని సంప్రదాయాలవారూ అంటారు. మిగతా సందర్భాలలో ఉపవాసానికి ఫలం లేకపోయినా ఏకాదశి ఉపవాసానికి ఎక్కువ ఫలమని భావిస్తారు.

## ఏకాదశిని పాటించిన గొప్పవ్యక్తులు

రాజులనుభవించే దానిని రాజభోగ మంటారు. వారన్ని భోగాలను అనుభవించవచ్చు. కాని ఏకాదశి ఉపవాసం వారికీ ఉంది. ఉపవాసం అంటేనే అంబరీషుడు, రుక్మాంగదుడూ గుర్తుకు వస్తారు. లేచీ లేవగానే స్మరింపదగినవారిలో భాగవతోత్తములున్నారు. వారికి ముందుగా నమస్కరించాలి:

ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాన్
రుక్మాంగద అర్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యాన్ ఇమాన్ పరమభాగవతాన్ స్మరామి

ఇందు అంబరీషుడు, రుక్మాంగదుడూ ఉన్నారు. వీరు ఏకాదశిని తు.చ. తప్పక పాటించేవారు కనుక వీరూ ఉన్నారు.

రుక్మాంగదుడు తానే కాకుండా ప్రజలందరూ దీనిని పాటించాలని కట్టడి చేసాడు. వారు భక్తి జ్ఞానాలలోనే గొప్పవారే కాక ఆరోగ్యం, దీర్ఘాయుర్దాయమూ కలిగియున్నారని నారద పురాణం చెప్పింది.

రాజులే కాదు, కైశికుడి వంటి అంత్యజులు కూడా దీనిని పాటించడం వల్ల వినుతికెక్కారు. వైష్ణవులు అతని పేరుతో నున్న కైశిక ఏకాదశిని ప్రత్యేకంగా పాటిస్తారు.

## ఏకాదశికి పేర్లు

సంవత్సరానికి 365 రోజులు కదా. 24 పక్షాల మించి కొన్ని రోజులుంటాయి. కనుక కొన్ని సంవత్సరాలలో 25వ ఏకాదశి యుంటుంది. వీటని ఆచరించే విధానాలు, కథలూ, పురాణాలలో ఉంటాయి. ఇక వాటి పేర్లు.

ధనుర్మాసంలో (మార్గశిరంలో) వచ్చేది కృష్ణపక్ష ఏకాదశి ఉత్థాన ఏకాదశి. తరువాత వైకుంఠ ఏకాదశి శుక్లపక్షంలో వస్తుంది. దీనిని మోక్షైకాదశి యని పద్మపురాణం చెప్పింది. ఆనాడే క్షీరాబ్ధిమథనంలో అమృతం పుట్టింది, ఆనాడే ఉపనిషత్తులను పిలికి జ్ఞానామృతాన్ని భగవానుడిచ్చాడు, కనుక దీనిని గీతా జయంతి అంటారు. ఇక మూడవది కృష్ణ పక్షంలో వస్తుంది. ఇది సఫల. నాల్గవది ఆ మాసపు శుక్ల పక్షంలో వస్తుంది. అది పుత్రార్థ. మాఘంలోని కృష్ణ పక్షంలో వచ్చినది, షట్తిల. శుక్లపక్షంలోది జయ. తరువాత వరుసగా విజయ, ఆమలకి, పాప మోశనిక. కామద, వరూథిని, మోహిని, అపర, నిర్జలలు. భీముడు జ్యేష్ఠ మాసంలో వచ్చే నిర్జలైకాదశిని ఒక్కదానినే పాటించాడు. ఇది శుక్లపక్షంలో వస్తుంది. పదిహేనవది ఆషాఢ కృష్ణ పక్షంలోనిది. దానికి దిశయని పేరు. ఇప్పటినుండి విష్ణువు, యోగనిద్రలో ఉంటాడు. తరువాత శమిక, పుత్రార్థ (ఇంతకు ముందు వచ్చినది మరల వచ్చింది) అజ, పద్మనాభ, ఇందిర, పాపాంకుశ అనే ఆరు ఏకాదశులు కార్తిక కృష్ణ పక్షంలోని వచ్చే రమా ఏకాదశనాడూ భగవానుడు నిద్రిస్తాడు. ఇరువది నాల్గవదైన కార్తిక శుక్లపక్షంలో వచ్చేదానితో చాతుర్మాస్యం పూర్తి అవుతుంది. విష్ణువు మేల్కొంటాడు. కనుక ఇది ప్రబోధిని ఏకాదశి.

25వ ఏకాదశి కమల. ఏమీ తినకుండా ఉండడమే కాదు, భగవత్ సమీపంలో ఉండడానికి ప్రయత్నించాలి. ప్రార్థనాదుల ద్వారా. నామం,

జపం, ధ్యానాదులు చేయాలి. వీటివల్ల ప్రజలకు జ్ఞాన వైరాగ్యాలతో బాటు ఆరోగ్యమూ ప్రాప్తిస్తుంది.

## తృప్తి కలిగి యుందాం

పర్వ దినాలలోనైనా జిహ్వేంద్రియాన్ని అదుపులో పెట్టుకోలేకపోతే ఈ గడ్డమీద పుట్టి ఏం ప్రయోజనం? కడుపు ఖాళీగా ఉన్నా మానసికతృప్తి కల్గియుండాలి.

ఆకలిని పోగొట్టడానికే ఆహారం కాని రుచులకోసం కాకూడదని శంకరులన్న మాటను లోగడ పేర్కొన్నాను. రోగానికి మందెట్టిదో ఆకలియనే రోగానికి ఆహారమట్టిది. ఒక రోగం వస్తే ఒక మందు వేసుకొని పోగొట్టుకుంటాం. మరల తిరిగి రావచ్చు. కాని ఆకలి అనే రోగం మాటిమాటికీ వస్తుంది. వీడు తట్టుకోగలడా లేడా అని ఈశ్వరుడు చూస్తూ ఉంటాడు. అతని దయపై నమ్మకముంచి నియమించగలిగితే అతడు చేటినందిస్తాడు. ఒకచోటుకు ఏకాదశినాడు వెళ్లగా వారాతిథ్యమిస్తే తీసుకోక పోతే వారేమైనా అనుకొంటారని అనుకోకుండా మృదువుగా తిరస్కరించడం మంచిది.

బెంగాల్‌లోని విధవలు ఈ ఏకాదశీ వ్రతాన్ని నియమబద్ధంగా ఆచరిస్తారు. అక్కడి బ్రాహ్మణులు మత్స్య భుక్కులు. ఇక ఏకాదశియైతే మిగిలినవారికంటె అక్కడి విధవలు నియమ నిష్ఠలతో ఆచరిస్తారు. నీటి చుక్కను కూడా త్రాగరు. మండు వేసవిలో కూడా. ఒక్కొక్కప్పుడు ఆ వేడికి తట్టుకోలేక కొందరు చనిపోతూ ఉంటారు కూడా. పండితులు శాస్త్రాలలో ఏమైనా సడలింపు లేమైనా ఉన్నాయేమోనని చూసారు. ఏదైనా త్రాగవచ్చని శాస్త్రాలు చెప్పినా త్రాగమన్నారు. పోనీ నోటినుండి త్రాగకండి, చెవినుండైనా త్రాగండని పండితులున్నారు.

ఇంద్రియజయం లేకుండా ఏడమ్ ఏపిల్ పండుని తినడం వల్ల పతనం చెందాడని బైబిల్‌లో ఉంది కదా. నియమం ఉల్లంఘిస్తే పతనమే. ఒక మధుర పదార్థం తింటున్నప్పుడు నాల్కపై ఎన్ని క్షణాలుంటుందని ఆలోచించి చూడండి. పోనీ కడుపులో శాశ్వతంగా ఉంటోందా? తిరిగి ఆకలి వేయడం లేదా? అనే ప్రశ్నలు వేసుకుంటూ ఉంటే ఇంద్రియ జయం తనంతట తానే వస్తుంది.

## మౌనం - నోటికి పని తగ్గించుట

జ్ఞానేంద్రియాలు (కన్ను, ముక్కు మొదలైనవి) బయట ఏమున్నాయో తెలియ పరుస్తాయి. పనులు చేసేవి కర్మేంద్రియాలు. చేతులు, కాళ్ళు మొదలైనవి.

వీటిలో నోరు జ్ఞానేంద్రియము, కర్మేంద్రియము కూడా. ఏదైనా రుచి చూసి అదేమిటని నాల్క చెబుతుంది. ఇక మాట్లాడడం, పాడడం, నవ్వడం మొదలైనవి అనేక క్రియలను చేస్తుంది.

మిగతా జ్ఞానేంద్రియాలకంటె దీనికెక్కువ పని. చూస్తున్నప్పుడు, వింటున్నప్పుడు కన్నులకు, చెవులకు పెద్ద శ్రమ ఉండదు. కేవలం రుచి చూడడంతోటే నోరు సరి పెట్టుకుంటుందా? కొరుకుతుంది, నములుతుంది, మ్రింగుతుంది కూడా. ఈ క్రియలలో పన్ను, పెదిమలను కూడా కలిపాను. రెండు ఇంద్రియాలు తానైన నోరును అదుపులో పెట్టుకోవాలి. నోరు మూసుకో, పొట్ట కట్టుకో అంటున్నాం కదా. దానికి విరుద్ధంగా ప్రవర్తిస్తూ ఉంటాం. వీటి నిమిత్తం ఎక్కువ పనిని కల్పిస్తున్నాం. ప్రతిదానిని తినవద్దని, వాగుడుతనం పనికిరాదని శాస్త్రాలంటూనే ఉంటాయి.

అయినా ఉపన్యాసాలు, మైక్‌ల హడావిడి అంతా ఇంతా కాదు. ఇతరుల నెట్లా బాధిస్తున్నామనే ఆలోచన కూడా ఉండదు. మౌనంగా ఉన్నవానికి భంగం కలిగించకుండా ఉండగలిగితే అదీ సంఘసేవయే.

వాద ప్రతివాదాలు సంభాషణ వల్లనే కదా! ఉపవాసంనాడైనా మౌనంగా ఉండగలిగితే దెబ్బలాటలుండవు. మౌనేన కలహం నాస్తి. ఇదీ సేవయే. మౌనం వల్ల పూర్వపురుషార్థాలు సిద్ధిస్తాయని మౌనం సర్వార్థసాధనం అని ఉంది.

మనస్సును నియమించాలనే కనీసం మౌనం వహించడం మంచిది. నిరంతరం, ఏదో చెప్పాలనే కండూతి నుండి ఇది రక్షిస్తుంది. ముందిది అభ్యసించండి. తరువాత మనస్సు లొంగుతుంది.

## మౌనం - ముని స్వభావం

మనస్సును నియమించేవాడు ముని. అతని లక్షణం మౌనం. మాట్లాడకుండా ఉండడమే అతని ముఖ్య లక్షణమని భావించడం వల్ల మౌనం అంటే నిశ్శబ్దం అనే అర్థం వచ్చింది. అట్టి మనస్సును నియమించిన వానివల్ల మనకూ లాభం చేకూరుతుంది.

బ్రహ్మజ్ఞాని యైన ముని, నిశ్శబ్దంగా ఉండడం, లేకపోవడం విడిచి పెడతాడు. ముందు తత్త్వం వింటాడు, విద్వాంసుడౌతాడు, తర్కిస్తాడు, జ్ఞానం సంపాదిస్తాడు. నిష్ఠలో ఉంటాడు. అట్టి పరిస్థితిలో మానావమానాలను త్యజిస్తాడని ఉపనిషత్తు చెప్పింది. ఎట్లా కుదురుతుంది? అట్టి స్థితిని మనము చేరుకున్నపుడు అదేమిటో తెలుస్తుంది. అతనికి మనస్సున్నట్లే తెలియదు. ఏ కోరికలూ ఉండవు. ఇది మాట్లాడాలని కాని, మాట్లాడకూడదని కాని ఉండదు. ఒకవేళ ఉపదేశం ఈయవలసి వస్తే ఇస్తున్నట్లు కూడా భావించడు. దక్షిణామూర్తి స్థితిని అమ్మవారు అట్టివానికి ప్రసాదిస్తే తాను మౌనవ్రతాన్ని ఆచరిస్తున్నట్లు కూడా భావించడు. ఇది మౌనామౌనాల అతీతస్థితి.

అట్టి లక్ష్యం మనకు చాలా దూరంలో ఉంది. కొంతసేపైనా మౌన ఉపవాసాన్ని రుచి చూద్దాం.

## మౌన దివసాలు

కడుపుకు ఉపవాసాలు శాస్త్రాలు విధించినట్లుగా మౌనానికి కొన్ని వేళలను చెప్పాయి. మౌనేన భోక్తవ్యం అనగా తింటున్నప్పుడు మాట్లాడవద్దని. తింటున్నపుడు నోటికి మరొక పనిని అప్పజెప్పకూడదు. దానివల్ల జిహ్వాచాపల్యం తగ్గుతుంది. ఇది బాగుంది, ఇది బాగాలేదని అనం కదా!

మౌనాన్ని సోమ, గురు, ఏకాదశి రోజులలో పాటించవచ్చు.

పనిచేసేవారికి ఆదివారాలు ఉత్తమం. లేదా ఒక పూటైనా పాటించండి.

గాంధీగారికి ఎన్నో పనులు. అతడు జాతిపితగా కీర్తించబడ్డాడు. అటువంటివాడు వారానికి ఒకరోజు మౌన వ్రతాన్ని పాటించేవాడు. అట్టివారిని ఆదర్శంగా తీసుకోవాలి.

ఇక మౌనము, ఉపవాసము రెండూ కలిసి వస్తే మనసు సులువుగా లొంగుతుంది. పర్వదినాలలో ఆచరించి చూడండి.

విచక్షణా రహితంగా మాట్లాడుతూ ఉంటే ఇతరులను నిందిస్తూ ఉంటే వాగ్దేవి పట్ల అపచారం చేస్తున్నామని భావించండి. దీనికి ప్రాయశ్చిత్తంగా అమ్మవారి నక్షత్రమైన మూలానక్షత్రం రోజైనా మౌనాన్ని పాటించండి.

## మేల్కొంటూ

ఉపవాసం ఉండి, మాట్లాడకుండా ఉన్న రోజున కన్నులు తెరిచేయుంచండి. భగవత్ ధ్యానంపై మనస్సు లగ్నం కావాలి. కన్నులు తెరవండని అన్నారు కనుక ఆనాడు చలనచిత్రాలూ చూస్తూ కాదు. ఇక జాగరణ, ఏకాదశులలోనూ ఉంది. లోగడ చెప్పిన భోజన ద్వయం కాదు. భో - జన - త్రయం కావాలి. అంటే ఉపవాసం, భజన - జాగరణం - అట్లా చేస్తూ మెలకువగా ఉండాలి.

ఏమీ తినకపోయినా, అసలు నిద్రించకపోయినా యోగం పట్టుబడదని గీతలో ఉంది కదా.

నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాన్త మనశ్నతః

నచాతి స్వప్నశీలస్య జాగ్రతోనైవచార్జున

ఇట్టి సాధారణ నియమానికి పర్వదినాలలో ఉపవాసముండి నిద్రపోకుండా మెళకువగా ఉండి ఈశ్వరుణ్ణి స్మరించాలి. ఇది సాధారణ నియమానికి విరుద్ధంగా ఉన్నా ఈ జాగరణ, పర్వదినాలలో లాభదాయకం.

## ఆరంభం - అంతావస్థ

అభిప్రాయాన్ని ఏ రూపేణ; అందించకుండా ఉండడం మౌనం. కేవలం నోరు మూసుకొని సంజ్ఞలు చేయడం వల్ల మౌనమనిపించుకోదు. మరీ తప్పనిసరైతే పలక మీద వ్రాసి చూపించవచ్చు. ఎట్టి సంజ్ఞలు లేకుండా ఉండే దానిని కాష్ఠమౌనం అంటారు. అంటే కఱ్ఱలా ఉండడం.

క్రొత్తలో మౌనంగా ఉండడం కష్టమే. ప్రాథమిక దశలో వ్రాసిగాని, సంజ్ఞలు చేసిగాని పాటించవచ్చు. కనీసం ఆ రోజున నోటికి పని చెప్పం కదా! అంతవరకూ నయమే. ఇట్లా మనస్సు చేసే వెఱ్ఱి నృత్యాల అలలు లేని సముద్రంలా ఉండిపోగలం. అభ్యాసం వల్ల సాధ్యమే.

ఇట్టి మౌనం, ఈశ్వరారాధనకు సాధనమౌతుంది. క్రమక్రమంగా ఈశ్వరుడు వేరు, తాను వేరనే భావన పోయి ప్రత్యేక పూజలుండవు, మాట్లాడకుండా ఉండడమే కాదు, కన్నులు చూడవు, చెవులు వినవు. అసలాలోచనే మనస్సులో మొలకెత్తదు. అట్టి స్థితి అసలైన మౌనం.

గాఢనిద్రలో ఉన్నా ఏ పురుగో ప్రాకితే దానిని గెంటివేస్తున్నాం. చలిగాలి వీచినపుడు అప్రయత్నంగా దుప్పటి కప్పుకొంటున్నాం. అటూ ఇటూ

తిరుగుతున్నాం. మెళకువరాగానే ఇవి చేసినట్లు కూడా తెలియదు. మన ప్రయత్నం లేకుండానే మెదడు నరాల ద్వారా అసంకల్పిత చర్యగా చేయిస్తోంది. భయం రాగా అప్రయత్నంగా మూత్రవిసర్జన, దుఃఖ సమయంలో కడుపులో తీవ్రమైన గందరగోళం మొదలైనవాటిని అప్రయత్నంగా నరాలు చేస్తున్నాయి. ఇట్లా అన్నింటిలో దేహంతో ఉన్న సంబంధాన్ని పోగొట్టుకోలేక పోతున్నాం.

అయితే అసలు మౌనస్థితి ఏమిటి? కొండచిలువ శరీరం మీద ప్రాకినా తెలియని స్థితి. చలి, వేడి తెలియని స్థితి. నిష్ఠలో ఉండుట. కనుక శరీర భావన పోయినపుడు అసంకల్పిత చర్యలూ ఉండవు. శరీర రక్షణకై ఎట్టి ప్రయత్నమూ ఉండదు. అట్టివాడు జితేంద్రియుడు.

నిజమైన మౌనాన్ని అభ్యసిస్తే అన్ని భావావేశాలు మొలకెత్తవు. మనలో జ్యోతియుంది. ఆ నిప్పురవ్వ ఇంద్రియ ప్రభావాలనే బూడిదతో కప్పబడి యుంది. మౌనం వల్ల ఆ దుమ్ము తొలగిపోతుంది. అది మెరిసి మెరిసి దానికి మూలమైన పరమాత్మ జ్యోతిలో లీనమైపోతుంది. అది నివాత దీపంలా అనగా గాలిలేని చోట వెలిగే దీపంలా ఉంటుంది. ఇక జీవాత్మ పరమాత్మల భేదం ఉండదు.

ఒక పాత్రలో ముత్యం వేసి నిరంతరం కదుపుతూ ఉంటే ముత్యం ఎట్లా కన్పిస్తుంది? అట్లాగే ఆత్మ కూడా. ఇది కనబడాలంటే ముందు వాక్కును అదుపుకోవాలని శంకరులు వివేక చూడామణిలో అన్నారు:

యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధః

## భావాల నడ్డుకొనుట

మౌనాభ్యాసంతో భావాల వేగాన్ని అడ్డుకోవాలి. తూష్ణీం కించిత్ అంచితయేత్. ఇది కష్టమే. దేనినీ ఆలోచించకుండా ఎట్లా ఉండగలం?

ఏదీ ఆలోచించకుండా ఉండాలనడం కూడా ఒక ఆలోచనే. కాని ప్రయత్నం మానకూడదు. మన ప్రయత్నాన్ని చూసి పరమేశ్వరుడు సంతోషిస్తాడు.

మనస్సు ఆగినా ఆత్మజ్యోతి కనబడదు. వట్టి శూన్యస్థితియే. ఇది జ్ఞానస్థితి కాదు. ఆత్మానుభవమే పూర్ణ జ్ఞానము. ఆత్మజ్యోతియని అన్నాను. అది అగ్నిలా ఉంటుందా! కాదు. జ్ఞానాన్నే జ్యోతి అని అంటున్నాం. అట్లా జ్ఞానాన్ని పొందడం దేనినో తెలుసుకోవడానికి కాదు. తనను తాను తెలుసుకొనుటయే. ఇట్టి జ్ఞానానుభవం లేకపోయినా గాఢనిద్రలో బుద్ధి, ఏమీ పని చేయదు. అది తాత్కాలికమే. ఆత్మ లేదా ఈశ్వరుని తెలుసుకోవాలనే తీవ్రేచ్ఛయున్నపుడు ప్రయత్నం చేసినకొద్దీ ఆత్మలో నెలకొని యుండుట జరుగుతుంది. శూన్యస్థితినుండి భగవద్భావన కల్గుతుంది. అది ఒక ఎఱుక. ఇంద్రియ బాధలు లేని స్థితి. దుఃఖ స్పర్శ లేని స్థితి. ఆ జ్ఞానదశలో అన్ని భావాలూ, వాటి మూలాలూ మాయమై మనస్సు లీనమైయుండగా సంపూర్ణ మౌనస్థితి ఏర్పడుతుంది.

వాక్కునకు, మనస్సునకు అందనివాడు పరమాత్మ. ఆ మౌనంలోనే పరమాత్మ తత్త్వం ప్రకటింపబడుతుంది.

మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం

తనకు బయట నున్నదానిని తెలుసుకోవడం కాదు. అది తానే అగుట. అదే పూర్ణత్వం. శూన్యస్థితిలో మనస్సు లయమై పోతుంది. చివరి దశలో సమాధి. స్థితి కల్గుతుంది.

## ఈశ్వర భావన

ఇక మధ్యలో ఈశ్వరుణ్ణి తీసుకొనివచ్చాం. మనస్సు ఆగగా ప్రశాంతంగా ఉండగా ఈశ్వర స్మరణ, మరల భావాలను తీసుకొని వస్తోంది కదా! అభ్యాసం వల్ల ఆలోచనలను తీసివేయగలిగితే మిగిలేది శూన్యమే కాని సంతోషం

కాదు కదా! అయితే ఈశ్వరుణ్ణి స్మరించేటపుడు చెడ్డ భావాలలో మనస్సు మునిగిపోతే ఎలా? అప్పుడేమనుకుంటాం? శాశ్వత సుఖం మాట దేవుడెరుగు, శూన్యస్థితియే మేలు, చెడ్డ భావాలు లేకుండా ఉంటే చాలని భావిస్తాం.

అప్పుడు ఈశ్వరుణ్ణి స్మరించలేకపోతున్నామని బాధపడవద్దు. ప్రస్తుతం శూన్యస్థితిలో ఉండిపోదాం. అట్లా అందు నిలకడగా ఉంటే చెడ్డ భావాలు రానే రావు. సంపూర్ణ శరణాగతిని పొందితే ఈశ్వరుడు మనలో చెడ్డ భావాలను రానీయడు. ముందీశ్వర భక్తి, ప్రేమ అనేవి మానసికమైనవైనా చెడ్డ భావాల బాటలో పయనించకుండా ఉండడానికి దోహదం చేస్తుంది. మౌనంలో అన్నీ లయమైపోతాయి.

ఎవరినుండైనా భయం కలిగితే రక్షకభటుని అవసరం ఉంటుంది. అతడు దొంగను పట్టుకుంటాడు. అయితే ఆ భటుడు మనలను భయపెట్టడు కదా! కనుక చెడ్డ భావాలు పోవడానికి ఈశ్వరుణ్ణి స్మరించాలి. ఆ స్మరణ వల్ల మోక్షప్రాప్తి కలుగగా ఇక ఆ స్మరణమూ ఉండదు.

సజ్జన సహవాసమట్టిది. ఆ సత్సంగం వల్ల మిగిలిన బంధుత్వాలు పోయే స్థితి వస్తుంది. అన్నిటితో అనుబంధం, వెంటనే పోయేది కాదు. కనుక దుష్ట సహవాసం లేకుండా ఉండడానికి సత్సంగం కావాలి. పండు పక్వమై తనంతట తానే చెట్టునుండి క్రిందకు పడుతుంది. అట్లాగే అన్ని బంధాలూ పోతాయి. వ్యాకులం, ఆదుర్దా, విచారం లేని స్థితిలో ఉంటాం. అందువల్ల సత్సంగం వల్ల నిస్సంగత్వం వస్తుందని శంకరులన్నారు. సత్సంగత్వే నిస్సంగత్వం.

కనుక భగవత్ భావన వల్ల ఆలోచనారహిత స్థితి పట్టుబడుతుంది. ఇది మొదలు చెప్పిన శూన్యస్థితి కాదు. ఇది పూర్ణస్థితి. ఈ స్థితిలో ఏ ఆలోచనా ఉండదు.

